# మహానారాయణోపనిషత్

(శంకర, సాయన, యాస్క, భట్టభాస్కరుల భాష్యానుసారము)



THIS BOOK IS PUBLISHED WITH THE
FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
AID TO PUBLISH RELIGIOUS BOOKS

అనువాదము, వివరణ, రచన

శ్రీమతి ఎ. జి. ప్రసూన, M.A.,B.Ed ,

# కృతజ్ఞతలు

తిరుమల తిరుపతి దేవస్థానము వారు రచయితల కొసగు ఆర్థిక సహాయపథకము ప్రకారము వారిచ్చిన ఆర్థిక సహాయముచే ఈ గ్రంధము ప్రచురింపబడినది.

టి.టి.డి. కార్యనిర్వహణాధికారి అయిన డాక్టర్ పి. కృష్ణయ్య, ఐ.ఎ.యస్. గారికీ, సప్తగిరి సంపాదకులు 'జ్ఞానరత్న' బిరుదాంకితులు డా యస్.యస్. రామమూర్తి గారికి నా కృతజ్ఞాతాంజలులు

నా మాతామహులు, పూర్వాశ్రమంలో కర్రా రామశర్మ గారు – వారు తురీయాశ్రమంలో శ్రీ శ్రీ శ్రీ విమలానంద తీర్థులవారు నాకు చిన్న నాటి నుంచే పరావర విద్యలను పరిచయం చేశారు వారిపాదుకలకు నా నమస్కారములు.

వారి తరువాత నా తల్లి సుబ్బరత్నమ్మ గారు ఈ మహానారాయణోపనిషత్తులోని, పురుష సూక్తం, మంత్రపుష్పం, మహన్యాసం, విరజాహోమ మంత్రములను నిత్యమూ జాపిస్తూ నాకు వాటి ఎడ భక్తి భావాన్ని పెంపొందించింది. ఆమె నా తొలిగురువు ఆమెకు నా ప్రణామములు.

దత్తు తండ్రిగారు స్వాతంత్ర్యసమరయోధులు, చిన్నప్పటినుంచీ నన్ను ఆధ్యాత్మిక, సాంస్కృతిక కార్యక్రమాల్లోనా, రచనా వ్యాసంగాల్లో ప్రోత్సహించడమే గాక, ఈ గ్రంధరచన కవసరమైన సూచనలు, పరిశోధన గ్రంధములను సేకరించుట, వ్రాత ప్రతిని తయారు చేయుట, ప్రెస్ వారి ప్రూఫ్‌లు చూచుటలో తోడ్పడినందుకు వారికి నా నమస్కారములు

నా ఆత్మ సోదరుడు, సాహిత్య శిరోమణి, తి.తి.దే. ధర్మ ప్రచార పరిషత్తు మాజీకార్యదర్శి, ఆర్షధర్మ ప్రచారమును జీవితాదర్శంగా గలవారు, అనేక ఆధ్యాత్మిక గ్రంధకర్త, ముఖ్యంగా మేము ప్రచురించు గ్రంధములన్నింటికీ నివేదనల పంపించుటే గాక, అమితప్రోత్సాహమిచ్చిన శ్రీ సముద్రాల లక్షణయ్యగారికి కృతజ్ఞాతాభివందనములు.

ఈ గ్రంధములోని మంత్రములు చాలా క్లిష్టమైనది. వాటిని ముద్రించుట చాలా ప్రయాసతోకూడిన పని – ఆకార్యమును ఎంతో ఓపికగా, చక్కగా నిర్వహించి సకాలమున అందిచ్చిన బి.యల్. ప్రసాద్ – మంజూనాథ ప్రింటర్స్, వెంకటేశ్, వాసు, ముని, గంగాధర్, బాలక్రిష్ణ – బాలాజి జిరాక్స్ కు నా కృతజ్ఞతాభినందనలు.

ఇట్లు

బుధజన విధేయురాలు

ఎ.జి. ప్రసూన

# నివేదన

శిరోమణి శ్రీ సముద్రాల లక్షణయ్య
M A

మనుజుడు దుఃఖరాహిత్యాన్ని, సుఖప్రాప్తినీ కోరుకుంటాడు. ఆత్యంతిక దుఃఖనివృత్తి, పరమానంద ప్రాప్తి, అనేవి జీవితలక్ష్యాలని వేదాంతశాస్త్రం బోధిస్తున్నది.

కాని ఆత్మజ్ఞానం కలిగేటంతవరకూ దుఃఖం నశించదు. ఆత్మైక్యజ్ఞానం సాధించకుండా ఎన్ని జపతపాలు అనుష్ఠించినా, యజ్ఞాదులు నిర్వర్తించినా ప్రయోజనం శూన్యం. ఆత్మజ్ఞానం ఎలా కలుగుతుంది ? ఇందుకు శంకరభగవత్పాదులు చెప్పిన ప్రభోధమిది.

వేదాంతార్థ విచారేణ జాయతే, జ్ఞాన ముత్తమమ్,
తేనాత్యంతిక సంసార దుఃఖనాశో భవత్యను.
(వివేక చూడామణి - 47)

వేదాంతమనబడే ఉపనిషత్తుల తత్వాన్ని విచారిస్తేనే ఉత్తమజ్ఞానం కల్గుతుంది. అందువల్ల సంసార దుఃఖం సమూలంగా నశిస్తుందని పైశ్లోకానికి తాత్పర్యం.

ఉపనిషత్తులకు సాటిరాగల ఉత్తమ వాఙ్మయం ప్రపంచంలో మరొకటి లేదు. అవి ఆత్మ విద్యను, అనగా బ్రహ్మవిద్యను బోధిస్తాయి. 'అధ్యాత్మ విద్యా విద్యానాం' అని గీతాచార్యుడు బ్రహ్మవిద్యను తన స్వరూపంగా పేర్కొన్నాడు.

గీతకూ, బ్రహ్మసూత్రాలకూ ఆధారం ఉపనిషద్వాఙ్మయమే. ఈ మూడింటి సముచ్చయాన్నే ప్రస్థానత్రయ మన్నారు.

మహర్షులు తపోనిష్ఠలో ఉన్నప్పుడు వారికి గోచరించిన శాశ్వతసత్యాలే

మన్నది, బయటమన్నది, ఒకటైనప్పుడే మనకు జ్ఞానము కలుగును. అట్లు కానిచో మన పాండిత్యము జిత్తులు నేర్పబడిన కోతిచేష్టల వంటిదే యగును. శ్రీ రామకృష్ణుని బోధలు మనకు పాండిత్యము మాత్రమే గాక నిజమైన జ్ఞానము నొసంగును. యువకులు, వృద్ధులు, శ్రీ రామకృష్ణుని బోధలను చదివి లాభము పొందుదురుగాక !

15-11-1950 — చ. రాజగోపాలాచారి



చ. రాజగోపాలాచారి

ఇందలి వ్యాఖ్యలో సాయణులు, మరియు భట్టభాస్కరాదుల వివరణలు కూడా చేరివుండడం విశేషం మూలమంత్రం, దానికి ప్రతిపదార్థం, తాత్పర్యం – ఇందులో పొందుపరచడమయింది. అందుచేత ఈ గ్రంథం ద్వారా సామాన్యులు సైతం ఈ ఉపనిషత్తులోని విశేషాలను గ్రహించి ఆత్మోన్నతి పొందగలరు.

ఈ కాలంలో సంస్కృత పరిజ్ఞానం, అందులోనూ వైదిక సంస్కృత పరిచయం కలవారు చాలా అరుదైపోయారు. అందువల్ల ఇలాంటి ఉత్తమ వేదాంత గ్రంథాలకు ప్రతిపదార్థతాత్పర్యాలు వివరించే వ్యాఖ్యానాలు ఎంతైనా అవశ్యకాలు. జిజ్ఞాసువులు వీటివల్ల ప్రయోజనం పొందగలరు.

ఈ గ్రంథంవిలువ గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు. దీని ప్రచురణకు ఆర్థిక సహాయం అందించారు. గ్రంథాన్ని చక్కగా ముద్రించి ప్రచురణ కర్తలు పాఠకులకు మహోపకారం చేశారు.

శ్రీమతి జ్ఞాన ప్రసూన గారు ఈ కృతిని ఇలా దిద్ది తీర్చడంలో పెద్దలు స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ పవని వేణుగోపాల్ గారి ప్రోత్సాహం సమగ్రంగా ఉన్నది

"యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని"

అనివేదం మంచి పనులు చేయమని బోధిస్తున్నది. ఇలాంటి గ్రంథాన్ని పాఠకులకు అందిచడం కంటే మంచిపని మరేమున్నది.

గ్రంథ రచయిత్రి, ఆర్థిక సహాయం చేసిన దేవస్థానం వారు, ఇతర సహాయకులు అందరూ అభినందనీయులే.

దీనిని పఠించి ఆత్మలాభం పొందడమే ఇక పాఠకుల కర్తవ్యం.

తిరుపతి, సముద్రాల లక్ష్మణయ్య

15 2.2002.

# ఓమ్ - నాన్యః పంథా

తపోనిష్ఠాగరిష్ఠులును, తత్వజ్ఞులును, చరాచర శ్రేయోభిలాషులును, సర్వతంత్ర స్వతంత్రులును అగు మన మహర్షులు మనకు చూపిన మార్గము వైదిక మార్గము ఇహపరసౌఖ్యముల పొందుటకు, తుదకుజన్మరాహిత్యము పొందుటకు, అదితప్ప వేరేమార్గము లేదని వారు చాటి చెప్పిరి

ఆ మహర్షులు వారి అంతర్ దృష్టితో అపరోక్షముగా సందర్శించిన పరాపర విద్యలను తమతమ ఆశ్రమములలో యున్న వేలాది శిష్యులకు వారి వారి అర్హతలను బట్టి, వారిని నిశితమైన పరీక్షలకు బెట్టి, ఆ విద్యలను బోధించిరి వారు కులపతులు కులపతి అనగా పదివేలమందివిద్యార్థులకు తానే భోజన వసతి సౌకర్యములు కలిగించి ఉచితవిద్యాదానము చేయువాడు ఆ మహర్షులు ఆత్మసాక్షాత్కారానికి ఎంత ప్రాముఖ్యమిచ్చిరో అంతే ప్రాధాన్యాన్ని భౌతిక విజ్ఞానానికి కూడా ఇచ్చిరి వారు అంతరిక్షములోని గ్రహతారకల గమనమును లెక్కించిరి కాలమును, కల, కాష్ఠ, నిమిష, క్షణ, దిన, వార, పక్ష, మాస, వత్సర, కల్పములుగా విభజించిరి వారు శిక్ష, వ్యాకరణము, కల్పము, చందస్సు, నిరుక్తము, అను ఆరు వేదాంగములను, ఋగ్ యజుస్సామ అథర్వణ వేదములను, అష్టాదశపురాణములను, ఆయుర్వేదము ధనుర్వేదము, పూర్వోత్తర మీమాంసలను న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ షడ్దర్శనములను, గణిత, రేఖా, బీజగణిత, వృక్ష, జంతు, రసాయన శాస్త్రములను, భౌతిక పదార్థరహస్యములను అన్నింటినీ కనుగొని వాటిని తమ సంతతికి, పుత్రసమానులగు శిష్యులకు బోధించిరి వారు శబ్ద బ్రహ్మమును, నామ రూపాత్మక జగత్తును గూర్చి శాస్త్రీయముగా బోధించిరి వారు అష్టసిద్ధులను పొందిరి వారు తమ దివ్యశక్తులను కరుణామయులై, నిస్వార్థముగా అహంకారమమకార వివర్జితులై, సర్వభూతములను సమముగా భావించి లోక కళ్యాణార్థము, త్రివిధ శాంతులకే ఉపయోగించిరి వారు చూపిన మార్గములో నడచినంత కాలము, వేలాది సంవత్సరములుగా భరత ఖండము సుఖశాంతులతో వర్ధిల్లినది. అదే ఉత్తమ మార్గము భారతీయ సామాజిక విధానము,

నియంవంవంలన్నియంఆత్మసాక్షాత్కారమున కుద్దేశింపబడిన వే ధర్మానుసంధానములే దానిని మన బలహీనతగా భావించి, గ్రీకులు, సిధియనులు, మొఘలులు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులుమున్నగు విదేశీయులు మన సంస్కృతిని అణగ ద్రొక్కివేయ ప్రయత్నించిరి వారు మన భౌతిక సంపదను దోచుకో గలిగిరే కాని అధ్యాత్మిక సంపదను కదిలించలేక పోయిరి మన ఏకైక లక్ష్యము సత్య స్థాపన అసత్య నిర్మూలనము మన ఆత్మజ్ఞానచరిత్రము నిత్యనూతనము నిత్య సనాతనము - ధర్మసంస్థాపనయే మన అవతార పురుషుల లక్ష్యము – తత్స్థాపనకై వారు మనకు చూపిన మార్గము ఉపనిషన్మార్గము

విదేశీ దండయాత్రల వలన, వారి పాలనములో మన తంత్ర శాస్త్రములు, ఇంద్రజాల, మహేంద్రజాల మర్మవిద్యలు, యోగ విద్యలు, మంత్ర విద్యలు, రసాయన విద్యలు నామమాత్రముగా మిగిలియున్నవి అయితే మన సంస్కృతిని నిలబెట్టినది వేదాంతమే దానికి మూల గ్రంధములు ఉపనిషత్తులే ఉపనిషత్తనగా – (1) సమస్త సంసార క్లేశమునశించునట్టి ఉపాయమును సూచించునది అక్లేశమును నాశ మొనర్చునది (2) సాక్షాత్తు పరబ్రహ్మమును పొందించునది (3) గురువు దగ్గర కూర్చున్న శిష్యుల చేత గ్రహింపబడుతత్త్వము ఇది బ్రహ్మ విద్య (4) ఎవరీ బ్రహ్మ విద్యను బొంది ఆత్మభావముతో శ్రద్ధాభక్తులతో కూడుకొని యుంటున్నారో వారియొక్క జన్మ జరారోగ అనర్ధములను బేధించునది మనకు ప్రస్తుతము 108 ఉపనిషత్తులు మాత్రము లభ్యమగుచున్నవి వాటిలో పదింటిని ముఖ్యములని భావించుచున్నారు "ఈశకేన కఠప్రశ్న ముండ మాండూక్య తిత్తిరి ఐతరేయం చాందోగ్యం బృహదారణ్యకం తథా" ప్రతి వేదమునకు మూడు భాగములున్నవి మంత్రములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు మంత్ర సంపుటీలను సంహితలందురు. బ్రాహ్మణములు ఆయా ఆశ్రమములందుడు వారికి, కర్మల నాచరించువారికి విధి విధానముల తెలుపును ఉపనిషత్తులు పరబ్రహ్మతత్త్వమును తెలుపును ఋగ్వేదమునకు ఐతరేయ, కౌశీతకీ ఉపనిషత్తులు, ఈశ, తైతిరీయ, బృహదారణ్యకములు యజుర్వేదమునకు, కేన ఛాందోగ్యములు సామవేదమునకు, ప్రశ్నముండకములు అధర్వణ వేదములకు చెందినవి

ఈ మహానారాయణోపనిషత్తు, నారాయణ వల్లిగా తైత్తిరీయోపనిషత్తునందుకలదు వల్లియనగా ఎగబ్రాకేతీగ అని అర్థం అందులోని విషయాలను ఆచరణలో పెట్టడంవల్ల మానవుడు పైకి ఎగబ్రాకే తీగలాగ ఆధ్యాత్మిక సోపానాలను అధిగమించి బాగా పైపైకి పోయి ఆత్మానందరసజగత్తులో యుండగలడని భావము సంహిత, బ్రాహ్మణము, ఉపనిషత్తు అను మూడింటినీ కలిగియున్నదీ ఉపనిషత్తు

ఆసేతు హిమా చల పర్యంతము న గల శైవ, వైష్ణవ, శక్తి, గణేశ, సుబ్రహ్మణ్య, రామ మున్నగు దేవాలయములన్నింటిలోను, ఈ ఉపనిషత్తులోని మంత్రములతో ప్రతి నిత్యమూ కొన్ని వేల ఏండ్లుగా పూజలు జరుపబడుచున్నవి జన్మతః శూద్రుడైననూ సంస్కారముచే ద్విజులైన వారు త్రికాల సంధ్యావందనములను ఈ మంత్రములతోనే చేయుచున్నారు. ఇహపరసౌఖ్యముల సాధనకు, సమాజ శాంతి కొరకు చేయు వివిధ యజ్ఞవిధానముందులోనివే. మన వేదములు, ఉపనిషత్తులు, స్మృతులూ ఇన్ని వేల ఏండ్లు గడిచిననూ, వాటిలోని అధ్యాయములుగానీ, అను వాకములుగానీ, వాక్యములుగాని, వాటిని ఉచ్చరించు స్వరములు గాని మార్పులకు చేర్పులకు గురికాకుండ చెక్కుచెదరకుండా యున్నవి

ఆది కాలము నుంచీ ఆంధ్రదేశమున ఈ ఉపనిషత్తు స్థిరముగా యుంటున్నది

అందుచే ఈ ఉపనిషత్తులోని మంత్రములకు సాయనాచార్యుల, భట్ట భాస్కరాదుల వివరణలతో ప్రచురించి ఆమంత్రార్థములను తెలుపుటకే ఈ మా ప్రయత్నము మన ఆర్షసంప్రదాయమును అనుష్ఠాన పూర్వకముగా నిలబెట్టుచున్న మహాత్ముల కృషికి శిరసానమస్కరించుచూ ఈ మహానారాయణోపనిషత్తును మీ కరకమలముల యందుంచుచున్నాను

ప్రణామములతో

ఎ జి. ప్రసూన

## ఓం శ్రీ మహాగణాధిపతయేనమః
## మహానారాయణోపనిషత్
## యాజ్ఞ్యాపనిషత్

### శాంతిపాఠం ః

హరిః ఓం – శంనోమిత్రః శం వరుణః శంనోభవత్వర్యమాశంన ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణురురుక్రమః నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి తన్మామవతు తద్వక్తారమవతు అవతుమామ్ అవతువక్తారమ్ । ఓం సహనావవతు సహనౌ భునక్తు సహవీర్యంకరవావహై తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై

### ఓం శాంతిః శాంతిః శాంతిః

మాకు సూర్యుడు సుఖంకరుడగు గాక వరుణుడు సుఖంకరుడగు గాక ఇంద్రబృహస్పతి దేవతలు సుఖంకరులగుగాక సర్వవ్యాపియగు విరాట్పురుషుడు సుఖంకరుడగుగాక బ్రహ్మమునకు నమస్కారము ఓ వాయుదేవా । నీకు నమస్కారము ప్రత్యక్షమగు బ్రహ్మము నీవే । నిన్నే ప్రత్యక్షమగు బ్రహ్మముగా చెప్పుచున్నాను నిన్ను ఋతముగా చెప్పుచున్నాను. నిన్ను సత్యముగా చెప్పుచున్నాను నన్ను నీవు రక్షింతువు గాక । ఆచార్యుని రక్షింతువు గాక నన్ను రక్షింతువుగాక ! ఆచార్యుని రక్షింతువు గాక

ఉపనిషత్ ప్రతిపాదిత పరమాత్మ శిష్యాచార్యులమగు మమ్మిరువురను రక్షించుగాక । బ్రహ్మవిద్యాఫలమును మేమిరువురము కలసి మెలసి అనుభవించెదముగాక మేమిరువురము విద్యాసంబంధ సామర్థ్యమును కలిసి సంపాదింతుము గాక । మా ఇరువురి స్వాధ్యాయము తేజోవంతమగు గాక । మేమిరువురము ఒకరి నొకరము ద్వేషింపకొనకుందుముగాక । ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక త్రివిధ శాంతులు చేకూరుగాక ।

## ప్రథమో౽ను వాకః

అంభస్యపారే భువనస్యమధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్
శుక్రేణ జ్యోతీగ్‌షి సమను ప్రవిష్టః ప్రజాపతిశ్చరతి గర్భే అంతః (1)
అయం = ఈ పరమేశ్వరుడు, అంభస్య = పలువిధములగు సముద్రములందున్న ఉదకముల యొక్క, పారే = అవతలి భాగమందు, మహతః = (ఉండు) గొప్పదియగు (లోకాలోక పర్వతములు మున్నగువానికంటే గొప్పదియగు), మహియన్ = గొప్పవాడు, భువనస్య = భూగోళము యొక్క మధ్యే = మధ్య భాగమందు (మహీయాన్ = గొప్పవాడు), నాకస్య= స్వర్గలోకము కంటే, పృష్ఠే =ఊర్ధ్వభాగమందు మహతః =(ఉండు) గొప్పదగు (బ్రహ్మలోకము మున్నగు లోకములకంటే) మహాన్ = గొప్పవాడు (సః = ఆ పరమాత్మ) శుక్రేణ = (జీవ చైతన్య రూపమైన) ప్రకాశము చేత జ్యోతీంషి = భాసకములగు, అంతః కరణములను, సం అను ప్రవిష్టః = ప్రవేశించెను, గర్భే = బ్రహ్మాండమునందు, అంతః = లోపల, ప్రజాపతిః = విరాడ్రూపుడై, సంచరతి = సంచరించుచున్నాడు

ఆకాశముకంటె అధికమగు పరమాత్మ సముద్రమునందును, అంతరిక్షమునందును, దఃఖరహితమగు బ్రహ్మలోకముకంటే ఊర్ధ్వభాగమునందును, స్ఫుటమైయున్న తేజస్సుతో అంతః కరణములను ప్రవేశించెను బ్రహ్మాండమునందులోపల విరాడ్రూపుడై సంచరించుచున్నాడు. (అగ్నిర్మూర్థాచక్షుషీచంద్రసూర్యౌ (ముం = 2-1-4)

యస్మిన్నిదగ్‌ం సంచవిచైతి సర్వం యస్మిన్దేవా అధివిశ్వేనిషేదుః తదేవ భూతంతదు భవ్యమా ఇదం తదక్షరేపరమే వ్యోమన్ (2)

ఇదం - ఈ ప్రపంచమంతయు, యస్మిన్ = మూలకారణమగు ఏ అవ్యాకృతమందు, సంఏతిచ = (సృష్టికాలమందు ఉత్పన్నమై) కూడుకొని యుంటున్నదో, వియేతిచ = (ప్రళయకాలమందు) విలీనమై పోవుచున్నదో, యస్మిన్ = ఏ మూల కారణమందు, అధి = అధికులగు హిరణ్య గర్భ విరాడాది, విశ్వేదేవాః = దేవతలందరు, నిషేదుః = ఆశ్రయించి యున్నారో, తదేవ = అదియే అనగా సృష్టిస్థితిలయములందు దేవతలకు సైతము ఆధారభూతమగు ఆ

అవ్యాకృతమే), భూతం = అతీతమైన జగత్తు, తత్ఉ = అదియే, భవ్యం = భవిష్యజ్జగత్తు, ఇదం = ఈ వర్తమాన జగత్తు సైతము, తత్ఉ = అదియే, తత్ = అట్టి అవ్యాకృతము, అక్షరే = నా శరహితమగు పరమే = శ్రేష్ఠమగు, వ్యోమన్ = అకాశమువలె అమూర్తమగు పరమాత్మయందు (వర్తతే = ఉంటున్నది) ఈ సమస్త ప్రపంచముఎందు ఏకీ భవించియున్నదో దేవతలందరును ఏపరమాత్మయందు ఆశ్రయము పొందియున్నారో ఆ పరమాత్మ భూత భవిష్యద్వర్తమానములందు ప్రపంచాత్మకమై, నాశరహితమగు పరమ పదమునందున్నారు

(పారాంతరము) శంచవిశైతి = శం = సుఖమును ఏతిచ = పొందుచున్నదో, అను అర్థము

యేనావృతం ఖంచదివం మహీంచ యేనాదిత్యస్తపతి తేజసా భ్రాజసాచ యమంతస్సముద్రే కవయోవయంతి । యదక్షరే పరమే ప్రజాః ।। (3)
యేన =సచ్చిద్రూపమగు ఏకారణము చేత, ఖంచ = అంతరిక్షలోకము, దివంచ = ద్యులోకము, మహీంచ = భూలోకము, ఆవృతం =ఆవరింపబడినదో, యేన = ఏ పరమాత్మచే, (అనుగ్రహింపబడిన వాడై), ఆదిత్యః = సూర్యుడు, తేజసా = స్వకీయ మండలాంతర్గతమగు ప్రకాశము చేతను, భ్రాజసా = కిరణరూపమై వ్యాపించిన తేజము చేతను, తపతి = (ఈ జగత్తును) తపింపచేయు చున్నాడో = ప్రకాశింపచేయుచున్నాడో, కవయః = తత్త్వవేత్తలు, యం = ఏ పరమాత్మను, సముద్రే అంతః = సముద్రమనునది ఉపలక్షణము - అనగా జగత్తు యొక్క మధ్యమందు, వయంతి = తంతువులవలె వడుకుచున్నాడో,తత్ = ఆ బ్రహ్మతత్త్వము, అక్షరే = వినాశరహితమగు, పరమే = శ్రేష్ఠమగు (నిజస్వరూపము నందుండి), ప్రజాః = జీవులను, (ఉత్పాదయతి = పుట్టించుచున్నది).

తా ।। ఆకాశమును, స్వర్గలోకమును, భూమియును ఏ పరబ్రహ్మము చేత ఆవరింపబడియున్నదో, సూర్యుడు ఏ తేజస్సు చేతను కిరణ రూపమై వ్యాపించిన తేజము చేతను, స్వకీయ మండలాంతర్గతమగు ప్రకాశము చేతను ప్రకాశింపచేయు చున్నాడో, పండితులు, జనులు, సముద్రమధ్యమున చూచుచున్నారో, నాశరహితమగు పరమపదమునందు ఏదియున్నదో, అదియే పరబ్రహ్మము

ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ (బృహ ఉ 3-8-11)
సభగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి ? స్వేమహిమ్ని (చంధో 7-24-1)

**యతః ప్రసూతా జగతః ప్రసూతీ !**
**తోయేన జీవాన్వ్యస (చ) సర్జభూమ్యాం !**
**యాదోష దీభిః పురుషాన్పశూగ్‌శ్చ !**
**వివేశ భూతాని చరాచరాణి !! (4)**

యతః = (అవ్యాకృతోపహితమైన) = ఏ చైతన్యము వలన, జగతః = జగత్తు యొక్క, ప్రసూతీ = సృష్టి, ప్రసూతా = ఉత్పన్నమాయెనో, (ఆ చైతన్యము), తోయేన = జలవము ఉపలక్షణము, (పంచ భూతావములు అని అర్థము), భూతపంచకము చేత, జీవాన్ = మనుష్యులు, గోవులు మున్నగు ప్రాణులను, భూమ్యాం = భూమియందు, వ్యచసర్జ = విశేషముగా సృజించెనో, యత్ = చైతన్యరూప మాయావిశిష్టమగు ఏ కారణము, ఓషదీభిః = ఓషదులు మొదలగు వాని రూపము గల్గి, పురుషాన్ = మనుష్యులను, పశూంచ = పశువులను, చరాచరాణి = స్థావర జంగమ శరీరములన్నింటిని, వివేశ = ప్రవేశించెనో (అట్టి చైతన్యము చేతనే జగమంతయు పాలింపబడుచున్నది అని అర్థము).

తా జగత్ప్రసూతి భూతమైన ప్రకృతియున్నూ, మాయాశబలిత ఏ పర బ్రహ్మము నుండి పుట్టెనో, ఏ పరబ్రహ్మము భూమియందు పంచభూతములతో కూడ జీవులను సృజించి, ఓషదులతో కూడ పురుషులను, పశువులను, జంగమ స్థావరాత్మకములైన భూతములందు ప్రవేశించియున్నదో
**అతఃపరం నాన్యదణీయ సగ్‌హి !**
**పరాత్పరం యన్మహతో మహాంతమ్ !**
**యదేకమవ్యక్త మనంత రూపం !**
**విశ్వం పురాణం తమసః పరస్తాత్ !! (5)**
యత్ = ఏ వస్తువు, పరాత్ = ఉత్కృష్టులగు హిరణ్యగర్భాదులకంటె పరం మిక్కిలి శ్రేష్టమైనదో మహతః = గొప్పదగు అకాశాదికము కంటే, మహత్ = గొప్పదియో, యత్ = ఎయ్యది, ఏకం = సజాతీయ, విజాతీయ, స్వగత, భేద శూన్యమైనదో.

అవ్యక్తం = ఇంద్రియములకు అగమ్యమో, అనంతరూపం = దేశ, కాల, వస్తు, పరిచ్ఛేద శూన్యమో, విశ్వం = జగత్స్వరూపమో, పురాణం = అనాదిసిద్ధమో, తమసః = అజ్ఞానముకంటె, పరస్తాత్ = పృథక్కుగా వుండునో, అతః = ఈ వస్తువుకంటె, అన్యత్ = మరొకటి, అణీయసం = అతి సూక్ష్మమైనది యూ పరం = శ్రేష్ఠమైనదియూ, న = లేదు

తా ఏది పరాత్పరమై, మహత్తుకంటె మహత్తైనదియో, అదియేసూక్ష్మమునకంటె సూక్ష్మమైనది దీనికంటె సూక్ష్మమైనది మరేదియును లేదు అది అంధకారమున కంటె పరమందుండునదియు, అద్వితీయమును, ఇంద్రియాగోచరమును, అనంతస్వరూపమును, ప్రపంచరూపమును, అనాదియునై వున్నది

తదేవర్తం తదు సత్యమాహు ।
స్తదేవ బ్రహ్మ పరమం కవీనాం ।
ఇష్టాపూర్తం బహుధాజాతం జాయమానం ।
విశ్వం బిభర్తి భువనస్యనాభిః ॥
తదేవాగ్ని స్తద్వాయుస్త త్సూర్యస్తదు చంద్ర మాః
తదేవ శుక్రమమృతం తద్బ్రహ్మ తదాపస్స ప్రజాపతిః (7).

తత్ ఏవ = ఆ వస్తువే, ఋతం = ఋతం, తత్ ఉ = ఆ వస్తువే, సత్యం = సత్యమే, కవీనాం = వేదశాస్త్రజ్ఞుల కు ఆహుః = చెప్పిరి పరమం = ప్రమాణార్హమై ఆదరణీయమంగునదియు, తత్ ఏవ = ఆవస్తువే, ఇష్టాపూర్తం = ఇష్టాపూర్తకర్మలును, (తత్ = ఆ వస్తువే), బహుధా = పూర్వకల్ప, తత్పూర్వకల్పములందు అనేక విధములుగా, జాతం = పుట్టినట్టియు, జాయమానం = పుట్టుచున్నట్టియు, విశ్వం = ప్రపంచమునంతయును, భువనస్య = ప్రపంచమునకు, నాభిః = నాభిస్థానీయుడగు పరమాత్మ, బిభర్తి = భరించుచున్నాడు

తత్ ఏవ = ఏ వస్తువే, అగ్నిః = అగ్ని, తత్ ఏవ = ఆ వస్తువే, వాయవః = వాయువు, తత్ = ఆవస్తువే, సూర్యః = సూర్యుడు, తత్ఉ = ఆవస్తువే, చంద్రమః = చంద్రుడు, తత్ ఏవ = ఆవస్తువే, శుక్రం = ప్రకాశించుచున్న నక్షత్రాది తేజస్సు,

అమృతం = దేవతలకాహారమగు అమృతము, తత్ ఏవ = ఆవస్తువే, బ్రహ్మ = హిరణ్యగర్భ స్వరూపము, తత్ = ఆవస్తువే, అపః = జలములు (పంచ భూతములును), సఃపి = ఆవస్తువే, ప్రజాపతిః = విరాడ్రుపుడును, అగుచున్నాడు (7)

తా।। బ్రహ్మవేత్తలు దానినే స్వరూపాన్యథాభావలక్షణ, స్వభావాన్యథాభావలక్షణ, వికారాది ద్వయము లేని దానినిగా చెప్పుచున్నారు అదియే క్రాంతదర్శులైన విద్వాంసులకు పరబ్రహ్మ స్వరూపమై, భూత, భవిష్యద్రూపమై, అగ్నీంద్రాది దేవతాంతర సంబందిత్వము చేత, అనేక విధములైన యాగాది శ్రౌతరూపమును, ఖాతాదిస్మార్త రూపమునగు సమస్త కర్మను స్వీకరించుచూ, ఆ కర్మఫలములను ఇచ్చుటచేత సర్వాధారమైయున్నది

(ఆ విద్యా దృష్టిచే ఈ ప్రపంచమంతయు నానా విధములుగా కనబడుచున్నది. విద్యాదృష్టిచే అఖండైక రస బ్రహ్మరూపమగుచున్నది యత్రహిద్వైతమివ భవతి, తదితర ఇతరం పశ్యతి, యత్రత్వస్య సర్వమాత్మై వాభూతత్కేన తంపశ్యేత్ = అచట ఎవడు ఎవనిని చూచును ? ఇది విద్యా దృష్టి (6)

అగ్నియును, వాయువును, సూర్యుడును, చంద్రుడును, తేజస్సును, అమృతమును (దేవతలకాహారము, మోక్షము), బ్రహ్మమును, ఉదకములును, బ్రహ్మయు, సర్వమును ఆ పరమాత్మయే అయివున్నది. (7)

సర్వేనిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి కలాముహూర్తాః కాష్ఠాశ్చాహోరాత్రాశ్చసర్వశః (8) అర్థమాసామాసా ఋతవసంవత్సరశ్చ కల్పంతాం స ఆపః ప్రదుఘే ఉభేఇమే అంతరిక్ష మథో సువః ।। (9)

విద్యుతః = స్వయం ప్రకాశుడగు, పురుషాత్ = పురుషుని వల్ల నుండి, సర్వే = సమస్తములైన, నిమేషాః = నిమిషములు, అధిజజ్ఞిరే = పుట్టెను, సర్వశః = అన్ని విధములైన, కలాః = కళలు, ముహూర్తాః = ముహూర్తములు, కాష్ఠాశ్చ

= కాష్ఠలు, అహోరాత్రాశ్చ = అహోరాత్రములు, అర్ధమాసాః = పక్షములు, మాసాః = మాసములు, ఋతవః = ఋతువులు, సంవత్సరః = సంవత్సరములున్ను, కల్పంతాం = (ఆ పరమేశ్వరునుండియే) పుట్టెను, సః = ఆ పరమాత్మ, అపః = ఇచట (జలోపలక్షితమగు పృద్వి అని అర్థము), ప్రదుఘే = పితికిన వాడాయెను, (అటులే) అంతరిక్షం = అంతరిక్షమును, అథో = మరియు, సువః = స్వర్లోకము, ఉభే = ఈలోకద్వయమును, ప్రదుఘే = పితికిన వాడాయెను, (అనగా ఆయాలోకములకు వలయు భోగ్యవస్తువులను కూడా కలుగుజేసెను)

తా॥ తేజోమయుడగు పరమపురుషుని వలన సమస్తమైన నిమిషములు పుట్టినవి. కాలభేదములగు కలా, కాష్ఠా, ముహూర్తాదులును, అహోరాత్రార్ధామాస, మాస ఋతు, సంవత్సరాదులును సృజించబడినవి (8)

ఆ పరమాత్మ జల శబ్దోపలక్షితమైన భూతసముదాయమును సృజించి తర్వాత అంతరిక్షమును, స్వర్గమును సృజించెను

విశేష - పదునెనిమిది (18) నిమిషములు ఒక కాష్ఠ, ముప్పైకాష్ఠలు ఒక కల, ముప్పై కలలు ఒక క్షణం, పన్నెండు క్షణములు ఒక ముహూర్తము, ముప్పై ముహూర్తములు ఒక అహోరాత్రము పదునైదు అహోరాత్రులు ఒక పక్షము, "త్రుటి నళినీ పత్ర సంహత్యాః సూక్ష్మ, సూచ్య, భిభేదనే, దలేదలేతు యః కాలః సకాలోలవ వాచకః" = తామరాకులను పోగుపెట్టి, సన్నని మొనగల సూదితో ఆ ఆకుల పోగును గుచ్చిన యెడల ఒక్కొక్క ఆకుమీద సూది దిగుటకు ఎంతకాలము పట్టునో ఆ సమయములవ మనబడును అట్టి లవములు ముప్పై యైనచో ఒక త్రుటియగును.

నిమిషము = మిథిలాధి పతియైన నిమి యనురాజా రెప్పపాటు వుండునట్లు వరము పొందెను అందుచే రెప్పపాటు కాలము నిమిషమునబడును

నైనమూర్ధ్వం నతిర్యంచం నమధ్యేపరిజగ్రభత్ నతస్యేశే కశ్చిన తస్యనామ మహద్యశః (10)

నసందృశే తిష్ఠతి రూపమస్య, నచక్షుషాపశ్యతి కశ్చనైనం హృదామనీషా మనసాభిక్లుప్తోయఏనం విదు రమృతాస్తే భవంతి !! (11)

కశ్చన = కఃచన = ఎవడున్నూ, ఏనం = ఈ పరమాత్మను, ఊర్ధ్వం = స్తంభమువలె ఊర్ధ్వాకారముగల వానినిగా, నపరిజగ్రభత్ = గ్రహింపజాలడు, తిర్యంచ = తిర్యక్కుగా వుండు వానిగాను, న = గ్రహింపజాలడు, మధ్యే = గృహాదిమధ్యమందుగాని, న = గ్రహింపజాలడు, తస్య = అతని యొక్క, నామ = నామగ్రహణ మందుగాని, న ఈశే = సమర్థుడు కాజాలడు (కావుననే) మహద్యశః = మహద్యశుడను నామము కలిగెను అస్య = ఈ పరమాత్మయొక్క, రూపం = రూపము, సందృశే = ప్రాణులయొక్క దృష్టి విషయమందు, న = ఉండదు, కశ్చన = ఎవ్వడున్నూ, ఏనం = ఈ పరమాత్మను, చక్షుషా = నేత్రములచేతను, న పశ్యతి = చూడలేదు, హృదా = హృదయపుండరీకమందుండు నట్టియూ, మనీషా = లౌకిక వస్తు గోచరముకాని, మనసా = మనస్సుచేత, యే = ఏ పురుషులు, ఏనం = ఈ పరమాత్మను, విదుః = సాక్షాత్కారము చేసుకొనుచున్నారో, తే = వారు, అమృతాః = మరణ రహితులు, భవంతి = అగుచున్నారు

తా!! ఈ పరమాత్మ సర్వగతమైన ఊర్ధ్వాదిదేశ విశేషములేకపోవుట వలన, ఆయనను ఎవడును ఊర్ధ్వ తిర్యఙ్మధ్య ప్రదేశములందు తెలుసుకొనలేరు ఆ పరమాత్మకు వేరొక నియామకుడెవడూ లేడు నిఖిల జగజ్జనానాది లీలత్వ సర్వరక్షకత్వరూపమైన మహత్కీర్తి ఆయనకేయున్నది కాని మరెవ్వరికినీ లేదు (10).

ఈ పరమాత్మ యొక్క దివ్యమైన రూపము కన్నులకు గోచరమైనది కాదు ఎవడును ఈ పరమాత్మను నేత్రము చేత చూడడు. ఈ పరమాత్మ భక్తి చేతను, మనస్సు చేతను, గ్రహింపదగినవాడు. ఇటువంటి పరమాత్మను తెలిసికొనువారు మరణములేని వారగుచున్నారు

విశే – మరణమనగా ప్రాణము లేచిపోవుట తత్త్వవేత్తలందరి ప్రాణములు లేచిపోవుట లేదు నతస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయంతే (బృహ –

లేచిపోవుట లేదు  నతస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయంతే ( బృహ - 4-4-6) = బ్రహ్మవేత్త యొక్క ప్రాణములు ఉత్క్రమించుట లేదు  ఇచటనే లీనమగుచున్నవి.

అధ్భ్యస్సంభుతో హిరణ్యాగర్భ ఇత్యష్టౌ !  ఏషహిదేవః ప్రదిశోను సర్వా ః పూర్వోహి జాతస్స ఉగర్భే అన్త ః సవిజాయ మానస్స జనిష్య మాణః  (12)
హిరణ్య గర్భః = హిరణ్య గర్భుడు (సర్వభూతములకు ముందెన దేవుడు), అధ్భ్యః = ఉదకము వలన, సంభూతః = పుట్టెను.

ఇతి = ఈ ప్రకారము,  అష్టౌ = ఎనిమిది ఋక్కులను (అంబస్య పారా అను ఋక్కు మొదలుకొని సర్వేనిమేషా అను ఋక్కువరకు – 8 ఋక్కు లును), అధ్భ్యస్సంభూతా అను ఉత్తరాను వాకమును, విద్యుద్వర్ణాది లింగములతోకూడిన భగవత్స్వరూపమును చెప్పుచున్నవి), ఏషః = ఈ, దేవోహి = దేవుడే, సర్వాః = సమస్తములైన, ప్రదిశోను = దిక్కులయందుండెడి అనర్ధములననుసరించి, పూర్వః = మొదటివాడుగ, జాతోహి =పుట్టిన వాడు కదా, స ఉ = ఆ దేవుడే, గర్భే అన్తః = గర్భములోపల వుండు వాడును, సః = ఆ దేవుడే, విజాయమానః =పుట్టిన వాడును, సః = ఆ దేవుడే జనిష్య మానః = పుట్ట బోవు వాడును, ప్రత్యన్ముఖా ః = ప్రత్యగాత్మ శరీరముగా గల పరమాత్మ స్వరూపుడునై, విశ్వతోముఖః = సర్వ వ్యాపకుడుగా, తిష్ఠతి = వుంచున్నాడు

తా॥ తేజోమయుడగు హిరణ్యాగర్భుడను ఈ దేవుడు ఈ సమస్త పదార్థములకంటే పూర్వముదకముల వలన పుట్టి మొదటి వాడుగా నుండెను  గర్భముల లోపల యున్న వాడును, పుట్టిన వాడును, పుట్ట బోవువాడును – ఇవన్నియు ఆ దేవుడే ప్రత్యగాత్మయే శరీరముగాగల పరమాత్మ స్వరూపుడగు ఆ దేవుడు సర్వవ్యాపకుడుగా నుంచున్నాడు

వేదాహమేతం పురుషంమహాన్తమ్ !
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ !
తమేవం విద్వా నమృత ఇహభవతి !
నాన్యః పంథా విద్యతే ౭ యనాయ !!

(యః ఏ పురుషుడు, సర్వాణి = సమస్తములైన, రూపాది దేవ, మనుష్య శరీరములను, విచిత్యా = విశేషముగా పుట్టించి, నామాని = నామములను, కృత్వా = కల్పించి, అభివదన్ = వానిచే పిలువబడుచు, ఆస్తే= వుంటున్నాడో)
మహాన్తమ్ = గొప్పవాడును, ఆదిత్యవర్ణం = సూర్యుని వంటి కాంతి గలవాడు, తమసః = అంధకారముకంటె, పరస్తాత్ = అవతల నుండు వాడును (అగు), ఏతం = ఈ, పురుషం = పురుషుని, అహం = నేను, వేద = ఎరుగుదును, తం = ఆపురుషుని ఏవం = ఈ విధముగా, విద్వాన్ = ఎరిగిన వాడు, ఇహ = ఇచ్చటనే, అమృతః = ముక్తుడైన వాడు, భవతి = అగుచున్నాడు, అయనాయ = మోక్షము కొరకు, అన్యః = మరొక, పంథా = మార్గము, నవిద్యతే = లేదు

తా॥ ఏ పురుషుడు సమస్తములైన ప్రాణులను పుట్టించి, వాటికి నామములను కల్పించి, పరమాత్మగా వుంటున్నాడో, అంతటి గొప్పవాడును, సూర్యకాంతి కలిగిన వాడును, అంధకారమున కావలయుండువాడును అగు ఈ పురుషుని ఎరుగుదునని తెలుసుకొనిన వాడు ఇచటనే జీవన్ముక్తుడగు చున్నాడు  మోక్షము కొరకు వేరే మార్గము లేదు.

ప్రజాపతిశ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే
తస్యధీరాః పరిజానంతి యోనిమ్ । మరీచీనాం పదమిచ్ఛన్తి వేధసః ॥ (C)
ప్రజాపతిః = పరమేశ్వరుడు, గర్భే అంతః = బ్రహ్మాండములోపల, చరతి = (విగ్రహవంతుడై) చరించుచున్నాడు, అజాయమానః =పుట్టకపోయినను, బహుధా = బహువిధములుగా, విజాయతే = విశేషముగా పుట్టుచున్నాడు, తస్య = ఆపరమేశ్వరుని యొక్క , యోనిమ్ = జగత్కారణమగు వాస్తవ రూపమును, ధీరాః = మహాత్ములు, పరిజానంతి = ఎరుగుచున్నారు, వేధసః = బ్రహ్మలు, మరీచీనాం = మరీచి, అత్రి మున్నగు మహర్షుల యొక్క, పదం = స్థానమును, ఇచ్ఛన్తి = కోరుచున్నారు

తా॥ పరమేశ్వరుడు బ్రహ్మాండమునందు లోపల వెలుపల విగ్రహవంతుడై చరించుచున్నాడు  అతనికి వాస్తవముగా పుట్టుకలేదు. అయినను స్థావరజంగమాది బహువిధ రూపములచేత, విశేషముగా పుట్టుచున్నాడు  ఆ

పరమేశ్వరుని యొక్క జగత్కారణమగు వాస్తవరూపమును ధీరులు అనగా యోగబలము చేత ఇంద్రియములను నిగ్రహించిన మహాత్ములు మాత్రము తెలుసుకొనుచున్నారు. అట్టి పదమును పొందుటకు ప్రజాపతులు, మరీచి మొదలగు మహర్షులు సైతము కోరుకొనుచున్నారు

యోదేవేభ్య ఆతపతి, యోదేవానాం పురోహితః పూర్వోయో దేవేభ్యోజాతః, నమోరుచాయ బ్రాహ్మయే (D)
యః = ఏ పరమేశ్వరుడు, దేవేభ్యం = దేవతలకొరకు, ఆతపతి = అంతటా ప్రకాశించుచున్నాడో, యః = ఎవడు, దేవానాం = దేవతలకు, పురోహితః = పురోహితుడు ఆయెనో, యః = ఎవడు, దేవేభ్యః = దేవతల కంటే, పూర్వః = పూర్వమే, జాతః = పుట్టెనో (అట్టి), రుచాయ = స్వయం ప్రకాశమైనట్టి, బ్రహ్మయే = బ్రహ్మకొరకు, నమః = నమస్కారము.

తా. ఏ పరమేశ్వరుడు దేవతలకొరకు, అంతటా ప్రకాశించుచున్నాడో వారికి బృహస్పతి వలె పురోహితుడాయెనో, వారికంటె పూర్వమే పుట్టెనో అట్టి స్వయం ప్రకాశమైన పర బ్రహ్మమునకు నమస్కారము

రుచం బ్రాహ్మం జనయంతః । దేవా అగ్రే తదబ్రువన్ । యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్ । తస్య దేవా అసన్ వశే (E) అగ్రే = ఆదిలో, దేవాః = దేవతలు, బ్రాహ్మం = పరబ్రహ్మ సంబంధమగు, రుచం = చైతన్యమును, జనయంతః = పుట్టించుచున్న వారలై, తత్ = ఆ బ్రహ్మతత్వమును, అబ్రువన్ = పలికిరి, యః = ఏ, బ్రాహ్మణః తు = బ్రహ్మవేత్త, ఏవం = ఈవిధముగా, విద్యాత్ = తెలుసుకొనునో, తస్య = ఆ బ్రహ్మవేత్తకు, దేవాః = సమస్త దేవతలు, వశే = స్వాధీనమందు, అసన్ = అగుచున్నారు.

తా మొట్ట మొదట అనగా సృష్టి కాలమందు సమస్త దేవతలు పరబ్రహ్మ సంబంధమైన చైతన్యమును విద్యచేత పుట్టించుచున్న వారలయి, ఆ బ్రహ్మతత్త్వమును ఈ విధముగా పలికిరి అది ఏమనగా ఓ పరమేశ్వరా ! ఏ బ్రహ్మవేత్త ఈ విధముగా తెలుసుకొనెనో వానికి సమస్త దేవతలు స్వాధీనమగు చున్నారు య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి సఇదగ్ం సర్వం భవతి తస్యహ నదేవాశ్చ

తా ఎవ్వడు ఈ విధముగా అహం బ్రహ్మాస్మి అని తెలుసుకొనుచున్నాడో, అతడే ఇదియంతయు అగుచున్నాడు. వానికి దేవతలుకూడా అధికులుకారు వారికి కూడా ఇతడే ఆత్మయగుచున్నాడు.

హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ, అహోరాత్రే పార్శ్వే, నక్షత్రాణి రూపమ్ !
అశ్వినౌ వ్యాత్తం, ఇష్టం మనిషాణ, అముం మనిషాణ, సర్వం మనిషాణ!!(F)
( ఓ పరమేశ్వరా) హ్రీః చ = లజ్జాభిమానిని అగు దేవతయు, లక్ష్మీశ్చ = ఐశ్వర్యాభిమానిని యగు దేవతయు, తే = నీకు, పత్న్యౌ = భార్యలు, అహోరాత్రే దివారాత్రములు, (పార్శ్వే = పార్శ్వ భాగములు, నక్షత్రాణి = నక్షత్రములు, రూపం = రూపము, అశ్వినౌ = అశ్వినీ దేవతలు, వ్యాత్తం, = తెరచిన నోరు, ఇష్టం = నేను కోరు ఆత్మ బోధమును, మనిషాణ = దయచేయుము, అముం = ఐహిక సంపదను, మనిషాణ = ఇమ్ము, సర్వం = ఐహిక, ఆముష్మిక సంపదనంతయు, మనిషాణ = ఇమ్ము

తా ఓ పరమేశ్వరా ! హ్రీ, శ్రీ - వీరిద్దరూ నీకు భార్యలు, దివారాత్రములు నీపార్శ్వ భాగములు నక్షత్రములు నీ రూపము నీ తెరచిన నోరు అశ్వినీ దేవతలు. అట్టి ఓ విరాట్పురుషా ! నాకు ఆత్మ సాక్షాత్కారమును, ఐహిక, ఆముష్మిక సంపదల నిమ్ము.

**హిరణ్య గర్భ స్సమవర్త తాగ్రే !**
**భూతస్య జాతః పతిరేక ఆసీత్ !**
**సదాధార పృథివీం ద్యాముతేమాం !**
**కస్మై దేవాయ హవిషా విధేమ (1)**
అగ్రే = మొదట, హిరణ్యగర్భః = హిరణ్య గర్భుడు, సమవర్తత = పుట్టెను, జాతః = ఉత్పన్నమైన, ఏకః = ఒకడే, పతిః = ప్రభువు, ఆసీత్ = ఆయెన్, సః = ఆపరమాత్మ, పృథివీం = భూమిని, ఉత = మరియు, ఇమాం = ఈ, ద్యాం = అంతరిక్షమును, దాధార = ధరించెను, కస్మై = ఏ, దేవాయ = దేవుని కొరకు, హవిషా = హవిస్సుగల యజ్ఞము చేత, విధేమ = విదుల ననుష్టించెదము ?

తా సృష్ట్యాదియందు హిరణ్యగర్భుడు ఆ పరమాత్మ నుండియే పుట్టెను. భూతస్య,

భువన జాతమునకు ఉత్పన్నమైన ఆ హిరణ్యగర్భుడు ఒకడైన ప్రభువాయెను ఆ పరమాత్మ భూమిని, అంతరిక్షమును ధరించెను మేము ఇక ఆ పరమాత్మ కంటె భిన్నుడైన ఏ దేవుని కొరకు యజ్ఞములను చేసెదము ?

యః ప్రాణతో నిమిషతో మహిత్వైత ! ఇద్రాజాజగతోబభూవ !
య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః ! కస్మై దేవాయ హవిషా విధేమ !(2)

యః = ఏ పరమాత్మ, ప్రాణ తః = చలించునట్టియు, నిమిషితః = నిమేషము గలట్టియు, జగతః = ప్రపంచము యొక్క, మహిత్వే = పూజయందు, ఏక ఇత్ = ఒకడే అయిన, రాజా = ప్రభువు, బభూవ = ఆయెనో, యః = ఎవ్వడు, అస్య = ఈ బ్రహ్మాండము యొక్క, ద్విపదః = మనుష్యులను, చతుష్పదః = పశువులను, ఈశే = శిక్షించుచున్నాడో, కస్మై = ఏ, దేవాయ = దేవుని కొరకు, హవిషా = యజ్ఞము చేత, విధేమ = విధులననుష్ఠించెదము ?

తా ఏ పరమాత్మ చలించునట్టియు, నిమేషము గలట్టియు ప్రపంచము యొక్క పూజయందు ఒకడే అయిన ప్రభువు కలడో, ఈ బ్రహ్మాండము యొక్క మనుష్యులను జంతు జాలములను శిక్షించుచున్నాడో, అట్టి పరమాత్మను కాదని, ఏ దేవుని కొరకు యజ్ఞములు చేసెదము ?

యఆత్మదా బలదాయస్య విశ్వ ఉపాసతే ప్రశిషమ్యస్య దేవా
యస్య ఛాయా ఒమృతం యస్యమృత్యుః ! కస్మైదేవాయ హవిషా విధేమ (3).

యః =ఎవడు, ఆత్మదా = జీవుని ఇచ్చుచున్నాడో (యః = ఎవడు) బలదా = బలము నిచ్చుచున్నాడో, యస్య = ఎవని యొక్క, ప్రశిషమ్ =ఆజ్ఞను, దేవాః = దేవతలును, ఉపాసతే = పాలించుచున్నారో, యస్య = ఏపరమేశ్వరుని యొక్క, చాయా = నీడ; అమృతం = మోక్షహేతువగు చున్నదో, యస్య = ఎవనియొక్క మృత్యుః = మరణమునకు హేతువగుచున్నదో , కస్మై = ఏ, దేవాయ=దేవునీకొరకు, హవిషా=యజ్ఞములను, విధేమ=విధులను నిర్వర్తించెదము ?

తా ఎవడు జీవులను, బలములను ఇచ్చుచున్నాడో, ఎవని ఆజ్ఞను దేవతలు,

మనుష్యులు పవిత్రముగా భావించి పరిపాలించు చున్నారో, ఎవని యొక్క నీడ మోక్షహేతువగుచున్నదో, ఎవని యొక్క శరణము పొందకపోవుటచే మరణము సంభవించుచున్నదో, అట్టి పరమాత్మను విడిచి ఏ దేవుని కొరకు యజ్ఞయాగాదుల చేసెదము ?

యస్యేమేహిమవన్తో మహిత్వా ! యస్య సముద్రగ్ం రసయా సహా ఉ౨ హుః యస్యేమాః ప్రదిశోయస్య బాహూ ! కస్మైదేవాయ హవిషా విధేమ !! (4)

ఇమే =ఈ, హిమవన్తః = హిమాలయము, యస్య = ఎవని యొక్క, మహిత్వా = గొప్ప విభూతులో, రసయాసహ = గంగాది సకలనదులతో కూడిన, సముద్రం = సముద్రమును, యస్య = ఎవని యొక్క (మహిత్వా గొప్ప విభూతిగా, ఆహుః = పలుకుచున్నారో, యస్య = ఎవనికి, ఇమాః = ఈ ప్రాగాది దిశలు (అవయవములో) యస్య = ఎవనికి, ప్రదిశః = విదిక్కులో, బాహూ = అవయవములో, కస్య = ఏ, దేవాయ = దేవుని కొరకు, హవిషా = యజ్ఞములను, విధేమ ? = విధులను చేయగలము ?

తా ఈ భూమండలమందు కనబడుచున్న హిమాలయము, మహా మేరువు, వింధ్యము, సహ్యము మొదలగు గొప్ప పర్వతములన్నియు, ఏ పరమేశ్వరుని గొప్పవిభూతులో, గంగాది సకల నదులతో కూడిన సముద్రము, గొప్పవిభూతిగా,వానిగూర్చి పలుకుచున్నాయో, ఏ పరమాత్మకు ఈ నాల్గు దిక్కులు, నాలుగువిదిక్కులు అవయవములో, అట్టి పరమేశ్వరుని కాక, ఇతర ఏ దేవుని కొరకు యజ్ఞయాగాది విధులు జరిపెదము ?

యం క్రందసీ అవసాతస్త భానే ! అభ్యైక్షేతాం మనసా రేజమానే ! యత్రాధి సూర ఉదితోవ్యేతి ! కస్మైదేవాయ హవిషా విధేమ (5)

క్రందసీ = రోదనమునకు హేతువైనట్టియు అవసా = రక్షణ కలిగించునట్టియు తస్తభానే = జీవులకు స్థితిని కలుగజేయువనియును రేజమానే = ప్రకాశించుచున్న వియును, (అగు) మనసా = మనోవృత్తి చేత, యం = ఏ పరమేశ్వరుని, అభ్యైక్షేతాం = అంతటా చూచుచున్నవో, యత్ర = ఎక్కడ, ఉదితః = ఉత్పన్నుడగు, సూరః =

సూర్యుడు, ఉదితః = ఉత్పన్నుడై, అధివ్యేతి = పరిభ్రమించుచున్నాడో, కస్మై = ఏ, దేవాయ = దేవుని కొరకు, హవిషా = యజ్ఞాదులను, విధేమ = విధులను నిర్వర్తించగలము ?

తా అతివృష్టికిని, ఉరుము, మెరుపులు మున్నగు వానికి ఆధార భూతమై, ప్రళయాధారకములగుట వలన, ప్రాణులయొక్క రోదనమునకు హేతు భూతమైనట్టియు, రక్షణ హేతువగు అన్నమును కలుగజేయుట చేత, జీవులకు స్థితిని కలుగజేయునవియు, ప్రకాశించుచున్నవియునగు భూమ్యాకాశములు, నిర్మలమగు మనోవృత్తి చేత అంతటా చూచుచున్నవో, ఏ పృధివ్యాదుల యొక్క అంతరాళమందు జనించిన సూర్యుడు ఆ సూర్యుడే శింశుమార చక్రమునకు నలువైపుల పరిభ్రమించుచున్నాడో, అట్టి పరమాత్మకంటే భిన్నుడైన ఏ దేవుని కొరకు యజ్ఞాది క్రతువులు చేయగలము ?

శ్లో. యేనద్యౌరుగ్రా పృథివీ చదృఢే యేనస్తువస్త భితం యేననాకః
యో అన్తరిక్షేరజసోవిమానః । కస్మైదేవాయ హవిషా విధేమ ॥ (6)

యేన = ఏ పరమాత్మచేత, ఉగ్రా = క్రూరమైన, ద్యౌః = ఆకాశము పృధివీచ = భూమియు, దృడే = దృఢముగా చేయబడినవో, యేన = ఏ పరమాత్మచే, సువః = ఆదిత్యమండలము, స్తభితం = అంతరిక్షమందు నిరాధారముగ స్థాపింపబడియున్నదో, యేన = ఏ పరమాత్మచేత, నాకః = స్వర్గలోకము నిర్మింపబడియున్నదో, యః = ఏ పరమాత్మ, అంతరిక్షే = భువర్లోకమందు, రజసః = వృష్టి రూప జలము యొక్క, విమానః = నిర్మాణ కర్తయో, (అట్టి పరమాత్మను వదలి), కస్మై = ఏ, దేవాయ = దేవునికై, హవిషా = హ విర్దానముగల యజ్ఞము చేత, విధేమ = విధ్యనుష్ఠానమును సలిపెదము ?

తా ఏ పరమాత్మచేత మహాశక్తి వంతమైన ఆకాశము, భూమియు దృడముగా చేయబడినవో, ఏ పరమాత్మచేత ఆదిత్య మండలము అంతరిక్షమునందు నిరాధారముగా స్థాపింపబడినదో, పుణ్యాత్ముల అనుభవము కొరకు ఎవనిచే స్వర్గము నిర్మింపబడినదో, అంతరిక్షమునందు ( భువర్లోకమందు) జలమును నిర్మాణము చేసెనో, అట్టి పరమాత్మను వదలి ఏ ఇతర దేవుని కొరకు యజ్ఞ విధులను సలిపెదము?

అపోహ యన్మ హతీర్విశ్వమాయం । దక్షందధానాజనయన్తీ రగ్నిమ్
తతోదేవానాం నిరవర్తతాసు రేకః । కస్మై దేవాయ హవిషా విధేమ ।। (7)

ఏకః = అద్వితీయుడైనట్టియు, దేవానాం = దేవతలకు, అసుః = ప్రాణభూతుడైనట్టియు అగు పరమాత్మ, యత్ = ఎప్పుడు (జగన్నిర్మాణముగా వింపదలచెనో), తతః = పిదప, మహతీః = పూజ్యులైనట్టియు (లేక) సముద్రాదిరూపము చేత గొప్ప పరిమాణము గలట్టియు, ఆయం = శుభావహమైనట్టిదియు, దక్షం = సమర్థమైనట్టియు, విశ్వం = ప్రపంచమును, దధానాః = దరించు నట్టిదియు, అగ్నిం = అగ్నిని, జనయంతీః = పుట్టించుచున్న ఆపః = ఉదకములను, నిరవర్తతః = పుట్టించెను కదా । కస్మై దేవాయ = ఏదేవుని కొరకు, హవిషా = హవిస్సుగల యజ్ఞము చేత, విధేమ = విధులననుష్ఠించెదము ?

అద్వితీయుడును, దేవతలకు ప్రాణభూతుడును, అగు పరమాత్మ ఎప్పుడు జగన్నిర్మాణమును గావింపదలచెనో అప్పుడు సముద్రములను, ప్రపంచాధారమైన అగ్నిని పుట్టించెను కదా ! అట్టి పరమాత్మను వదలి ఇతర ఏ దేవతల కొరకు యజ్ఞముల నాచరించెదము ?

యశ్చిదాపో మహినా పర్యపశ్య । దక్షందధానా జనయన్తీ రగ్నిమ్
యోదే వేష్వధి దేవ ఏక ఆసీ । త్కస్మై దేవాయహవిషా విధేమ ।।(8)

చిత్ = చిద్రూపుడగు, యః = ఏ పరమేశ్వరుడు, దక్షం = శ్రౌతస్మార్త కర్మానుష్ఠానక్షమమగు, దధానా = ధరించునట్టి, అగ్నిం = అగ్నిని, జనయన్తీః = పుట్టించుచున్నట్టి, ఆపః = ఉదకములను మహినా = మహిమచేత, పర్యపశ్యత్ = సకల జగజ్జీవన సాధనముగా గాంచెనో, యః = ఏ పరమేశ్వరుడు, దేవేషు = దేవతలందు, అధి = అధికుడయి, ఏకః = ఒక్కడగు, దేవః = దేవుడు, ఆసీత్ = ఆయెనో (అట్టి పరమేశ్వరుని కాదని) కస్మై దేవాయః = మరేదేవుని కొరకు, హవిషా = యజ్ఞము చేత, విధేమ = విధులను చేసెదము ?

చిద్రూపుడైన ఏ పరమాత్మ సకల జీవనాధారమైన కర్మానుష్ఠానమునకు ఉపయోగపడు

అగ్నిని పుట్టించు జలములను సృజించెనో, దేవతలందరికంటెనూ అధికుడైన ఆ పరమాత్మను కాదని మరే ఇతర దేవతలకై యజ్ఞాదులను చేసెదము

ఏషహిదేవః ప్రదిశోను సర్వాః పూర్వోహిజాతస్స ఉగర్భే అన్త ః సవిజాయ మానస్స జనిష్యమాణః । ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖః (14) విశ్వతశ్చక్షు రుత విశ్వతోముఖో విశ్వతో హస్త ఉత విశ్వత స్పాత్ సంబాహు భ్యాంనమతి సంపతత్రైర్ద్యావా పృథివి జనయన్దేవ ఏకః

(15) ఏషః = ఈ, దేవః = దేవుడు, సర్వాః ప్రదిశః = అన్ని దిక్కులలోను అను = ప్రవేశించియున్నాడు హి = కదా! పూర్వః జాతః హి = ప్రథముడై పుట్టెను కదా ! సః ఉ= అతడే, గర్భే అంతః = బ్రహ్మాండరూపగర్భమున మధ్య భాగమందు (ఉంటున్నాడు), సః ఉ = అతడే, విజాయమానః = దేవ తిర్యగాది రూపమున ఇప్పుడు పుట్టుచున్నాడు, సః ఉ= అతడే, జనిష్య మాణః = ఇకమీద పుట్టగల వాడును, ప్రత్యఙ్ = అన్నమయాది కోశముల కంటెను విలక్షణమైన వాడును, ముఖాః = దేహేంద్రియములకు అధ్యక్షుడగుట వలన ముఖ్యుడును అగుచున్నాడు, విశ్వతోముఖః = అంతట ముఖము కలవాడై, తిష్ఠతిః = ఉంటున్నాడు

ఈస్వయం ప్రకాశుడగు పరమాత్మ అన్నిదిక్కులలోను వ్యాపించి యున్నాడనుట ప్రసిద్ధమే కదా ! హిరణ్య గర్భరూపమున ప్రథముడై పుట్టెను కదా! ఆ పరమేశ్వరుడే బ్రహ్మాండరూప గర్భమున మధ్య భాగమున యుంటున్నాడు అతడే దేవ తిర్యగాది రూపమున పుట్టుచున్నాడు అతడే ఇక మీద పుట్ట బోవు వాడును అతడు అన్నమ యాది కోశములకు విలక్షణుడును, దేహేంద్రియములకు అధ్యక్షుడగుట వలన ముఖ్యుడును అగుచున్నాడు అంతటను ముఖముకల వాడై జగదధిష్ఠానముగ యుంటున్నాడు (14)

సః = ఆ పరమేశ్వరుడు, విశ్వతః = అంతటా చక్షు ః = నేత్రములు కలవాడు, ఉత = మరియు, విశ్వతో ముఖః = అంతటా ముఖములు కలవాడు, విశ్వతో హస్తః = అంతటా చేతులు కలవాడు, ఉత = మరియు, విశ్వత స్పాత్ = అంతటా పాదములు కలవాడు (సః = ఆ పరమేశ్వరుడు) బాహు భ్యాం = బాహువుల చేత [illegible] = లోబరచుకొనుచున్నాడు పతత్రైః = పతన శీలములగు (పంచీకృ[illegible]మహాభూతములే

చేత) సంనమతి = లోబరుచుకొనుచున్నాడు, (ఈ విధముగా), ద్యావా పృధివీ =భూమ్యాకాశములను, జనయన్ = పుట్టించుచూ, ఏక ః = ఒక్కడే (అయి వున్నాడు)

తా – అద్వితియుడైన పరమాత్మ భూమ్యాకాశములను సృజించుచున్నాడు లోనబైట అంతటా తానై ఉన్నాడు కాబట్టి సృష్టిలోని నేత్రములు, ముఖములు,చేతులు, పాదములు అన్నియు ఆయనవే ధర్మాధర్మములు అను చేతులచే నిమిత్త మాత్రుడై జగములను తన స్వాదీనమందుంచుకొను చున్నాడు పతన శీలములగు పంచీ కృతమహాభూతముల చేత వాటిని సృజించుచున్నాడు

విశే – సాయునాచార్యులు, బాహువులను ధర్మాధర్మములనియు పతత్ర =(పాదములు) అనగా పంచీకృత మహాభూతములనియు వ్యాఖ్యానించియున్నారు
వేనస్తత్పశ్యన్విశ్వాభువనాని విద్వాన్ । యత్ర విశ్వం భవత్యేక నీళమ్ ।
యస్మిన్నిదగ్ం సంచవిచైకగ్ం సఓతః ప్రోతశ్చ విభు ప్రజాసు!
ప్రత ద్వోచే అవృుతంను విద్వా । న్గన్ధర్వోనామ నిహితం గుహాసు ।। – (3)
త్రీణి పదాని హితా గుహాసు । యస్తద్వేద సవితుః పితాసత్ –

యత్ర =ఏ పరమాత్మ యందు, విశ్వం = జగత్తు, ఏకనీళం భవతి =ఏకత్వముగా పొందినది అగుచున్నాదో, తత్ =అట్టి పరమాత్మను, పశ్యన్ =చూచుచున్నవాడై, విశ్వాభువనాని సమస్త లోకములను, విధ్వాన్ =ఎఱిగి యున్నట్టియు, యస్మిన్ =ఏపరమాత్మ యందు, ఇదం =ఈప్రపంచము, సంచవించతిఏతి = స్వయముగా పుట్టి విలీనమగుచున్నదో, ఏకః =ఒక్కడగు, సః = అపరమాత్మయే విభుః = వ్యాపించినవాడై, ప్రజాసు =ప్రజలయందు, ఓతః ప్రోతః చ = పడుగు పేకల వలె యున్నాడో, ।। – గుహాసు = ప్రాణుల యొక్క బుద్ధిగుహలయందు, త్రీణి = మూడైన, పదా =జాగ్రత్స్వప్నసుషుప్తి స్థానములు, నిహితా =అవస్థితములైయున్నవో, తత్ = వాటి అధిష్ఠాన భూత వస్తువును, యః =ఏ గంధర్వుడు, వేద =తెలిసికొనినాడో (సః = ఆ గంధర్వుడు) సవితుః =తనకు జనకుడగు వానికి (సైతము), పితాసత్ =జనకుడగుచున్నాడు – (అట్టి వేనః నామ వేనుడను నామము గల గంధర్వుడు, గుహాసు – సర్వ ప్రాణులయొక్క బుద్ధి గుహలయందు, నిహితం =ఉన్నట్టియు, అవృుతం =నాశరహిత మైనట్టియు, తత్ = అవస్తువును, విద్వాన్

=(స్వానుభవమువలన) ఎరిగిన వాడై, ప్రవోచేను =(తన శిష్యులకై) చెప్పెను కదా! (విద్వాన్ = సర్వజ్ఞుడగు పరమాత్మ, విశ్వాభువనాని = సమస్త భువనములను, ఇనోవా = సూర్యుడి వలెనే, తత్ = దానిని (ఇంద్రియ కళేబరసంయోగమును) పశ్యన్ = చూచుచు (ఉంటున్నాడు) విశ్వం = ఈ సమస్త ప్రపంచము, యత్ర = ఏ పరమాత్మయందు, ఏక నీడం = ఏ కాధికరణత్వమును పొందినది, భవతి = అగుచున్నాదో ఇదం = ఈ, సర్వం = సమస్తము, యస్మిన్ = ఏ పరమాత్మ యందు, సఞ్చవిచైతి = ఏకీభవించుచున్నదో, సః = ఆ, విభుః = సమర్థుడగు పరమాత్మ, ప్రజాసు = చేతనాచేతన సమూహముల యందు, ఓతః = పడుగు (దీర్ఘ తంతువులు) గాను, ప్రోతశ్చ = పేకఅడ్డము గాయుండు దారములు వలె, వర్తతే = ఉంటున్నాడు (13) విద్వాన్ ః = సర్వజ్ఞుడజగు, గన్ధర్వః = జగదుద్ధారకుడైన పరమాత్మ, గుహాసు = నాభిహృదయాది స్థానములందు, నిహితం = ఉంచబడిన, అమృతంను = నిత్యమైన, తత్ = ఆ, నామ = శబ్ద ప్రపంచమగు వేదమును, బ్రహ్మణే = బ్రహ్మకొరకు) ప్రవోచే = పలికెను (చెప్పెను) = గుహాసు = గుహలయందు, హితం = ఉన్న, తత్ = ఆ పరమాత్మను, త్రీణి = మూడు విధములైన (భోగ్యభోగకరణముల చేత మూడు విధములైన) పదాని = పాదములనుగా (త్రిపాద్విభూతినిగా) వేద తెలుసుకొనుచున్నాడో, సః = వాడు, పితుః = తండ్రికి, పితా = తండ్రి య్యై, సత్ = సత్స్వరూపముగా (భవతి = ఆగుచున్నారు) – (యాస్కుడు, భట్ట భాస్కరుల వ్యాఖ్య) మొదటి అర్థము – ఏ పరమాత్మయందు విశ్వమంతయు జనించిలయ మొందుచున్నదో, ఎవనియందు ఇదియంతయు వస్త్రములోని పడుగు పేక దారముల వలె అల్లుకొని యున్నదో, ప్రాణుల హృదయ గుహలలో జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలుగా నున్నదో, అట్టి పరమాత్మను వేనుడు అను గంధర్వుడు చూచి, ఆ పరమాత్మ అందరి హృదయములలోనున్నదనియు, అది నాశరహితమైనదనియు, లోకమునకు చాటి చెప్పెను దీనిని తెలుసుకొనిన వాడు తనకు జన్మనిచ్చిన తండ్రికే జనకుడగు చున్నాడు

ఇంకొక అర్థము –

సర్వజ్ఞుడగు పరమాత్మ ఆ ఇంద్రియ కళేబరసంయోగమును సమస్తలోకములను సూర్యుడు వలెనే చూచుచున్నాడు ఏ పరమాత్మ యందు ఈ సమస్త ప్రపంచము ఏకాధికరణత్వమును పొంది ఒక్కటేయగుచున్నదో అట్టి

పరమాత్మయందు వస్త్రమునందు దారములు పడుగు పేకల వలెయున్నట్లు చేతనాచేతనములైన సమస్త భూతములయందును వ్యాపించి యున్నాడు ॥
సర్వజ్ఞుడును జగద్ధారకుడునగు ఆ పరమాత్మనాభి హృదయస్థానములందుంచబడినదియు, అపౌరుషేయ మగుటచే నిత్యమైనదియునగు అ శబ్ద ప్రపంచమైన వేదమును బ్రహ్మకొఱకు చెప్పెను బుద్ధ్యాది గుహలయందున్న పరమాత్మను, భోగ్యభోగకరణరూపములయిన భగవత్పాదములనుగా తెలుసుకొనువాడు తండ్రికి తండ్రియై తనకెవడును తండ్రిలేనివాడై సద్రూపుడగుచున్నాడు

విశేషార్థము – తండ్రి పుత్రుని యొక్క దేహమును మాత్రము సృజించుచున్నాడు బ్రహ్మతత్త్వము నెరిగిన వారన్ననో, పరమాత్మ స్వరూపులే కావున వారే జగదుత్పాదకులగుచున్నారు సర్వజగ దుత్పాదకులైనపుడు జగదంతర్గతుడగు స్వజనకునకుసైతము తండ్రియగుచున్నారు ఈ విషయమునే "యస్తం విజానాత్సపితుః పితాసత్" అను శ్రుత్యంతరము గంధర్వ = గాంధారయతీతి = నాదాత్మక దేవ వేన = వేన్ప = కోరిక
నీడ = ఆశ్రయము, పక్షిగూడు = ఇందులో రక్షణ, ఐక్యత, అన్యోన్యత కలిగియుండుట పడుగు పేకలవలె = అనగా అవిలేనిచో వస్త్రమునకు ఉనికిలేదు.

గుహ = కొండగుహ లేక దాగుకొనుచోట = ఈ మంత్రంలో గుహ యనగా బుద్ధి. దీని వలననే అత్మ సాక్షాత్కారము అగును అదే జాగత్స్వప్న సుషుప్తులకు స్థానము. త్రిపాదములనగా వాక్కు యొక్క పరా, పశ్యన్తి, మధ్యమ స్థాయిలను తెలుపును. కొన్ని ప్రతులలో సవితుః'బదులు సపితుః అని కలదు
భట్ట భాస్కరులు, మొదటిది రూప ప్రపంచమును, రెండవది నామ ప్రపంచమును తెలుపునని చెప్పుచున్నారు
సనోబన్ధుర్జనితా సవిధాతాధామాని వేదభువనాని విశ్వాయత్ర దేవా అమృత మానశానాస్తృతీ యేధా (మా) మన్య భ్యైరయంతః పరి ద్యావా పృథివీయంతి సద్యః పరిలోకాన్పరిదిశః పరిసువః ఋతస్యతంతుం వితతం విచృత్య తదపశ్యత్తద భవత్ప్ర జాసు సః = ఆ పరమాత్మ, నః = మాకందరికీ, బంధుః = బంధువు, జనితా = జనకుడు, సః = ఆ పరమాత్మ, విధాతా = జగన్నిర్మాతయై, విశ్వాభువనాని = లోకములనన్నింటినీ, ధామాని = అచట యోగ్యములగు దేవతాస్థానములను, వేద

= ఎరిగియున్నాడు (మరియు) యత్ర = ఏ , తృతీయే = మూడవ లోకమునందు, దేవాః = దేవతలు, అమృతం = అమృతమును, ఆనశానాః = పానము చేయుచున్న వారలయి, ధామాని = స్వస్థానములను, అభ్యైరయంత = పొందిరో, ద్యావా పృథివీ = భూమ్యాకాశములను, సద్యః = వెంటనే, పరియన్తి = పొందుచున్నారు లోకాన్ = అంతరిక్షాది లోకములను, పరియన్తి = పొందుచున్నారు దిశః = ప్రాగాది దిక్కులను, పరియన్తి = పొందుచున్నారు, ఋతస్య = పరమాత్మ యొక్క తంతు = విచ్ఛేదరహితమైన స్థితిని, వితతం = విస్తీర్ణముగా, విచృత్య = (గురు శాస్త్రముఖముగా) నిశ్చయించుకొని, తత్ = ఆ పరబ్రహ్మమును, అపశ్యత్ = (ఎవడు) చూచుచున్నాడో (వాడు ), ప్రజాసు = ప్రజలలోపల, తత్ = అ బ్రహ్మతత్త్వము, ఆ భవత్ = ఆయెను = బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి )

మరో విధమైన టీకాతాత్పర్యములు :-

యత్ర = ఏ పరమాత్మయందు, దేవాః = దేవతలు, అమృతం = అమృతము వలెనే భోగ్యములగు కళ్యాణ గుణములను, ఆనశానాః = అనుభవించు వారలై, తృతీయే = మూడవదగు, ధామాని = స్థానమునందు (స్వర్గమందు) , అభ్యైరయంత = గానము చేయుచుండిరో(యః = ఎవడు) తం = ఆ పరమాత్మను) విశ్వా = సమస్తములైన, భువనాని = లోకస్వరూపములైన , ధామాని = స్థానములుగా, వేద = తెలిసికొనుచున్నాడో, సః = వాడు, నః = మాకు, బన్ధుః = చుట్టమును, జనితా = పుట్టించు వాడును, సః = అతడే, విధాతా = శుభములను పుట్టించువాడును (బ్రహ్మవేదః = బ్రహ్మవేత్తలు), సద్యః = అప్పుడు, ద్యావా పృథివీ = భూమ్యాకాశములను, పరియంతి = అంతటా తిరుగుచున్నారు, లోకాన్ = సమస్తలోకములను, పరియంతి = అంతటా తిరుగుచున్నారు, దిశః = దిక్కులను, పరియంతి = అంతటా తిరుగుచున్నారు, సువః = భగవల్లోకమును, పరియంతి = అంతటా తిరుగుచున్నాడు, (సః = ఆపరమాత్మ) ఋతస్య = కర్మయొక్క, వితతం = వ్యాప్తమైన, తంతుం = సూక్ష్మ రూపమును , విచృత్య = వ్యాపించి , తత్ = ఆ కర్మఫలమును, అపశ్యత్ = చూచెను, తత్ = ఆకర్మఫలము , ప్రజాసు = ప్రజలయందు, అభవత్ = ఆయెను = (కలిగెను)

తా - దేవతలే పరమాత్మయందు, అమృతమువంటి భగవత్కళ్యాణ గుణ

సముదాయముననుభవించుచు, మూడవ లోకమగు స్వర్గమునందు సామగానము చేయుచుండిరో, పరమాత్మను సమస్తలోక స్వరూపములయిన జనుల యొక్క భోగ్య భోగకరణాదులనుగా తెలుసుకొను వాడే మనకు చుట్టమును, మనలను పుట్టించువాడును, శుభములను సృజించువాడును అగుచున్నాడు
పరబ్రహ్మవేత్తలగు వారు భూవ్యాకాశములను, దిక్కులను, భగవల్లోకమున వీటినన్నిటినీ భగవత్స్వరూపులయి పొంది సంచరించు చున్నారు. ఆ పరమాత్మ కర్మ యొక్క అదృశ్యమై వ్యాప్తమైన సూక్ష్మరూపమున వ్యాపించి జీవుల యందున్న కర్మ సాధ్యములైన అపూర్వములను ప్రత్యక్షముచేసికొని కర్మాను కూలమైన ఫలమును ప్రజలయందు సృష్టించిరి

విశేషము - ఈ మంత్రములందు పరమాత్మ యొక్క ప్రభావము వర్ణించబడినది. అతడే మనకు తండ్రి, తోబుట్టువు, స్నేహితుడు అతడే నిజమైన నియామకుడు అందరికీ వారివారి కర్మలకు ఫలప్రదాత ఎవరైతే ఆత్మసాక్షాత్కారమును పొంది, పరమాత్మతో తాదాత్మ్యమును పొందెదరో వారు వెంటనే భూమ్యాకాశములంతటా వ్యాపించెదరు వారు ఇతరలోకములను, స్వర్గ భాగములను, స్వర్లోకమును వ్యాపించెదరు ఎవరైతే జీవరాసులన్నింటిలోను ఋతం అనబడు పరమాత్మను, సర్వవ్యాపి అయిన పరమాత్మను, దర్శించునో అన్నింటిలోను వస్త్రములోని తంతు వలె వ్యాపించియున్న పరమాత్మను మనస్సులో దర్శించునో, అతడు పరమాత్మయే అగును సాయానాచార్యులు "విప్రిత్య" అనుపదమునకు నిశ్చిత్య అని (మనసుచే నిర్ణయించి - అర్థము చెప్పిరి భట్ట భాస్కరులు .- ఛిత్వా = ఛేధించి, అనగా కర్మఫలములను ఛేదించి, అనియు "ఋతము" = యజ్ఞాది కర్మలు
పరీత్యలో కాన్పరీత్య భూతాని/పరీత్య సర్వాః ప్రదిశోదిశశ్చ = ప్రజాపతిః ప్రథమజాఋతస్యా 'త్మనా ఉ ఉ త్మనమభిసంబభూవ(20) ఋతస్య = పరమాత్మ యొక్క (లేక, యజ్ఞాదికర్మకు) ప్రథమజాః = ప్రథమకార్యరూపుడగు (ముందు పుట్టినవాడగు) ప్రజాపతిః = హిరణ్యగర్భుడు (పరమాత్మ), లోకాన్ = భూరాదిలోకములను, పరీత్య = అంతటా వ్యాపించి, భూతాని = దేవమనుష్యాది ప్రాణిదేహములను, పరీత్య = అంతటా వ్యాపించి, ప్రదిశః = ఆగ్నేయాదిక్కులను, దిశః = ప్రాగాది దిక్కులను, సర్వాః = అన్నింటిని, ప రీత్య = అంతటా వ్యాపించి, ఆత్మనా = స్వస్వరూపముచేత, ఆత్మానం = సత్య జ్ఞానాదిలక్షణుడుగా పరమాత్మను, అభిసంబభువ = అంతటా పొందెను పరమాత్మ సమస్తలోకములను,

భూతజాలములను, దిక్కులను విదిక్కులను వ్యాపించి అన్నియుతానై, ప్రధమ కార్యభూతుడగు హిరణ్యా గర్భుడై, స్వస్వరూపముచేత సత్యజ్ఞానాది లక్షణుడగు పరమాత్మను పొందెను

(ఇంతవరకు బ్రహ్మవిద్యవివరింపబడినది –"అంభస్యపారే" అను ప్రధమ మంత్రమునుండి ఇంతవరకూ పరబ్రహ్మస్వరూపము వివరింపబడి, ఈ మంత్రముతో అది ఉపసంహారము చేయబడినది పరబ్రహ్మమునే ఋతమనియు, సత్యమనియు ఋషులు పేర్కొనిరి, సత్యముకంటే సూక్ష్మమైనది గానీ, గొప్పదైనది గాని ఏదియులేదనియు, అది జ్ఞానాజ్ఞానములకు అతీతమైనదనియు ఆ ఋషులు చెప్పుచున్నారు దృశ్యాదృశ్యప్రపంచమంతయు అందుండీ యే పుట్టి, పెరిగి, గిట్టుచున్నది శాశ్వతమైన, పరంజ్యోతి అయిన, ఈ పరమాత్మను ఋషులు తమ యోగదృష్టితో తపోబలముచే తమ హృదయములలోనే దర్శించిరి జగత్కారణుడని ఇతనినే అందరూ గుర్తించిరి అతడే ప్రజాపతి ఎవరెవరి కర్మలకు ఏయే స్థానములను కల్పించవలెనో, ఎవరికే కర్మకు ఏ ఫలము నివ్వవలయునో, నిర్ణయించునది అతడే జగదంతర్యామి అగుట చేతనూ, బైటలోపలయుండుటచేతను ఇతనిని హిరణ్య గర్భుడని పేర్కొనిరి అతడే సూర్యుడుగా, చంద్రుడుగా, నక్షత్రములుగా, అగ్నిగా, నీరు, గాలి, మానవులు, జంతువులు, వృక్షములు, పక్షులు, మాసములు, ఋతువులుగా మనకుద్యోతకమగుచున్నారు అతని వైభవమునకు సాటి ఎవరూలేరు అతడే తండ్రి, తోబుట్టువు, స్నేహితుడు, రక్షకుడు అందరూ అతనినే శరణు బొందాలి ఆయునను తెలుసు కొనుట చేతనే, ఆయన దయవల్లనే మనకు సంసారబంధవిముక్తి, మోక్షమున్నూ, ఆ పరమ పదమును చేరిన మహర్షులు దానినే చాటి, అంధకారంలో అజ్ఞానంలో, బంధంలో వున్న మానవాళికి మార్గదర్శకులైరి ఈ అధ్యాత్మ విషయాన్ని చెప్పుట పూర్తి చేయుచూ, ఒకే వృక్షము పైని ఉన్నరెండు పక్షులు – జీవాత్మ పరమాత్మల ఐక్యతను బోధించుచు ఈ మంత్రము చాటిచెప్పుచున్నది ఈ జగత్తుకు మూలకారణము ఈశ్వరుడు లేక హిరణ్యగర్భుడు నిజంగా అతనికి పుట్టుకలేదం. హిరణ్యగర్భుడే పరబ్రహ్మము ఇకరాబోవుమంత్రములు ఆపరమాత్మను చెందుటకు వివిధోపాసనలను, ప్రార్థనలను, కర్మలను తెలియజేయుచున్నవి

సోపాధికుడగు బ్రహ్మము నెరుగుటకు సాధన భూతములగు స్నాన సంధ్యాజపాది

కర్మలకు ఆవశ్యకములను పూర్వము చెప్పబడినవి, ఈఖిల కాండమునందు చెప్పబడుచున్నవి

మొదట అంతర్యామి ప్రార్థన.
సదసస్పతి మద్భుతం ప్రియ మిన్ద్రస్యకామ్యమ్ !
సనిం మేధా మయాసిషమ్. – (21)

అద్భుతం = ఆశ్చర్యరూపుడును, ఇంద్రస్య = (జ్ఞానికి) లేక దేవరాజగు ఇంద్రునకును, ప్రియం = ప్రియమైన వాడును (కావుననే) కామ్యం = (అందరిచేత) అపేక్షణీయుడును, సనిం = సర్వకర్మఫల ప్రదాతయు, మేధాం = ధారణాశక్తిని, (ప్రయచ్ఛంత్వం = ఇచ్చు వాడును అగు), సదసస్పతిం = సదసస్పతిని (నిత్యసూరులకు ప్రభువు (లేక) జగత్కారణమైన అవ్యక్తమూర్తిని) – అయాసిషం = నేను పొందితిని

నిత్యసూరుల సభకు అధ్యక్షుడును (లేక) జగత్కారణమైన అవ్యక్తరూపునకు, ఇంద్రునకు ఇష్టమైన వాడును, నాకుకూడా ప్రేమ పాత్రుడును, మేధాశక్తి నొసంగు వాడును అగు పరమాత్మను శరణు పొందెదను.

విశే – కేనోపనిషత్తు ప్రకారము ఇంద్రుడే మొదట పరమాత్మను సన్నిహితంగా దర్శించినవాడు ఐతరేయోపనిషత్ ప్రకారము ఇంద్రుడనగా జీవాత్మ అంతర్యామి అయినందునఅందరికీ ప్రీతి పాత్రుడు – సదసస్పతి

సృష్టిని కావించుటలో ఆయనకు గల అద్భుత శక్తి
సని = వరదుడు (లేక) కీర్తింపదగినవాడు

ఉద్దీప్యస్వజాత వేదో ఽ పఘ్నన్నిర్ ఋతిం మమ (4)
పశూగ్ంశ్చ మహ్యమావహ జీవనంచ దిశోదిశ – (22)

జాతవేదః = (ప్రాణుల శరీరమందు జఠరాగ్ని రూపమునయున్న ఓ అగ్నీ ! (పుట్టిన వాటినన్నింటినీ తెలిసిన పరమాత్మ) మమ = నా యొక్క, నిర్ ఋతిం = పాపమును,

అపఘ్నన్ = పోగొట్టుచున్న వాడవై, ఉద్దీప్యస్వ = ప్రకాశింపుము మహ్యం = నాకొఱకు, పశూన్‌చ = పశువులు మున్నగు భోగ్యజాతమునంతటిని , జీవనంచ = జీవసాధనమగు అన్నాదికములను, ఆవహ = పొందించుము, దిశః = నివాసయోగ్యములగు ఆయా దిక్‌స్థానములను, దిశ= ఇమ్ము
తా - సర్వజ్ఞుడవగు ఓ పరమాత్మా, నా పాపమును పోగొట్టిన వాడవై ప్రకాశింపజేయుము నాకు పది దిక్కులయందును నీయారాధనకు పయుక్తములగు యజ్ఞార్థమైన పశువులనున్ను, జీవన సాధనమగు అన్నాదికమును పొందించుము విశే = నిర్‌ఋతి = అలక్ష్మి = దరిద్రము, సోమరితనము, నేర ప్రవృత్తి, మున్నగునవి అవ = సంపాదించిన ఐశ్వర్యమును నాశము చేయవద్దని ఆ అగ్నినే ప్రార్థించుచున్నాడు మానో హిగ్ంసీజ్జాత వేదోగా మశ్వం పురుషంజగత్ అబి భ్ర దగ్న ఆగహి శ్రియా మా పరిపాతయ
జాతవేదః = ఓ అగ్నీ, అబిభ్రత్ = (మేమేమయిన పాపములను చేసి యుండినచో వాటిని హృదయమున) ధరింపుకుము, నః = మా యొక్క, గాం = గోవులను, అశ్వం = అశ్వములను, మా హింసీత్ = హింసింపకుము, అగ్నే = ఓ అగ్నీ, ఆగహి = రమ్ము, మా = నన్ను, శ్రియా = ధన ధాన్యాది సంపదచేత, పరిపాతయ = అంతటను పొందించుము
తా సర్వజ్ఞుడవగు ఓ స్వామీ । నీవు మమ్ములను, నీ యారాధనమునకుపయోగములయిన గోవులను అశ్వములను హింసింపకుము నీవు హింసారూపమును ధరింపక, రమ్ము నాకు ఐశ్వర్యమును పొందించుము

అవ - ఇక 12 గాయత్రీమంత్రములచేత బ్రహ్మ సాక్షాత్కారమునకు ద్వారభూతములగు ఆయాదేవతలను ముముక్షువు ప్రార్థిచుచున్నాడు

పురుషస్యవిద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి
తన్నోరుద్రః ప్రచోదయాత్ ।

సహస్రాక్షస్య = అనేక నేత్రములు కల, పురుషస్య = పురుషుని యొక్క (స్వరూపమును), విద్మ = తెలుసుకొనుచున్నాము మహా దేవస్య = ఆ మహాదేవుని యొక్క (స్వరూపమును) ధీమహి = ధ్యానముచేసెదము, తత్ = ఆధ్యానమునందు, నః = మమ్ములను, రుద్రః = విరాడ్రూపుడగు మహా దేవుడు, ప్రచోదయాత్ =

ప్రేరణచేయుగాక
పరిపూర్ణుడగు పరమ పురుషుని ఉపాసించుచున్నాము సహస్రాక్షుడగు మహాదేవుని ధ్యానించెదము ఆ ధ్యానమును గూర్చి రుద్రుడు ప్రేరేపించుగాక

తత్పురుషాయ విద్మహే । మహాదేవాయ ధీమహి
తన్నో రుద్రః ప్రచోదయాత్ -

తత్పురుషాయ = ఆ పరమ పురుషుని కొఱకు, విద్మహే = ఉపాసించుచున్నాము (తెలుసుకొనెదముగాక!) (తదర్థం = దానికొరకు), మహాదేవాయః = మహాదేవుని కొఱకు, ధీమహి = ధ్యానించెదముగాక । - రుద్రః = ఈశ్వరుడు, తత్ = ఆ ఉపాసనము గూర్చి, నః = మమ్ములను, ప్రచోదయాత్ = ప్రేరణచేయుగాక పరిపూర్ణుడైన ఆ పరమాత్మను మేము పాసించుచున్నాము అయుపాసన కొఱకు మేము మహాదేవుని (దేవతలలో శ్రేష్ఠుడు) ధ్యానించెదము, ఆ ఈశ్వరుడు మమ్ములను భగవదుపాసన కొఱకు ప్రేరణ చేయుగాక రుద్రుడు = జ్ఞానమునకు, విద్యకు అధిదేవత, ఆయన జ్ఞాన దాత యావత్ప్రపంచానికి ఆచార్యుడు అయనది విరాట్ స్వరూపము పురుషుడు, మహాదేవుడు, రుద్రుడు అను ఈ పదములు ఆ పరమాత్మయొక్క దివ్యవిభూతులను తెలుపుచున్నవి

భట్ట భాస్కరుడు దీనిని వ్యాఖ్యానించలేదు సాయనుడు దీనిని అంగీకరించినారు ప్రపంచసారగ్రంథములోని 27,41లో రుద్ర ధ్యాన శ్లోకమువంటిదని చెప్పినారు బిభ్రద్దోర్భిః కురారం మృగమభయ వరానుప్రసన్నోమహేశః సర్వాలంకార దీప్తః సరసిజనిలయో వ్యాఘ్ర చర్మాత్తవాసః ధ్యేయో ముక్తా పరాగామృతరసకలితాద్రిప్రభః పంచవక్త్రస్త్ర్యక్షః కోటీరకోటీకలితతుహినరుచిః కలోత్తుంగ మౌళిః

తత్పురుషాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి.
తన్నోదంతిః ప్రచోదయాత్ (24)

దంతిః = మహాదంతములు గల ఆ పరిపూర్ణుడగు పరమాత్మను మేము పాసించుచున్నాము ఆ ఉపాసనకొఱకు వక్రతుండుడైన వినాయకుని ప్రార్థించెదము, ఆ విఘ్నేశ్వరుడు ఆ ఉపాసన కొఱకు మమ్ములను ప్రేరేపించుగాక

తత్పురుషాయ విద్మహే,
చక్రతుండాయ ధీమహితన్నోనందిః ప్రచోదయాత్ 25

చక్రతుండాయ, చక్రమువంటి తుండము గల నందికేశ్వరుడు
విష్ణు చక్రమువలె రాక్షస సంహారమపుడు దానిని నోటితో ధరించి శివునికి సాయపడెను శివుని వాహనము నంది పురుషాకారమును ధరించగల సమర్థుడు

తత్పురుషాయ విద్మహే । మహాసేనాయధీమహి
తన్నష్షణ్ముఖః ప్రచోదయాత్ (షణ్ముఖధ్యానము). 26

తత్పురుషాయ విద్మహే ।
సువర్ణ పక్షాయ ధీమహి తన్నోగరుడః ప్రచోదయాత్ – 27
. గరుత్మంతుని ధ్యానించెదము ...

వేదాత్మనాయ విద్మహే । హిరణ్య గర్భాయ ధీమహి.
తన్నో బ్రహ్మ ప్రచోదయాత్. 28

వేదమూర్తి అయిన చతుర్ముఖ బ్రహ్మమే మేము తెలుసుకొందుముగాక అందుకు హిరణ్యగర్భుని సేవించెదము ఆబ్రహ్మమాకు ప్రేరణ కల్పించుగాక

విశే – సాయనాచార్యులు ఈ మంత్రమును పరమ గాయత్రి గా వర్ణించిరి గురువుసాన్నిధ్యంలో వేదాంతము నిష్ఠగా అభ్యసించుచూ మేము పరబ్రహ్మమును తెలుసుకొందుముగాక (వేదములలో ప్రతిపాదించిన పరబ్రహ్మమును తెలుసుకొనెదము గాక) – ఆ పరమ సత్యమును తెలుసుకొనిన తర్వాత దానినే అహోరాత్రులు ధ్యానించుచూ మేము దానితో తాదాత్మ్యము చెందెదముగాక, హిరణ్యగర్భుడనబడు ఆ చతుర్ముఖ బ్రహ్మ అనగా పరమాత్మయే గానీ వేరుకాదు ఆ చైతన్యమే మనలను మంచియో చెడ్డవోకర్మలను ప్రేరేపించుచున్నాడు)

నారాయణాయ విద్మహే । వాసుదేవాయ ధీమహి.
తన్నో విష్ణుః ప్రచోదయాత్. 29

మేము నారాయణుని తెలిసికొందుము గాక దానిని తెలుసు కొనుటకు వాసుదేవుని ధ్యానించెదము విష్ణువుమాకు ప్రేరణ యొసగు గాక
నారాయణుడు – జగములను నడిపించెడు వారు, జగత్కారణుడు, వాసుదేవుడు = సర్వలోకములకు స్వప్రాణులయందును అంతర్యామిగా యుండువాడు
విష్ణువు = సర్వవ్యాపకుడు

వజ్రనఖాయ విద్మహే । తీక్ష్ణదం (దగ్ం) ష్ట్రాయ ధీమహి ।
తన్నోనార సిగ్ం హః ప్రచోదయాత్ 30

వజ్రముల వంటి చేతిగోళ్ళు కలవాడును, పదునైన కోరలు గల తీక్ష్ణదంష్ట్రుడు, నరసింహుడు,

భాస్కరాయ విద్మహే । మహాద్యుతి కరాయ ధీమహి ।
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ – 31

వెలుగు నిచ్చు భాస్కరుని తెలుసుకొందుము గాక। ద్యుతి కరుని ధ్యానించెదముగాక. అదితి కుమారుడు (అనంతాకాశ స్వరూపుడు) మాకు ప్రేరణ కలిగించుగాక

వైశ్వానరాయ విద్మహే ।
లాలీలాయ ధీమహి । తన్నో అగ్నిః ప్రచోదయాత్. 32

మేము వైశ్వానరుని (అందరికి సహాయ పడువారు) తెలిసి కొందుము గాక, లాలీయ = (తన శిఖలలో మనమర్పించు అహుతులను మ్రింగును (నాకును) గనుక) ధ్యానించెదము గాక (లీలాయమానుడు = ముండక ఉపనిషత్తు – మమ్ములను అగ్ని ప్రేరేపించుగాక అది అగ్ని దేవుని హేల క్రీడ –

కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్ 33

కాత్యాయనాయ =కత్యయన గోత్రోద్భవురాలయిన కన్యక కొఱకు, విద్మహే =

తెలిసికొందుము గాక, కన్యకుమారి = దీప్తిమంతురాలయిన కుమారికొఱకు, ధీమహి = ధ్యానించెదము దుర్గిః = దుర్గ, నః = మమ్ములను, ప్రచోదయాత్ = ప్రేరేపించుగాక

ఇది ఆదిశక్తి ధ్యానమంత్రము –

కత్యయన గోత్రోద్భవురాలయిన దుర్గను గూర్చి ఉపాసన చేయుచున్నాము తేజోనిధి అయినకుమారి కొఱకు ధ్యానించెదము ఆ దుర్గమమ్మలను ప్రేరేపించుగాక
కృత్తిం వస్తే ఇతి కాత్యః = రుద్ర, రుద్రుడు అధిష్ఠానముగా గలది కాత్యాయని (2)
కాత్యః ఏవ అయనం అధిష్ఠానం ఉత్పాదకః యస్యాః దుర్గాయాః సాకాత్యాయనీ,
కుత్సితం = అనిష్టం, మారయతి = నివారయతీతికుమారి
కాత్యాయని, కన్య కుమారి, దుర్గ అన్నియు ఒకే ఆదిపరాశక్తి.

స్నానాంగ భూతములగు కొన్ని మంత్రములు

సహస్రపరమాదేవీ శతమూలా శతాంకురా
సర్వగ్ం హరతుమే పాపం దూర్వాదుస్స్వప్ననాశినీ ॥ 34

సహస్ర పరమా = పవిత్ర హేతు భూతములగు వేల కొలది వస్తువుల కంటే శ్రేష్ఠమైనదియు, దేవీ = ప్రకాశించునట్టియు, శతమూలా = అనేక మూలములు గలట్టియు, శతాంకురా = అనేక అంకురములు కలదియు, దుస్స్వప్ననాశనీ = చెడుకలల వల్ల కలుగు అనిష్టములను పోగొట్టునదియు, (అగు) దూర్వా = గరిక, మే= నా యొక్క, సర్వం = సమస్తమైన, పాపం = పాపమును, హరతు – హరించుగాక!

పవిత్రములైన వస్తువులన్నింటిలోనూ, మహా పవిత్రమైనదియు అనేకమూలములు, అంకురములు కలిగి దేవతాస్వరూపమై దుస్స్వప్నములను పోగొట్టునట్టి గఱికె నా పాపములను పోగొట్టుగాక
ఉదయ కాలమున స్నానము చేయునపుడు గఱికెను శిరస్సున పెట్టుకొని చెప్పవలసిన మంత్రము

వ్యాఖ్య - సృష్టిలోని దంతయు ఆ పరమాత్మ విభూతియే, చెట్లు, చేమలు, గడ్డి కూడా రుద్ర రూపమనియే మన భావన ప్రకృతితో మనకు గల సంబంధము వలన కొన్ని ఓషధులకు పూజనీయస్థానములభించినది పవిత్రోత్సవములలో గరికెను ఉపయోగించెదరు గరికెలో అదృశ్య శక్తులున్నవనియు, అవి మనలను పవిత్రము చేయుననియు మన విశ్వాసము మన శాస్త్రములు మానవుని అధ్యాత్మికంగా తీర్చదిద్దుటకై అతడు జాగ్రదవస్థలో యున్నప్పుడు ఆచరించవలసిన కొన్ని ఆచారములను నిర్ణయించినవి అతడు నిద్రనుంచి మేల్కొని, తిరిగి నిద్రపోవువరకు అతని కాలమంతయు ఆచారములను తప్పక నిర్వహించవలసియుంటుంది. వీటిన్నింటి లక్ష్యము భగవదారాధనయే. అతని నిత్యావసరములన్నియు, కొన్ని కొన్ని ప్రత్యేక మంత్రజపముల వల్ల సాధింపబడును పడకనుంచి ఎట్లు దిగవలెనో, మేల్కొనిన తర్వాత మొదట దేనిని చూడవలనో, కాలకృత్యములను తీర్చుకొనుట, ఆహార విషయము, విశ్రాంతి, అతని మాటపలుకు వీటినన్నింటినీ శాస్త్రము నిర్దేశించినది ధర్మశాస్త్రములు వీటిని వివరముగా పేర్కొనినవి. పూజాసమయములందు మంత్రోచ్చారణకు ప్రత్యేకవిలువ ఇవ్వబడినది కానీ ఏదో మొక్కుబడిగా శ్రద్ధలేకుండా చేయుబడుపూజలు నిరర్ధకము ఈ నిత్యానుష్ఠానమువలన ఒక క్రమ శిక్షణ ఏర్పడి, ఒక చక్కటి మార్గము ఏర్పడి, ప్రతి పనిని పవిత్రముగా చేయు అలవాటు ఏర్పడి, అతని జీవితము పవిత్రమై, పరిశుద్ధమై తేజోవంతమవుతుంది శ్రద్ధ, నేర్పు ఆధ్యాత్మిక జీవితమునకు చాలా ముఖ్యము. ప్రాతః స్నానమపుడు ఒక గరికెపోచను, చిటికెడు మట్టిని శిరస్సున ధరించిస్నానము చేసినచో ఆస్నానమునకు పవిత్రత చేకూరును

కాణ్డాత్కాణ్డా త్ప్రరోహన్తీపరుషః పరుషః పరి
ఏవానో దూర్వే ప్రతను సహస్రేణ శతేనచ 35

దూర్వే = పాపమును హింసించునట్టిది గాన దూర్వము (గరికె)
(నీవు) పరుషః పరుషః పరి = ప్రతి గణుపు దగ్గర మొలకెత్తు చున్నావు , కాండాత్ కాండాత్ = ప్రతి మూలము నుండి, ప్రరోహన్తి = మొలకెత్తు చున్నావు, ఏవా = ఇటుల (నీవు) నః = మమ్ములను, సహస్రేణశతేన = వేలకొలది నూర్లకొలది, ప్రతను = సర్వోత్కృష్టముగా విస్తరింపజేయుము

ఓ దూర్వమా ! నీవు పెరిగే కొద్దీ దూరదూరములకు వ్యాపించుచూ, ప్రతి చోట వేర్లూనుచూ, కాండకాండము వద్ద పిలకలను పెట్టుచూపోతున్నావు అటులనే మా వంశము కూడా, వేల, నూర్ల సంఖ్యలో వృద్ధి చెందుగాక
ప్రకృతితో అతిసన్నిహితంగా జీవించిన మన పూర్వీకులు అతికొద్ది సంఖ్యలో ఉండేవారు వంశనాశమంటే భయపడి పోయేవారు గతికెను చూచినప్పుడు దాని మాదిరి వంశము వృద్ధి చెందవలయునని వారి కోరిక

యా శతేన ప్రతనోషి సహస్రేణ విరోహసి
తస్యాస్తే దేవీష్టకే విధేమ హవిషావయమ్ 36

యా = ఏ నీవు, శతేన సహస్రేణ = నూర్లకొలదియు, వేల కొలదియు (స్వవంశమును) ప్రతనోషి= విస్తరింపజేయుచున్నావో, (అట్టి) ఇష్టకే = ఇష్టములైన వంంత్రములచే కొనియాడబడుచున్నావు. దేవీ = పిశంగ వర్ణము చేత ప్రకాశిపబడుచున్నదేవీ ! వయం = మేము, తస్యాః = ఆ, తే = నీ యొక్క (పరిచర్యను), హవిషా = హవిస్సుదానములచేత విధేమ = చేసెదము

భక్తులందరిచేత ఆరాధింపబడుతూ, నూర్లు వేల సంఖ్యలో విస్తరించుకొని పోతున్న నీకు హవిస్సుద్రానములచేసెదము
(35, 36 మంత్రములు సాయనాచార్యులు గానీ, భట్ట భాస్కరులు గానీ వ్యాఖ్యానించలేదు)

అశ్వ క్రాన్తే రథ క్రాన్తే విష్ణు క్రాన్తే వసుంధరా
శిరసా ధారితాదేవి రక్షస్వమాం పదే పదే. 37

అశ్వ క్రాంతే = అశ్వముల చేత ఆక్రమింపబడినదియు, రథ క్రాంతే = రథముల చేత ఆక్రమింపబడినదియు, విష్ణు క్రాంతే = విష్ణువు చేత ఆక్రమింపబడినదియు, అగు ఓ భూమీ ! వసుంధరా = సమస్త ద్రవ్యములను ధరించిన నిన్ను, శిరసా = శిరస్సుచేత, ధారితా = ధరింపబడిన దాన్నవై, పదేపదే = పలు మారులు, మాం = నన్ను, రక్షస్వ = రక్షింపుము

అశ్వములచేతను, రథములచేతను, త్రివిక్రమావతారమూర్తిగా విష్ణువుచే పవిత్రముచేయబడినట్టియు, సర్వసంపదలకు నిలయమైన ఓ భూదేవి, నిన్ను శిరస్సున ధరించుచున్నాను ప్రతి పదమునందును నన్ను రక్షింపుము తన జీవనానికి ఆధారమైన భూదేవిని భక్తితో ఆరాధించుటలో ఆశ్చర్యమేముంది ప్రతి రేణువూ పవిత్రమైనదే

**భూమిర్ధేను ధరణీ లోకధారిణీ**
**ఉద్ధృతాఽసి వరాహేణకృష్ణేన శతబాహునా. 38**

భూమిః = ఓ పృథ్వీ, ధేనుః = కామధేనువు వలె తృప్తి నొందించునట్టిదియు, ధరణీ = సస్యముల ధరించునట్టిదియు, లోకధారిణీ = ప్రాణులను ధరించునట్టిదియును, (నీవు), శత బాహునా = అనేక బాహువులు కలిగినట్టి, కృష్ణేన = నల్లని, వరాహేణ = వరాహావతారమున విష్ణువుచేత, ఉద్ధృతా = (ప్రళయ కాలమందు) ఉద్ధరింపబడినావు

కామధేనువువలె సుఖముల ప్రసాదించునట్టియు, సస్యములను ధరించునట్టిదియు, లోకములను (ప్రాణులను) ధరించు నట్టిదియు, వరాహరూపమున శతబాహుడైన విష్ణుచే ఉద్ధరింపబడితివి.

**మృత్తికేహనమే పాపం యన్మయాదుష్కృతం కృతమ్ మృత్తికే బ్రహ్మదత్తాసి।**
**కాశ్యపేనాఽభి మన్త్రితా మృత్తికే దేహిమే పుష్టిం। త్వయి సర్వం ప్రతిష్ఠితమ్. 39**

మృత్తికే = ఓ భూదేవీ। మయా = నా చేత, యత్ – ఏ, దుష్కృతం = చేయకూడని, పాపం = పాపము, కృతం = చేయబడినదో, మే = నా యొక్క (ఆ పాపమును) హన = నాశము చేయుము, మృత్తికే = భూదేవీ। (నీవు), బ్రహ్మదత్తా = పరమాత్మ చే స్థాపింపబడినదానవు, అసి = అయితివి. కాశ్యపేన = కాశ్యప మహర్షి చేత( ఇతర మహర్షుల చేతను) అభిమంత్రితా = స్నాన కాలమందు అభిమంత్రింపబడిన దానవై (వారిపాపములను పోగొట్టితివి) మృత్తికే = ఏ మృత్తికా దేవతా। మే = నాకు, పుష్టి = పుష్టిని, దేహి = ఇమ్ము, త్వయి = నీ యందే, సర్వం = చతుర్విధ భూతజాత మంతయు, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠింపబడియున్నది.

ఓ భూదేవీ ! నేను చేసిన చేయకూడని పనులను, పాపములను నాశముచేయుము, నీవు మా క్షేమము కొఱకు భగవంతునిచే ప్రసాదింపబడినదానవు నీవు కాశ్యపాది మహర్షులచే పవిత్రముగావింపబడినావు ఈ సర్వమంతయూ నీయందే ప్రతిష్ఠితమై యున్నది కావున నాకు శుభములచేకూర్చుము

వృత్తికే ప్రతిష్ఠితం సర్వంతన్మే నిర్ణుద వృత్తి !
తయా హతేన పాపేన గచ్ఛామి పరమం గతిమ్. 40

(త్వయా హతేన పాపేన జీవామి శరదశ్శతమ్) ప్రతిష్ఠితే = ప్రతిష్ఠింపబడిన, మృత్తికే = మృత్తికాభిమాన దేవతా ! తత్ = ఈ ప్రసిద్ధమైన, మే = నా యొక్క, సర్వం = పాపమంతయు, నిర్ణుద = నాశము చేయుము, మృత్తికే ! = ఓ భూదేవీ ! తయా = అసుప్రసిద్ధమైన నీ చేత, పాపేన = పాపము, హతేన = హతమైన దగుచుండగా, పరమాంగతి = మోక్షమును, గచ్ఛామి = పొందుచున్నాము (నూరు సంవత్సరములు జీవించెదము గాక !)
ఓ భూదేవీ ! నీ యందే అంతయు ప్రతిష్ఠింపబడియున్నది నా పాపములనన్నింటినీ హరింపుము నా పాపములు తొలగిపోగా, నేను పరమగతిని పొందెదను

విశే = షమును చెప్పవలసినపుడు భూదేవినే చెప్పవలయును భూమిని మానవుడు ఎన్ని రకములుగా క్షోభపెట్టిననూ (చదును చేయుట, త్రవ్వుట – తొక్కడం) వానికి ఎన్నో సుఖములను చేకూర్చుచూ ఆధారభూతమైయున్నది

అభయము చేకూర్చుటకై ఇంద్రుని ప్రార్థించుట.

యత ఇంద్ర భయామహే !
తతోనో అభయం కృధిమఘవఞ్ఛగ్ధి తవతన్న ఉతయే ! విద్విషోవిమృధోజహి 41

ఇంద్ర = ఓ ఇంద్రా! యతః = ఏ పాపమువలన, (మేము), భయామహే = భయపడుచున్నారమో, తతః = ఆ పాపాదిత్రయమునుండి, నః = మాకు, అభయం = అభయమును, కృధి = చేయుము మఘవన్ = ఇంద్రుడా ! తత్ = ఆ

పాపాదిత్రయమును, శగ్ధి = నాశముచేయుము తవ = నీ యొక్క, నః = మా యొక్క, ఊతయే = సంరక్షణ కొఱకు, విమృధః = పీడను కలుగజేయునట్టి, విద్విషః = శత్రువులను, జహి = సంహరించుము.

ఓ ఇంద్రా ! మేము ఏ పాపములవల్ల, శత్రువులవల్ల, నరకము వల్ల భయపడుచున్నామో ఆ భయమును పోగొట్టుము ఆ భయకారణమును తొలగించుము మా సంరక్షణకై మమ్ములను పీడించుచున్న ఆ శత్రువులను సంహరింపుము

స్వస్తిదా విశస్పతిర్వృత్రహా ! విమృధోవశీ !
వృషేన్ద్రః పురఏతున స్వస్తిదా అభయం కరః 42

స్వస్తిదా = ఇహలోకసౌఖ్యముల నిచ్చునట్టిదియును, విషస్పతిః = భక్తులను పాలించువాడును, వృత్రహా = వృత్రాసురుని సంహరించినట్టియు, విమృధః = శత్రువులను, వశీ = స్వాధీనము చేసుకొనిన వాడును, వృషా = వర్షించువాడును, స్వస్తిదాః = పరలోక సౌఖ్యముల నిచ్చువాడును, అభయంకరః అభయదాతయును (అగు) ఇంద్రః = ఇంద్రుడు, నః = (స్నానార్థముపోవునట్టి) మమ్ము, పురః = ముందట, ఏతు = (రక్షించుటకు) వచ్చుగాక !.
ఇహపరసౌఖ్యములనిచ్చువాడును, వృత్రాసురుని సంహరించిన వాడును, శత్రువులను వశమొందించుకొన్నవాడును, వర్షముల కురిపించువాడును, అభయ ప్రదాతయు అగు ఇంద్రుడు మా రక్షణకై మా వద్దకు వచ్చుగాక!.
విశే = ఋగ్వేద సంహితలో ఇంద్రుని, జగన్నియామకుడుగా, నరేంద్రుడుగా, దేవేంద్రుడుగా, స్వర్గాధిపతిగా, అందరినీ సంరక్షించువాడుగా, శాశ్వతుడుగా, మునులశ్రేయోభిలాషిగా, దుష్టశిక్షకుడుగా, వర్ణించబడియున్నది.

అందుచే ఇంద్రుడు పరమాత్మయే అని రూఢియగుచున్నది ఇంద్రుడే జగద్రక్షకుడు. అందువలననే సాధకుడు ఈ రెండు మంత్రములతో ఇంద్రుని వేడుకొనుచున్నాడు తన అంతః బహిశ్శత్రువులను సంహరించుటకై తనవద్దకు రమ్మని ఆ వాహన చేయుచున్నాడు.

హిందువులకు స్నానము చేయుట కేవలము దేహారోగ్యమునకే కాక, మన శాస్త్రములు

విధించిన విధి అది = మనో నైర్మల్యము పొందుటకు, అధ్యాత్మికాభివృద్ధి కొఱకు నిర్ణయించబడిన ముఖ్యమైనవిధి  ఇటువంటి ధ్యానమువలన ఎంతో శ్రేయస్సుకలుగును

స్వస్తినః = ఇంద్రోవృద్ధ శ్రవా ।
స్వస్తినః పూషా విశ్వవేదాః స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమి ।
స్వస్తినోబృహస్పతిర్దధాతు                43.

వృద్ధశ్రవాః = సమృద్ధమైన కీర్తిగల, ఇంద్రః = ఇంద్రుడు, నః = మాకు , స్వస్తి = సౌఖ్యమును, దధాతు = ఇచ్చుగాక। విశ్వవేదాః = గొప్ప జ్ఞానముగల(లేక) గొప్ప ఐశ్వర్యముగల, పూషా = సూర్యుడు, నః = మాకు, స్వస్తి = సౌఖ్యమును (కలుగుజేయుగాక), అరిష్టనేమిః = అ ప్రతిహతరథము గల , తార్క్ష్యః = గరుడుడు, నః = మాకు, స్వస్తి = సౌఖ్యమును, దధాతు = ఇచ్చుగాక, బృహస్పతిః = బృహస్పతి, నః = మాకు, స్వస్తి = సౌఖ్యమును, దధాతు = ఇచ్చుగాక

మంత్రముల చేత, హోమాదులచే విశేషముగా కీర్తింపబడు ఇంద్రుడు మమ్ములను రక్షించుగాక, సర్వజ్ఞుడు, సర్వసంపన్నుడగు సూర్యుడు మాకు సౌఖ్యముల నిచ్చుగాక, అరిష్టనేమి = నేమి = బండిగాలు, హింసింపబడని నేమిగలవాడు ఎంత కాలము పోవుచున్నను శత్రువులైన రాక్షసులు అడ్డగించినను నిలువని రథముగల వాడగు గరుడుడు మాకు సౌఖ్యములను చేకూర్చుగాక దేవగురువగు బృహస్పతి మాకు మేలు చేకూర్చుగాక
విశే = స్నానమునకు ముందు ఈ మంత్రమును చెప్పవలయును. మొసళ్ళు, సొరచేపలవలన హాని కలుగదు  అంతేగాక, రక్షణను, క్షేమమును కలిగించును

ఆపాంతమన్యుస్తృపల ప్రభ ।
ర్మాధునిశ్శమీవాఞ్ఛ రువహాగ్ం ఋజీషీ సోమో విశ్వాన్యతసా
వనాని నార్వాగింద్రం ప్రతి మానాని దేభుః              44

ఆ పాంతమన్యుః = పైపైని కోపము కలిగినట్టియు, తృపల ప్రభః = చంద్రకాంత శిలల వంటి కాంతి కలిగినట్టియు, మాధునిః = వసంతుని చెలికాడును, శమీ వాన్

= శమీ పత్రములు కలవాడును ( శమీ పత్రములు శివునికి ప్రియమైనవి) శరుమాన్ = అధిక సౌఖ్యముకలవాడును, ఋజీషీ = అధిక దీప్తి కలవాడును అగు, సోమః = చంద్రుడు, అతసా = (తన యొక్క) ఎడతెగని గమనము చేత, వనాని = ఓషధులను (వృద్ధి పొందించుచున్నారు) అర్వాంచి = అర్వాచీనములను, ప్రతిమానాని = ఉపమానములు, ఇంద్రం = ఇంద్రుని, నదేభుః = హింసింపజాలవు

పైపైన కోపము కలవాడును, వసంతుని చెలికాడును, శమీపత్రములు కలవాడును, అధిక సౌఖ్యములు కలవాడును, అధిక దీప్తి కలవాడును, అగు చంద్రుడు, తన ఎడతెగని గమనము చేత సర్వ ఓషధులను వృద్ధి పొందించుచున్నారు ఇంద్రునితో సరితూగగల వారెవ్వరూలేరు.

ఈ మంత్రము చాలా క్లిష్టమైనదని యాస్కుడు రచించాడు.

సాయన భాష్య ప్రకారము –
ఆపాంత మన్యుః = క్రోధప్రదర్శన చేతను, తృపలప్రభర్మా = రాళ్లతో కొట్టుట చేతను, ధునిః = శత్రువులను గజగజ లాడించువాడు, శిమీవాన్ = పెక్కు కార్యములు చేసిన వాడు, శరుమాన్ = ఆయుధ ధారియు, ఋజీషీ = సోమరసమును త్రాగువాడును, సోమః = (సోమా రాధకుడైన ఇంద్రుడు) ఇంద్రుడు, విశ్వాని = సర్వమును, అతసావనాని = ఓషధులను వృద్ధి పొందించువాడు, ప్రతిమానాని = ఉపమానములు = సమానములు, ఇంద్రమ్ = ఇంద్ర, ఆర్వాక్ = అధోదిశగా, నదేభుః = తగ్గించలేరు. క్రోధ ప్రదర్శనము చేతను, రాళ్లతో కొట్టుట చేతను శత్రువులను గజగజలాడించువాడును, అనేక విజయములు సాధించిన వాడును, సర్వాయుధ ధారియు, సోమరస పానము చేయువాడును అగు చంద్రుడు, (ఇంద్రుడు) సర్వములను, ఓషధులను వృద్ధిపొందించువాడు అతనితో సరితూగ గలవారును, అతనిని క్రిందికిదించగలవారును ఎవ్వరూ లేరు

ఈ మంత్రము ఋగ్వేదములో 10-89-5 గాయున్నది. ఈ మంత్రములోని **ఋజీషి** అనుపదము ఘటసారసోమ ద్రవ్యమని సాయనుడు వ్యాఖ్యానించారు.
ఇందులోని నాల్గవ పాదము ఇంద్రుని గొప్పదనము నిరూపింపబడుచున్నది త్రాసులో ఒక వైపు ఇంద్రుని ఉంచి మరొకవైపు మరేదేనిని ఉంచిననూ, ఇంద్రుని తగ్గించలేరు.

గమనిక – మొదటి టీకలో, తృపల ప్రభః, మాధునిః అనియు, రెండవటీకలో, తృపల ప్రభర్మా, ధుని అనియూ వివరింపబడినవి
ఇంద్రుని ఇంకొకనితో పోల్చుటవలన ఇంద్రునికి దుఃఖము కలుగ వచ్చును ఉపమానము లేని ఎడల తనంతటి వాడు తానేయని సంతుష్టి చెందును అతడు నిరుపమానుడు. అట్టి ఇంద్రుడు మమ్ములను రక్షించుగాక

# పరమాత్మ ప్రార్ధనలు.

బ్రహ్మజజ్ఞానం ప్రధమం పురస్తా ।
ద్విసీమత స్సురుచో వేన ఆవః సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠా ।
సతశ్చయోని మసతశ్చ వివః. (45)

ప్రధమం = సర్వదేవతలకు మొదలైనట్టియు, పురస్తాత్ = ప్రాగ్దిశ యందు, జజ్ఞానం = (సూర్యరూపమున) పుట్టునదియు, వేనః = కమనీయమునకు, బ్రహ్మ = పరబ్రహ్మము, సురుచః = మిక్కిలికాంతిగల త్రిలోకములను, సీమతః = చివరివరకు, విఆవః = (స్వప్రకాశముచేత) వివృతములుగా నొనర్చెను సః = ఆపరబ్రహ్మము, అస్య = ఈ జగత్తు యొక్క, విష్ఠాః = వివిధ స్థాన భూతములను, ఉపమాః = సావకాశములగు, బుధ్నియాః = ప్రాగాది దిక్కులకును, సతః = విద్యమానమగు ఘటపటాదికముల యొక్కయు, అ సతః చ = అమూర్తమగు వాయ్వాదికముయొక్క, యోనిః = పుట్టుకను, వివః ప్రకాశింపజేయును = సృష్ట్యారంభమునందు పరబ్రహ్మముచే సృష్టింపబడిన సూర్యడు (వేనుడు) తన దివ్యకాంతులతో లోకములన న్నింటినీ ప్రకాశింపచేసియున్నాడు ఆయన స్వర్గాదులను కూడా ప్రకాశింపచేయుచున్నాడు ఈ జగత్తు యొక్క వివిధ స్థాన భూతములను తన వలెనే బహువిధములుగా ప్రకాశింపజేయుచు, దృశ్యమాన, అదృశ్యమాన జగదావిర్భావమునకు కారణభూతుడగు చున్నాడు
ఇదితైత్తిరీయ సంహిత IV –2, 8, 2 లోను, అధర్వవేదములో IV 1–1, V –6–1 లోనూ కలదు సాయనుడు దీనిని మరొకవిధముగా వ్యాఖ్యానించి యున్నాడు ఈ మంత్రము పరమాత్మ వైభవమును చాటుచున్నది సూర్యాంతర్గత పరబ్రహ్మముగా వర్ణించి యున్నారు.

మృత్తికా ప్రార్థన –

స్యోనాపృథివి భవాన్వృక్షరా నివేశనీ యచ్ఛానశ్శర్మస ప్రథాః 46

పృథివి = ఓ విశాలమైన భూదేవీ – నః = మాకు, స్యోనా = దుఃఖ నాశనివి, భవా = కమ్ము, నృక్షరా = మనుష్యాది భూత చతుష్టయమును కలుగజేయుదానవు, నివేశనీ = వారిని అచ్చటచ్చట నివసింపజేయుదానవు సప్రథాః = సర్వంసహ అను కీర్తితో వెలయునట్టి నీవు, నః = మాకు, శర్మ = సౌఖ్యమును, యచ్ఛా = ఇమ్ము

ఓ పృథివీ! మనుష్యాదిభూతచతుష్టయమును సృష్టించి, వారికి ఆవాసము కలిగించి, క్షమకు ని ధానమని కీర్తి బొందిన నీవు, మా దుఃఖములను నాశము చేసి ఇహపరసౌఖ్యముల నిమ్ము! (41 నుంచి 46 వరకు కొన్ని పాఠములలో లేవు. భట్ట భాస్కరుడు, సాయనుడు వీటికి వ్యాఖ్య వ్రాయలేదు).

గంధ ద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామి హోపహ్వయే శ్రియమ్. 47

గంధ ద్వారాం = గంధము (వాసన) ద్వారా తెలుసుకోబడునదియు, దురా ధర్షాం = దేని చేతను కంపింప జేయజాలనిదియు, నిత్య పుష్టాం = ఎల్లప్పుడు, బహువిధ సస్యాది శోభితయు, కరీషిణీం = గోమయముతో కూడి యుండునది యు, సర్వభూతానాం = సకల ప్రాణులకు, ఈశ్వరీం = నియామకురాలును, శ్రియం = అందరిచేత ఆశ్రయింపబడునదియు, (అగు) తాం = ఆభూమిని, ఇహ = ఈ స్నాన కర్మయందు, ఉపహ్వయే = సమీపమునకు పిలుచుచున్నాము (కరీషిణీం = నానావిధములగు గవాది పశు సమన్విత అనిగానీ, చతుష్ప్రాజ్ఞంతు నిష్ఠయనియు అర్థము చెప్పుకొనవచ్చును –

విశే – ఇందు భూ దేవత (శ్రీ) = లక్ష్మిగా వర్ణింపబడుచున్నది ఇది (శ్రీ) సూక్తములో కూడా కలదు గంధము (వాసన ద్వారా తెలుసుకొనబడునదియు, ఎవరిచేత

కంపింపజాలనిదియు (పాపులకు అందరానిదియు) - ఎల్లప్పుడు వృద్ధి పొందునదియు (శోభించునదియు) సకల భూతములకు ఈశ్వరియైన నిన్ను మాసమీపమునకు పిలుచుచున్నాము

విశే - పేడతో ఇల్లు అలుకున్నప్పుడు, దేహమునకు మట్టిని పూసుకొనునప్పుడు చెప్పవలసిన మంత్రము ఇది అని కొందరి అభిప్రాయము. నిత్య పుష్టాం, కరీషిణీం - గంధద్వారాం అను పదములవలన, పాడి పంటలు, దానధర్మములు, పల్లెలు పట్టణములు ఇవన్నియు స్ఫురించుచున్నవి

**శ్రీర్మే భజతు అలక్ష్మీర్మేనశ్యతు ।**
**విష్ణుముఖావై దేవాశ్ఛన్దోభిరిమాన్లోకానసపజయ్యమభ్యజన్ ।**
**మహాగ్ం ఇన్ద్రో వజ్రబాహు షోడశీ శర్మయచ్ఛతు** 48

శ్రీః = సంపద, మే = నన్ను, భజతు ప్రొందుగాక, మే = నాయొక్క, అలక్ష్మీః = జ్యేష్ఠాదేవి, నశ్యతు = నశించుగాక, విష్ణుముఖాః = విష్ణు ప్రధానులగు, దేవాః = దేవతలు, చందోభిః = వేదవిహితసాధనములచేత, ఇమాన్ = ఈ, లోకాన్ = లోకములను అనపజయ్యం = రాక్షసనాయకులు జయించుటకు వీలుగాని వడుపున, అభ్యజయన్వై = పొందిరిగదా । వజ్రబాహు = వజ్రాయుధమును ధరించినవాడును, మహాన్ = లోకత్రయ పూజ్యాడును, షోడశీ = చంద్రతుల్యుడును అగు, ఇంద్రః = ఇంద్రుడు, శర్మ = సుఖమును, యచ్ఛతు = (మాకు) ఇచ్చుగాక, లక్ష్మీదేవి నన్నను గ్రహించుగాక

నాకు, నా సంబంధీకులకు చెందిన అలక్ష్మినశించుగాక దేవతలు లక్ష్మీపతి అయిన విష్ణువును వేదవిధులను పాటించి ఈ లోకములను తమ స్వాధీనమందుంచుకొని తమ శత్రువులచే జయింపబడకపోయిరి. వజ్రహస్తుడైన ఇంద్రుడు ఆరాధింపతగిన చంద్రుడు మాకు సుఖములు నిచ్చుగాక

షోడశీ అనగా శ్రీ విద్య, దానిని జపించు వాడు షోడశీ అనబడును. దానిని జపించి చంద్రుడు ఇంద్రుడు ఆపదవులను పొందిరి

స్వస్తి నోమఘవా కరోతు హన్తు పాప్మానం యోఽస్మాన్ద్వేష్టి - 49

మఘవా = ఇంద్రుడు, నః = మాకు, స్వస్తి = సౌఖ్యమును, కరోతు = చేయుగాక, యః = ఏపాపాత్ముడు అస్మాన్ = మమ్ము, ద్వేష్టి = ద్వేషించుచున్నాడో, పాప్మానం = అట్టిపాపిని, హన్తు = నాశము చేయుగాక
ఇంద్రుడు మాకు సుఖములనిచ్చుగాక! మమ్ములను ద్వేషించు పాపాత్ములను నాశము చేయుగాక

విశే - 48, 49 రెండు మంత్రములచే, అభిమంత్రించిన మృత్తికను ఆపాదమస్తకముపూసుకొని జలప్రవేశము చేయునప్పుడు చెప్పవలసిన మంత్రములు ఈ రెండు మంత్రములు ద్రావిడ పాఠమున లేవు.

సోమానగ్ఁం స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే కక్షీవన్తంయ ఔశిజమ్ ।
శరీరం యజ్ఞ శమలం కుసీదం తస్మి న్సీదతు । యో ఽ స్మాన్ద్వేష్టి - 50

బ్రహ్మణస్పతే = వేదపరిపాలకుడవగు ఓ పరమాత్మా, నన్ను సోమానం = సోమలతను, స్వరణం = స్వరముల నెరిగిన వానినిగను, కృణుహి = చేయుము ఔశిజం = ఉశిక్ అను స్త్రీ యొక్క పుత్రుడగు, యః = ఏ, కక్షవంతం = కక్షవంతుడను మహర్షికలడో, (అతడు), శరీరం = నా దేహమును, యజ్ఞశమలం = యజ్ఞార్థమయిన శ్రమను సహించుదానినిగా (చేయుగాక) అస్మాన్ = మమ్ములను యః = ఎవడు, ద్వేష్టి = ద్వేషించుచున్నాడో, సః = వాడు, తస్మిన్ = ఆ, కుసీదం = నరకమునందు, సీదతు = పడియుండుగాక!

ఓ పరమాత్మా ! నన్ను సోమలతను పిండు ఉశికి తనయుడగు కక్షవంతుని వలె చేయుము. యజ్ఞాదులను చేయుటకు నా దేహమును సమర్థవంతముగా చేయుము మాకు శత్రువులైన వారిని అక్కడే, ఆ నరకమందే పడి యుండనిమ్ము.

చరణం పవిత్రం వితతం పురాణమ్ యేన పూతస్తరతి దుష్కృతాని ।
తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతి పాప్మాన మరాతిం తరేమ. 51

యత్ = ఏ, పవిత్రం = పవిత్రమగు, చరణం = చరణము, వితతం = విస్తారమైనదో, పురాణం = పురాతనమైనదో, యేన = ఏ పవిత్రమగు చరణము చేత, పూతః = పవిత్రమొనర్పబడిన మనుష్యుడు, దుష్కృతాని = పాపములను, తరతి = దాటుచున్నాడో, పవిత్రేన = పవిత్రమగు, శుద్ధేన = శుద్ధమైన, తేన = ఆ శ్రీమహావిష్ణువు యొక్క పాదముచేత, పూతాః = పవిత్రమొనర్పబడిన వారలమై, ఆరాతిం = నరక హేతువగుట చేత శత్రుభూతుడగు, పాప్మానం = పాపమును, అతి తరేమ = అతి క్రమించెదముగాక

పవిత్రమైన, పురాతనమైన, సర్వమును వ్యాపించిన ఆ పాదమును (త్రివిక్రమావతరంలోని ఆ పాదమును సేవించిన వారమై మేము మా పాపములను, దుష్కర్మలను దాటుచున్నాము మేమున్ను పవిత్రులమై (ఆపాద సేవవలన) శత్రుభూతమగు నరకమును దాటుచున్నాము

విశే – చరణం అనుటకు శాస్త్రచరణము అని అర్థము చెప్పుకొనినచో బాగుండును . పుణ్యాత్ములైన బ్రాహ్మణ పాద పూజచేయునప్పుడు చెప్పబడు మంత్రము మోకాలు నీటిలో నిలబడి ఈ మంత్రమును చెప్పి – తరువాత నీట ముమ్మారు మునగవలయును

**సజోషా ఇన్ద్రసగణో మరుద్భి ! స్సోమం పిబ వృత్రహ శ్చూర విద్వాన్ । జహిశ త్రూగ్ం రపమృధో మదస్వా । థాభయం కృణుహి విశ్వతో హినః. 52.**

వృత్రహన్ = వృత్రాసురుని చంపినవాడవును, శూర = శూరుడవును అగు, ఇంద్ర = ఓ ఇంద్రుడా ! సజోషాః = సమానమైన ప్రీతికలవాడవై, సగణః = పరివారగణ సమేతుడవై, విద్వాన్ = సర్వజ్ఞుడవై, మరుద్భిః = దేవతలతోడ, సోమం = సోమమును, పిబ = పానము చేయుము. శత్రూన్ = శత్రువులను, జహి = చంపుము మృధః = యుద్ధములు, అపదనుస్వ = నాశము చేయుము అధ = పిదప, నః = మాకు, విశ్వతః = అన్ని వైపుల, అభయం = అభయమును, కృణుహి = చేయుము

వృత్రాసురుని చంపిన వాడవు, శూరుడవు సర్వజ్ఞుడవైన ఓ ఇంద్రా । మేము అర్పించు

సోమరసమును, నీ అనుచరగణముతోనూ, దేవతలతోను, ప్రీతితో పానము చేయుము మాశత్రువులను చంపుము మేము చేయు యుద్ధములందు జయమునిమ్ము మాకు అన్నివైపుల రక్షణము, అభయమునిమ్ము (48 నుంచి 52 వరకు గల మంత్రములు కొన్ని పాఠములలో లేవు అందుచేత భట్టభాస్కరుడు, సాయనుడు వ్యాఖ్య వ్రాయలేదు)

సుమిత్రాన అప ఓషధీయస్సన్తు
దుర్మిత్రా స్తస్మైభూయాసుర్యో ఽ స్మాన్ద్వేష్టియంచవయం ద్విష్మః 53

నః = మమ్ములను గూర్చి, ఆపః = జలములు, ఓషధయః = ఓషధులు, సుమిత్రాః = మంచి మిత్రములు, సంతు = అగుగాక, యః = ఎవడు, అస్మాన్ = మమ్ములను, ద్వేష్టి = ద్వేషించుచున్నాడో, యంచ = ఎవనిని, వయం = మేము, ద్విష్మః = ద్వేషించుచున్నామో, తస్మై = వానికి, దుర్మిత్రాః = చెడ్డ స్నేహితులు, భూయాసుః = అగుగాక

మాకు జలాధిదేవత, ఓషధీ దేవత మిత్రములగు గాక! మమ్ములను ద్వేషించువారికి, మేము ద్వేషించు వారికి వారు అ మిత్రులగుదురుగాక విశే = నాభిమాత్ర జలమునందు నిలబడి దోసిలితో నీళ్లను తీసుకొని తన మిత్రులను తలచుకొనుచు, ప్రథమపాదముతో నీళ్లను వదలవలెను మంత్రములోని రెండవపాదమును చెప్పుచూ శత్రువులనున్నదిక్కునకు చల్లవలెను

విశే – అన్ని సందర్భములలోను, అన్నివేళలల్లోను, అందరికీ వారిలోయుండు శక్తులను ఉద్దీపపరుచుటకై వేదములు కొన్ని విధులను ఏర్పరిచినవి. వాటి లక్ష్యము ఆత్మసాక్షాత్కారమే ఆస్థాయికి చేరిన వారు (గుణాతీతులు, స్థితప్రజ్ఞులు, మహాత్ములు) చాలా కొద్దిమంది మాత్రమే. వేదములలోని ఎక్కువ భాగము పామరుల కోసమే ఉద్దేశించబడినవి మానవుని లోని లోపాలను, ఆశలను వైఫల్యాలను గుర్తించి వాటికి పరిష్కారములను బోధించకపోతే ఆ శాస్త్రములు నిరర్ధకములు స్నేహితులకు క్షేమము, శత్రు వినాశము, తనకూతనవారికీ సుఖశాంతులు సౌభాగ్యము పొందుటకు అతీతశక్తులను భగవంతుని ప్రార్థించుట సహజమే పురుషార్థములను పొందుటకు అవసరమైన మంత్రములు వేదమునందనేకములు కలవు

అపోహిష్ఠా మయోభువస్తానఊర్జే దధాతన
మహేరణాయ చక్షసే! యోవ శ్శివతమోరసస్తస్య
భాజయతేహనః! ఉశతీరివ మాతరః! తస్మా అరంగమామవో
యస్యక్షయాయ జన్వథ! ఆపోజనయథాచనః 54.

ఆపః = ఉదకములారా! యస్య = ఏ పాపము యొక్క, క్షయాయ = క్షయము కొఱకు, జన్వథ = (మీరు) ప్రీతిని చేయుచున్నారో తస్మై = ఆ పాపక్షయము కొఱకే, వః = మిమ్ములను, అరం = మిక్కిలి, జనయథాచ = పుత్రపౌత్రాది జనన సమర్థులనుగా జేయుడు

ఓ జలములారా! మీరు మాకు సుఖ దాతలు, అందుచే మాకు అన్నమును, గొప్ప అంతర్ దృష్టి(ఆత్మావలోకనము) ని ఇవ్వండి ఇంకనూ, మీ యొక్క ఆనందమున మేమూ భాగస్వాములగు నటుల మమ్ము చేయుడి. ప్రియమైన తల్లుల వలె మా కానందమును ఇవ్వండి ఓ జలములారా! మా పాపములను పోగొట్టి మా వంశమును వృద్ధి పొందించుము

ప్రాతః స్మరణీయమంత్రములలో ఇది చాలాముఖ్యమైనది తనను తాను పరిశుద్ధుడగుటకు ప్రోక్షించు కొను సమయమున చెప్పబడుమంత్రమిది ఇందు జలములనగా కేవలము ద్రవపదార్థమైన నీరుగా కాక, పరమాత్మగా భావింపబడుతున్నది. పంచ భూతములలో ఒకటైన అప్ మనకు అన్నదాత, ప్రాణాధారము, సౌఖ్యము నిచ్చు నట్టిది, మన ఆత్మావలోకమునకు ఆధ్యాత్మికాభివృద్ధికి ఎంతో అవసరమైనది నీరు, ఈ మంత్రములో మయః అను పదము పరమానందము ను సూచించును ఆ పరమానందము అనగా బ్రహ్మమే రస అను పదము కూడా బ్రహ్మమునే సూచించును. మాతః తల్లి అనగానే మనకన్నింటినీ దయతో ఇచ్చు పరమాత్మ అని తెలుస్తున్నది

జలములను సృష్టించి నదీ పరమాత్మయే. కారణమైన బ్రహ్మము, కార్యమైన జలమూ ఒక్కటే, అందుచేత సాధకుడు నిద్రలేచిన తోడనే, అన్నపానాదులకు, ఆరోగ్యమునకు, ఆధ్యాత్మికాభి వృద్ధికి, శాశ్వతానందములకు ఆ పరమాత్మనే పై విధముగా ప్రార్థించుచున్నారు హిందువులకు నీరు కేవలము ఈ దేహధారణకు

అవసరమైన పదార్థమనియే కాక, అందుబాటు లోనూ, ప్రత్యక్షముగాను ఉన్న దేవత అని నమ్మకము ఈ దేవత మనకు ఆరాధించుటకు, ఆత్మశుద్ధికి ఉపయోగపడుతుంది అందుచేత నీటిని ఏ విధముగా అపవిత్రము చేసిననూ, దుర్వినియోగము చేసిననూ, అది మహాపాపము – తైత్తిరీయా రణక్యం 1–26–7లో నాస్తు మూత్రపురీషం నన్నిష్టీవేత్, నవివసనః స్నాయాతు నకూర్మస్యాశ నీయాత్, నోదీకస్య అధాతు కాన్యే నమోదకస్యభవంతి – అధాతుకాః ఆపః

ఎవడు కానీ నీటిలో ఉమ్మరాదు మూత్ర విసర్జన చేయరాదు నీటిలో మల విసర్జన చేయరాదు తాబేలును కాని, చేపలను కానీ తినరాదు అటువంటి వానిని జలము వాని యెడ ప్రసన్నతతో యుండును

**హిరణ్య శృంగం వరుణం ప్రపద్యే । తీర్థం మేదేహి యాచితః**
**యన్మయా భుక్త మ సూధానాం పాపే భ్యశ్చ్రహః ప్రతి గ్రహాః – 55**

**యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతం కృతమ్।**
**తన్న ఇంద్రో వరుణో బృహస్పతి । స్సవితా చపునంతు (పునః పునః) 56**

హిరణ్య శృంగం = బంగారు కిరీటము – గల, వరుణం = వరుణుని, ప్రపద్యే = శరణు పొందుచున్నాను (ఓ వరుణదేవా), యాచితః = యాచింపబడిన వాడవై, తీర్థం = అవతరణస్థానమును, మే = నాకు, దేహి = ఇమ్ము, మయా = నా చేత, అసాధూనాం = పాపులయొక్క ఇండ్లల్లో, యత్ = ఎయ్యది, భుక్తం = భజింపబడినదో, పాపేభ్యశ్చ = పాపుల సమీపానయుండి, ప్రతి గ్రహః = (కృతః) ప్రతి గ్రహింపబడినదో

మే = నా యొక్క, మనసా = మనస్సు చేతను, వాచా = వాక్కు చేతను, కర్మణావా = కర్మచేతను, యత్ = ఏ, దుష్కృతం = దురితము, కృతం = చేయబడినదో, నః = మా యొక్క తత్ = ఆ పాపమునంతయును, ఇంద్రః = ఇంద్రుడు, వరుణః = వరుణుడును, బృహస్పతిః = బృహస్పతియును, సవితాచ = సవితయును, పునః పునః = మాటిమాటికి, పునన్తు = శోధించెదరు నేను హిరణ్య కిరీటము గల వరుణుని శరణు బొందెదను ఓ వరుణా । నా ప్రార్థనచే ప్రీతి చెందిన నీవు నాకు తీర్థమును ఇమ్ము, నేను చెడ్డవారి భోజనమును స్వీకరించి యుంటిని పాపులనుండి నేను

స్వీకరించియుంటిని నేను నా వారూ, మనో వాక్కాయ కర్మలచే చేసిన పాపములను, ఇంద్రుడు, వరుణుడు, బృహస్పతి, సూర్యుడు, తొలగించుగాక

**విశేషణ** – ఈ రెండు మంత్రములు స్నానము చేయునప్పుడు చెప్పవలసినవి వరుణుడు జలాధి దేవత, తీర్థమనగా, స్నాన ఘట్టము, కోనేరు లేక మానవుల పాపమునుండి తరింప జేయునది పాపులనుండి విధిలేని పరిస్థితులలో ఏమయిననూ తీసుకొన్నచో దానికి ప్రాయశ్చిత్తముగా కొన్ని పారిశుద్ధ్య కర్మలను చేయవలసియుంటుంది, దుర్మార్గులకు, పాపులకు దూరముగా యుండవలసినదని ఈ మంత్రములు చెప్పుచున్నది చాందోగ్యోప నిషత్తు 5– 11–5 లో కేకయ రాజా అశ్వపతి ఐదుమంది బ్రాహ్మణులకు దానము స్వీకరించవలసినదని భోదిస్తాడు. తాను రాజాననియు, తన రాజ్యములో, దొంగతనము, వ్యభిచారము, ఇతర చెడ్డ కృత్యముల చేయు వారు లేరనియు, ఆ బ్రాహ్మణులు తన వద్దనుంచి దానము తీసుకొనుటలో తప్పు లేదు అని చెప్పెను.

**నమో 2గ్నయే 2 ప్సు మతే, నమ ఇన్ద్రాయ, నమో వరుణాయ, నమో వారుణ్యైనమో 2 ద్భ్యః. 57**

అప్సుమతే = జలములుగల, అగ్నయే = అగ్ని కొఱకు నమః = నమస్కారము, ఇంద్రాయ = ఇంద్రుని కొఱకు, నమః = నమస్కారము, వరుణాయ = వరుణుని కొఱకు, నమః = నమస్కారము, వారుణ్యై = వరుణుని భార్యకు, నమః = నమస్కారము, అద్భ్యః = జలముల కొఱకు, నమః = నమస్కారము

తాత్పర్యము సులభము

**యదపాంక్రూరం యదమేధ్యం యదశాన్తం తదపగచ్ఛత్, 58**

అపాం = నీటిలోని, యత్ = ఏ, క్రూరం = మరణకారణమగు, సుడి గుండములు మున్నగునవి ఏవి కలవో, యత్ = ఎయ్యది. అశాంతం = వాతశ్లేష్మాదికములను కలిగించునో, అమేధ్యం = పెంట, తత్ = అది అంతయు, అపగచ్ఛాత్ = తొలగిపోవును గాక

స్నాన మంత్రములు చెప్పబడుచున్నవి

**అత్యాశనాద తీపానా ద్యచ్చ ఉగ్రాత్ప్రతి గ్రహాత్**
**తన్నో వరుణో రాజాపాణినా హ్యవమర్ శతు. – 59**

అధ్యాశనాత్ = దేవయజ్ఞ, పితృయజ్ఞ, భూతయజ్ఞ, బ్రాహ్మయజ్ఞ, మనుష్యయజ్ఞములతో నాచరింపక చేయునట్టి, భోజనము వల్లనుండియు, అతీపానాత్ = దేవ, పితృ, ఋషి తర్పణముల నాచరింపక చేయునట్టి జలపానమునుండియు, ఉగ్రాత్ = స్వైర జీవితము చేయువారివల్ల నుండి పొందిన ప్రతి గ్రహాత్ = ధనాదులను గ్రహించుట, యచ్చ = ఏ పాపములు కలుగుచున్నవో, తత్ = ఆ పాపమును, రాజా = రాజగు, వరుణః = వరుణుడు, పాణినా = చేతితో, అవ మర్శతు = తీసి వేయుగాక

శాస్త్రసమ్మతము కానీ అన్నముభుజించుట వల్లను = అ శాస్త్రీయ మైన పానము చేయుట వల్లను, దుర్మార్గులనుండి దానము స్వీకరించుట వంటి పాపములను వరుణుడు తన చేతితో తుడిచి వేయుగాక

**సో 2 హమపాపో విరజో నిర్ముక్తో ముక్త కిల్బిషః**
**నాకస్య పృష్ఠ మారుహ్య గచ్ఛే ద్బ్రహ్మ సలోకతామ్ –60**

సః = ఆ, అహం = నేను, అ పాపః = పాపము లేని వాడనై, విరజః = రజోగుణ ములేని వాడనై, నిర్ముక్తః = బంధవిముక్తుడనై, ముక్త కిల్బిషః = విడువబడిన తప్పులు కలవాడనై, నా కస్య = స్వర్గము యొక్క, పృష్ఠం = ఉపరిభాగమును, ఆరుహ్య = అధిష్టించి, బ్రహ్మస లోకతాం = బ్రహ్మసాలోక్యమును, గచ్ఛేత్ = పొందెదను ఇట్లు వరుణుని చేత విడువబడిన పాపముగల వాడనై నేను, పాపమును రజోగుణమును, మనోదోషమును, తప్పును, లేని వాడనై, స్వర్గము యొక్క ఉపరిభాగము అధిష్టించి, బ్రహ్మసాలోక్యమును పొందెదను గాక ఈ రెండు మంత్రములు శిరస్నానము చేయునపుడు చెప్పవలసినవి

సదాచారము గల వాడు = పంచయజ్ఞములను చేసి, గానీ భుజింపరాదు. అట్లు చేయనిచో అది పాపమగును

ఆ పాప పరిహారము కొఱకై వరుణ దేవుని ప్రార్థించవలయును బ్రహ్మలోక ప్రాప్తయె సాధకుని జీవిత లక్ష్యము అందుచేత ఈ మానవ జీవిత మునందే పాప ప్రక్షాళన, పుణ్య ప్రాప్తి పొందవలసి యుంటుంది శాస్త్రములు నిషేధించిన కర్మలను చేయుటయే కాదు అధర్మ కార్యములను చేయుట కూడా బంధ హేతువులే అందువలన వాటిక్షాళనకై వరుణుని ఈ రెండు మంత్రముల ద్వారా ప్రార్థించుచున్నాడు.

యచ్చాప్సు వరుణస్సపునాత్వఘమర్షణః

అప్సు = జలములందు, యః చవరుణః = ఏవరుణుడు కలడో, అఘమర్షణః 61 = పాపవినాశకుడగు, సః = ఆవరుణుడు, పునాతు = (నన్ను) పవిత్రునిగా చేయుగాక,

ఇమంమేగంగే యమునే సరస్వతి ।
శతుద్రిస్తోమగ్ సచతా పరుష్ణియా అసిక్నియా మరుద్వృధే
వితస్తయా ర్జీకీయే శృణు హ్యాసుషోమయా = 62.

గంగే = ఓ గంగానదీ ! యమునే = యమునానదీ ! సరస్వతి = సరస్వతీ నదీ, శతుద్రి = శతుద్రీనదీ! మే = నా యొక్క ఇమం = ఈ, స్తోమం = స్తోత్రమును, శృణుహి = వినండి. మరుద్వృధే = ఓ మరు ద్వృధే అనునదీ ! పరుష్ణియా । పరుష్ణి యను నది తోడ, అసిక్నియా = అసిక్ని అను నదితోడను, ఆర్జీకియే = ఓ ఆర్జీ కీయా, వితస్తయా = వితస్తయా అనునది తోడను, సుషోమయా = సుషోమయా అనునది తోడను, ఆ సచత = (ఈ ప్రదేశమునకు) రండు ఓ గంగా, ఓ యమునా, ఓ సర్స్వతీ! ఓ శతుద్రీ, ఓ మరుద్వృధా, ఓ అర్జికీయా, మీరు పరుష్ని, అసిక్ని, వితస్తా, సుషోమానదులతో కలిసివచ్చి నా ఈ స్తోత్రమును వినండి
విశే = సుషోమా = సోహన్, వితస్తా = జీలం, అసిక్నీ = చీనాబ్, మరుద్వృధా = మరువార్ద్వాన్, పరుష్ని = రభి, శతుద్రి = సట్లైజ్‌గా గుర్తింపబడినది ఇచ్చటనే ఆర్యులు నివసించిరి ఆర్యులు ఆ నదీ తీరముల నుండి దూరముగా వెళ్లినను, ఆ నదీ దేవతలను తాము ఉపయోగించే జలములలో నున్నట్లు భావించుకొని, స్నానము చేయునపుడు ఆ నదీ దేవతలు వారి దేహములను, మనస్సులను పునీతులను చేయవలసినదిగా

ప్రార్థించెడివారు ఇవన్నియును జీవనదులు

జలములందు మునిగిన వానికి ప్రాణాయామార్థము అఘమర్షణ సూక్తము - చెప్పబడుచున్నది

ఋతంచ సత్యం చాభీద్ధాత్త పసోధ్య జాయత తతో
రాత్రి రజాయత, తతస్సముద్రో అర్ణవః 63

సముద్రా దర్ణ వాద ధిసంవత్సరో అజాయత,
అహోరాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతోవశీ. - 64

సూర్యా చంద్రమసౌధాతా యధా పూర్వమ
కల్పయత్ దివంచ పృధివీ చాంతరిక్షమధోసువః - 65

అభీద్ధాత్ = అంతటా ప్రకాశించు పరమాత్మవలన, ఋతం = జ్ఞానోదయము కలుగునంతవరకు సత్యముగా తోచు పృధివ్యాది పంచకము, సత్యంచ = జ్ఞానోదయము కలుగునంత వరకు సత్యనుగా తోచు 14 భువనములు, తపసో2ధి = పర్యాలోచనమైన పిదప, ప్రజాయత = పుట్టెను, తతః = (భూత పంచకము, చతుర్దశభువనములస్సృష్టి) తరువాత, రాత్రిః = రాత్రి, అజాయత = పుట్టెను తతః = ఈ సముద్రాత్ అర్ణవాత్ అధి = సముద్రము, వాపీ కుప తటాకములు పుట్టిన తరువత, అహోరాత్రాణి = అహోరాత్రాదికము, మిదధత్ = చేయుచున్నట్టిదియు, మిషతః = నిమేషము చేయుచున్నట్టియు, (చేయునట్టియు, జగతః = జగత్తు యొక్క, వశీ = స్వాధిష్ఠాన కర్తయగు, సంవత్సరః = సంవత్సరము, అజాయత = పుట్టెను

ధాతా = పరమేశ్వరుడు, సూర్యా చంద్రమసౌ = సూర్యచంద్రులను దివంచ = ద్యులోకమును, పృధివీంచ = భూలోకమును, అంతరిక్షం = అంతరిక్షలోకమును, అధో = అధభాగమందుండు లోకసప్తకమును, సువః = లోకత్రయమునకు కావలసిన భోగ్య జాతమును, యధా పూర్వం = గతించిన కల్పాదికమునందు వలె అకల్పయత్ = పుట్టించెను.

తా = అంతటినీ ప్రకాశింపజేయు పరమాత్మ ఋతమును, సత్యమును కలిగించెను అందుండి దివారాత్రములు కలిగెను ఆ పరమాత్మ నుండి సముద్రము, వాపీకూప తటాకాదులు పుట్టెను విశాల సముద్రము పుట్టిన తరువాత సంవత్సరము పుట్టెను ఆ తరువాత జగన్నిర్మాతయగు పరమాత్మ చరాచరజగత్తును, దివారాత్రములను సూర్యచంద్రులను, భూవ్యాకాశవములను, ఊర్ధ్వఅధోలోకవములను, పూర్వకల్పమునందువలె పుట్టించెను

విశే – అఘర్షణ = పాపములను తుడిచి పెట్టునది ఈ మంత్రములలో సృష్టి క్రమము చెప్పబడుచున్నవి ఇవి ఆత్మశుద్ధికై పఠింపబడుచున్నవి వీనిని స్నాన కాలమందే కాక ధర్మ శాస్త్రవములు నియమించిన ప్రాయశ్చిత్తవము కొఱకు కూడా పఠింపబడుచున్నవి వీటికి భట్ట భాస్కరుల వారు విశిష్టాద్వైత పరముగాను, సాయనులు అద్వైత పరంగానూ వ్యాఖ్యానించి యున్నారు భట్ట భాస్కరులు, ఋతం = అను పదమునకు ( ప్రధానము = సమష్టి సృష్టి అనియు సత్యం అనగా జీవాత్మ అనియు అభిదాత తపసః = తన సంకల్పము వలన, అనియు, రాత్రి = ప్రకృతి సంబంధమగు మహదాదివర్గము సముద్రము = భూత సముదాయము, అర్ణవము = బ్రహ్మాండము, ఆ బ్రహ్మాండము నుండి సంవత్సరాత్మక మైన బ్రహ్మాండాధిపతి యగు ప్రజాపతి పుట్టెను

ఇతర మతముల వలె హిందువులు కూడా విశ్వసృష్టిని అంగీకరించిననూ, ఒక కల్పములో జరుగు సృష్టి, అంతకు పూర్వపు కల్పము యొక్క క్రమము వంటిదే. అన్నియును జీవుల సౌకర్యార్థమే పూర్వము వలెనే, జరుగును – అని కొంత భేదమును హిందువులు తెలుపుదురు

అఘమర్షణ సూక్తమైన తరువాత స్నానార్థమైన మంత్రములు

యత్ పృథివ్యాగ్ం రజస్స్వమాన్త రిక్షే విరోధసీ
ఇమాగ్ం తదాపో వరుణః పునాత్వఘమర్షణః
పునన్తు వసవః, పునాతువరుణః పునాత్వఘమర్షణః , 66

ఏష భూతస్య భవ్యే భువనస్య గోప్తా
ఏషపుణ్య ! కృ(తాం) (తాన్) లోకానేష మృత్యోర్హిరణ్మయమ్
ద్యావాపృథివ్యోర్హిరణ్యగ్ సగ్గ్రితం సువః
సనత్సువస్సగం శిశాధి.,

పృథివ్యాం = భూమియందు, యత్ = ఏ, రజః = పాపము, స్వం = (స్వకీయమైనది) కలదో, అంతరిక్షే = అంతరిక్షలోకమునందు, విరోధసీ ద్యావాపృథ్వ్యలందును (ఏ పాపము మా సంబంధమైనది కలదో) తత్ = ఆ సమస్త మైన పాపమును, ఇమాన్ = ఈ మమ్ములను, ఆపః = జలరూపుడును, అఘమర్షణః = పాపవినాశకుడును అగు, వరుణః = వరుణుడు, పునాతు = పవిత్రుని జేయుగాక వసవః = అష్టవసువులు, పునంతు = (మమ్ములను) పవిత్రులను జేసెదరుగాక, వరుణః = వురుణుడు, పునాతు = పవిత్రుని జేయుగాక, అఘమర్షణః = అఘమర్షణ ఋషి, పునాతు పవిత్రులుగ చేయుగాక

ఏషః = ఈ వరుణుడు, భూతస్య = అతీతమైన, భూతకాలమందైన, భవ్యే = భవిష్యత్కాలమందైన భువనస్య = ప్రాణి సమూహము యొక్క, గోప్తా = రక్షకుడు, ఏషః = ఇతడు, పుణ్యకృతాం = పుణ్యాత్ములకు, లోకాన్ = లోకములను, (ప్రయచ్ఛతి = ఇచ్చును), ఏషః = ఇతడు మృత్యోః = మృత్యు సంబంధమైన, హిర ణ్మయం = లోక విశేషమును (తేజోపకారమైన లోకమును) (పాపులకు కలుగ చేయుచున్నాడు), ద్యావా పృథివ్యోః = ద్యులోక భూలోకములను, సంశ్రితం = సంబంధమైన, హిరణ్మయం = హిరణ్యమయమగుపలోకము కలదో, సువః = అట్టిస్వర్గలోకమును సః = అనీవు, నః = మమ్ముల గూర్చి, సంశిశాధి, లెస్సగ అనుగ్రహింపుము

భూమియందును, అంత రిక్షమునందును, భూనభోంత రాళమునందును, ఆత్మసంబంధములగు పాపములను, ఉదకములను, ఆ ఉదకాధిష్ఠానదేవతయును, సమస్త పాపములను తుడిచి పెట్టగల వాడును అగు వరుణుడు పవిత్రము చేయుగాక, వసువులు మమ్ము పవిత్రులు జేయుగాక ! వరుణుడు మమ్ము పవిత్రుల జేయుగాక అఘమర్షణ ఋషి మమ్ములను పవిత్రులగావింతురుగాక

ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహమస్మి !
జ్యోతిర్జ్వలతి బ్రహ్మాఽహమస్మి ! యో ౨ హమస్మి 4

బ్రహ్మాహమస్మి ! అహమస్మి బ్రహ్మాహమస్మి !
అహమేవాహం మాంజుహోమిస్వాహా 5

అర్ద్రం = ఎయ్యది ఉదక రూపమై తడిదిగా యున్నదో అట్టి యార్ద్రము, జ్వలతి = ప్రకాశించుచున్నది అహం = నేను, జ్యోతిః = చైతన్య రూపమైన జ్యోతిని, అస్మి = అగుచున్నాను, జ్యోతిః = జ్యోతిస్సు, జ్వలతి = ప్రకాశించుచున్నది, బ్రహ్మ = బ్రహ్మము, అహం = నేను, అస్మి = అయితిని, యః = ఏ జీవరూపుడను, అహం = నేను, అస్మి = అయితినో (అట్టి) అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మమే, అస్మి = అయితిని (4) అహం, నేను, అస్మి = అహంకారమునకు సాక్షీ భూతమైన వాడనగుచున్నాను, అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మము, అస్మి = అగుచున్నాను, (5) అహం = నేను, అహమేవ = పూర్వసిద్ధమైన నేనే, మాం = జలస్వరూపుడగు నన్ను, జుహోమి = (ఉదకాగ్నియందు) ఉంచుచున్నాడను, స్వాహా = స్వాహా కారమగు గాక

ఏ పరంజ్యోతి, నీటిలో తడిసి మొలకెత్తిన విత్తనమువలె జగత్తుగా భాసించుచున్నదో (లేక) జలతత్త్వమునకు ఆధారమైన పరంజ్యోతి ఏది కలదో – నేనే ఆ పరం జ్యోతినీ, విశ్వమందంతయు చైతన్యముగా యుండు పరబ్రహ్మయొక్క జ్యోతిని నేనే అజ్ఞానముచే నేను భావస్వరూపుడుగా భీవించిననూ, నేను ఆ అఖండ బ్రహ్మమునే, జ్ఞానోదయమైనందున ఇప్పుడు నానిజస్వభావము ఆ పరబ్రహ్మమేనని తెలిసికొంటిని నా యొక్క జీవభావమును (వ్యష్టి తత్త్వమును, ఆ పరబ్రహ్మము యొక్క జ్యోతిలోనే, నేను ఆహుతియై అర్పించు కొనుచున్నాను (విశే) ఆచమనము చేయునప్పుడు చెప్పవలసిన మంత్రములు ఇవి. నోటిలో మాత్రము నాల్గుచుక్కలు నీటి బొట్లను వేసుకోవలయును ఈ నీటిచుక్కలు మన దేహేంద్రియాదులకు అధిష్ఠాన దేవతల కర్పించు స్వాహా లు (ఆహుతులు)

**భట్ట భాస్కరుల వ్యాఖ్య.**

ప్రకాశవమాన రూపమంగు జలతత్త్వస్వరూపుడను తేజోరూపమంగు

పరబ్రహ్మరూపుడనయిన నేను ఎట్టి రూపముగల వాడనో అటువంటి స్వరూపముగల వాడనయి, శేషభూతమైన నా స్వస్వ రూపమును ఆత్మాపహార శాంతి కొరకు అర్పించుచున్నాను

విశే ఇందు చెప్పబడిన బ్రహ్మతత్త్వము చాందోగ్యోపనిషత్తులో చెప్పుబడినట్లు (1) ద్యులోక (2) పర్జన్య (3) పృథివీ (4) పురుష(5) యోషిత్తులను పంచాగ్నులుగా ధ్యానించుమని చెప్పినట్లు ఆ ఐదింటి యందు అగ్నితత్త్వము గౌణము లెటులయినదో నా యందు కలిగిన బ్రహ్మతత్త్వము గౌణము కాదని భావము

అ కార్య కార్యవ కీర్తి, స్తేనో, భ్రూణహా గురుతల్పగః
వరుణో 2 పామఘమర్షణస్తస్మాత్పాపా త్ప్రముచ్యతే – 68

ఆ చమనానంతరము మరల స్నాన మంత్రము చెప్పబడుచున్నది అహం = ఉదకము యొక్క (ప్రభువున్నూ) అఘమర్షణః = పాపనాశకుడును అగు, వరుణః = వరుణుడు, అకార్యకారీ = అకృత్యములు చేయువాడును, అవకీర్ణీ = నిషిద్ధ స్త్రీ గమనము చేత క్షతవ్రతుడును స్తేనః = దొంగయును, భ్రూణహా = భ్రూణహత్య చేసిన వాడును, గురుతల్పగః = గురుతల్పమును పొందిన వాడును (ఇట్టిపాపములు చేసిన నన్ను కూడ) అస్మాత్ = ఆ, పాపాత్ = పాపముల నుండి, ప్రముచ్యతే = వదిలించుగాక జలాధిష్ఠాన దేవతయగు వరుణుడుసమస్త పాపములను ఛేదించు వాడు గనుక, ఆ జలములయందు స్నానము చేయుటచేతనే, అ కార్యమును చేయువాడును, దొంగతనముచేయువాడును, వ్రత భ్రష్టుడును, గర్భభేదనము చేయువాడును, గురుభార్యను పొందిన వాడును అగు మహా పాపాత్ముడు పాపము వల్ల విడువబడి, పరిశుద్ధుడగుచున్నాడు

విశే = సాధకునిలో క్రమముగా పాపముల యెడవిముఖత ఏర్పడుతుంది ఈ సంఘములో నేరములు పాపములు చేయుట సర్వసాధారణము తాను పూర్వజన్మలలో వీటిని చేసి యుండవచ్చునేమో అనే భయము కూడా కద్దు అవి ఈ జీవితములో కూడా జరిగివుండవచ్చును పరమాత్మ పవిత్రులలో కెల్ల పవిత్రుడు కాబట్టి, తనపాపములను ఆయన పరిహరించ గలడు అనే భావన కలుగుతుంది స్నానము చేయుట వలన ఆ పాప ప్రక్షాళన కూడ జరుగుతుంది మన శాస్త్రము

లెన్నడూ పాపముల చేయుటకు అనుమతించలేదు

రజోభూమిస్త్వమాగ్ం రోదయస్వ ప్రవదంతి ధీరాః 69

(అహం = నేను) రజో భూమిః = పాపమునకు స్థాన భూతుడను (అయినను) త్వం = నీవు, మాం = నన్ను, (న) రోదయస్వ = ఏడ్పింపకుము ధీరాః = శాస్త్రజ్ఞులు, ప్రవదన్తి = పలుకుచున్నారు

విశే = (రహస్యకృత పాపక్ష యార్థము పై మంత్రము) ఇందు న కారము అధ్యారోపము కొన్ని పాఠములలో - పునంతు ఋషయః, పునన్తు వసవః పునాతువరుణః, పునాత్వఘమర్షణః (భట్టభాస్కరులు, సాయనుల వారుపై పాదమును ఇందు చేర్చినారు)

(పై మంత్రమునకు ఇంకొక విధమైన అర్థము)

ధీరాః = పండితులు (ఇయం = ఈ), రజోభూమిస్తు = కర్మ భూమి, అమాం = నా కంటె అన్యుడగు జనుని, (అఘమర్షణ స్నానము చేయుచున్న నా కంటె అన్యుని), రోదయస్వ = దుఃఖ పెట్టును గాకయని, ఋషయః = ఋషులు, (మాం = నన్ను) పునన్తు పవిత్రము చేయుదురు గాక వసవః = వసువులు (మాం = నన్ను), పునన్తు = పవిత్రుడుగా చేయుదురు గాక, వరుణః = వరుణుడు, (మాం = నన్ను) పునాతు = పవిత్రము చేయుగక, అఘమర్షణః = అఘమర్షణ స్నానము (పాపముల పోగొట్టెడి స్నానము) పునాతు = పవిత్రము చేయుగాక (అని) ప్రవదన్తి = చెప్పుచున్నారు.

తా = పండితులు ఈ కర్మభూమి అఘమర్షణ స్నానము చేయు నాకంటె నితరమైన వానిని దుఃఖపెట్టును గాక ఋషులు, వసువులును, వరుణుడును వీరందరూ నన్ను పవిత్రుని చేయుదురుగాక అఘమర్షణ స్నానమునన్ను పవిత్రుని చేయుగాక యని పలుకు చున్నారు

ఆ క్రాన్సము ద్రః ప్రథమే విధర్మ న్జనయన్ప్రజా భువన స్యరాజా వృషాపవిత్రే అధిపానో అవ్యే బృహత్సోమోవా వృధేసువాన ఇందుః – 70.

సముద్రః = పరమాత్మ, విధర్మన్ = వివిధధర్మోద్భోధకాల మగు, ప్రథమః = సృష్ట్యాది

కాలమందు, ప్రజాః = ప్రజలను జనయన్ = సృజించుచు, ఆక్రాన్ = అంతటా వ్యాపించెను (సః = ఆ పరమాత్మ) భువనస్య = ప్రపంచమునకు, రాజా = రాజా, వృషా = భక్తులకు వరములను వర్షించువాడు, పవిత్రే = పవిత్రమైనట్టియు, అధి = శ్రేష్ఠమైనట్టిదియు, అవ్యే = పాలన హేతువగు, సానో = హృదయపుండరీకమునందు, సోమః = పార్వతీ సమేతుడై, బృహత్ = గొప్పగా, వావృధే = వృద్ధిని పొందెను (సః = ఆ పరమేశ్వరుడు), సువానః = సర్వ ప్రేరకుడు ఇందుః = సర్వాహ్లాదకరుడు

ఇది స్నానానంతరము చెప్పవలసిన మంత్రము –

సముద్రముగా చెప్పబడు పరమాత్మ సృష్టినంతటిని ఆక్రమించెను వారివారి పూర్వకర్మలననుసరించి ప్రాణులను సృజించెను ఆయనే ఈ జగత్తుకు రాజు భక్త వరదుడు ఆయన ఉమతో కూడి భక్తుల హృదయములందు వసించుచుండును అందరికన్న గొప్పవాడు, రక్షకుడు జీవులహృదయమందు నివసించుటచే ఆ జీవుడుకూడా శివుడే యగుచున్నాడు. జీవులను వారి కర్మానుసారము నడిపించుచు, వారి వారి కర్మఫలముల నొసగుచు, వారికి ఆనంద దాయకుడగు చున్నాడు

(పురస్తాద్యశో గుహాసుమమ చక్రతుండాయ ధీమహి
తీక్ష దంష్ట్రాయ ధీమహి ! పరిప్రితి ష్ఠితం, ద్వేభ్యుర్యచ్ఛతం !
దధాతనాద్ప్యో అర్ణవ స్సువో రాజైకంచ (1) (మం)
రుద్రో రుద్రశ్చ ! దంతిశ్చ ! నంది, షణ్ముఖ ఏవచ!
గరుడో, బ్రహ్మ విష్ణుపు ! నారసిగ్ం హస్త దైవచ ! ఆదిత్యో
2 గ్నిశ్చ ! దుర్గిశ్చ. క్రమేణ ద్వాదశావ్యుపి ! మమువచ
మసుపైనాభాపై కాత్యాయనాయ.

ప్రథమాను వాకము సమాప్తము –

(పురస్తాత్ యశో గుహాసు మున్నగునవి ఈయను వాకమందున్న పదేసి వాక్యములుగా విభజింపబడిన ఖండికల యొక్క చివరి పదములు కొన్ని చోట్ల ఒక్కొక్క పదము కొన్ని చోట్ల వాక్యములు కూడా యుండును)

ద్వితీయో 2 ను వాకః

జాత వేదసే సున వామ సోమ । మరాతీయతో నిదహాతి వేదః సనః
షర్షదతి దుర్గాణి విశ్వానావేవ సిన్ధుం దురితాఽ త్యగ్నిః – 1

జాతవేదసే = జాతవేదుడగు అగ్నికొఱకు, సోమం = (యాగ కాలమందు) సోమలత
ను, సునవామ = అభిషుతము నొనర్చుచున్నాము, వేదః = అగ్ని, (పరమాత్మ),
ఆరాతీ యతః = మాయందు శత్రుత్వమును చేయదలచిన పురుషులను, నిదహాతి
= కాల్చివేయుగాక, సః = ఆ అగ్ని (పరమాత్మ) నః = మా యొక్క, విశ్వాదుర్గాణి
= ఆపదలనన్నింటిని, అతి పర్షత్ = నాశమొనర్చును (నావికుడు) నావా = నావ
చేత సింధుం ఇవ = సముద్రమును వలె, అగ్ని = అగ్నిహోత్రుడు, దురితా = మా
పాపములను, అతి = మిక్కిలి (నశింపజేయుగాక). మేము జాతవేదుడగు అగ్ని
కొఱకు సోమమును ఇచ్చెదము గాక సర్వజ్ఞుడగు ఆ పరమాత్మ మా శత్రువులను
కాల్చివేయుగాక ఆ అగ్ని మమ్ములను మాకష్టములనుండి, మా పాపముల నుండి,
నావికుడు సముద్రమును దాటించున్నట్లు, మమ్ములను రక్షించి కాపాడుగాక

విశే – అనిష్ట పరిహారార్థము జపించవలసిన మంత్రము.

తామగ్నివర్ణాం తపసాజ్వలన్తీం । వైరోచనీంకర్మఫలేషుజుష్టామ్ దుర్గాందే
వీగ్ం శరణమహం ప్రపద్యే । సుతరసి తరసేనమః – 2

– అగ్నివర్ణాం = అగ్నితో సమానమైన వర్ణము కలిగినట్టియు, తపసా = స్వకీయమైన
కాంతి చేత, జ్వలన్తీం = మా శత్రువులను నాశము చేయునట్టిదియు, వైరోచనీం =
పరమాత్మ సంబంధమైనట్టియు, కర్మఫలేషు = కర్మఫలముల నిమిత్తమై, జుష్టాం =
సేవింపబడునట్టియు, తాం = అవన దుర్గాకల్పాది మంత్ర శాస్త్రములందు ప్రసిద్ధిగల,
దుర్గాందేవీం = దుర్గాదేవిని, అహం = నేను, శరణం = శరణమును, ప్రపద్యే =
పొందుచున్నాను, సుతరసి = సంసారతరణమునకు చక్కని హేతువైనట్టి దేవీ। తరసే
= తరింపజేయునట్టి నీ కొఱకు, నమః = నమస్కారము

(వైరోచనీ = విశేషేణ రోచయతే, స్వయమేవ ప్రకాశత ఇతి విరోచనః = పరమాత్మ)

అగ్నితో సమానమైన వర్ణము కలదియు, స్వకీయమైన కాంతి చేత ప్రకాశించునదియు, పరమాత్మ సంబంధమైన పరాశక్తిగా వెలుగొందుచున్నదియు, కర్మఫలప్రదాతయు, అగు ఓ దుర్గాదేవీ నిన్ను నేను శరణుజొచ్చుచున్నాను సంసార తరణమునకు నీవు నిపుణురాలవు కష్టముల తొలగించు నీకు నమస్కారములు

విశే పురాణములందు దుర్గ యొక్క మహిమలను, శక్తి సామర్థ్యములను విశేషముగా చెప్పబడియున్నవి దుర్గాదేవి మానవుని కష్టముల నుండి కాపాడి ఇహపరసౌఖ్యములను మోక్షమొసంగుననుట ప్రసిద్ధము. దుర్గాసూక్తము చాలా ప్రసిద్ధమైనది

**అగ్నేత్వం పారయానవ్యోఅస్మాన్త్స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా**
**పూశ్చపృథ్వీబహులాన ఉర్వీభవాతోకాయ తనయాయ శంయోః (3)**

అగ్నే = ఓ అగ్నీ ! నవ్యః = కొనియాడదగిన, త్వం = నీవు, అస్మాన్ = మమ్ములను, స్వస్తిభిః = క్షేమం కరములగు ఉపాయములచేత, విశ్వా = సమగ్రములైన, దుర్గాణి = ఆపదలను, అతి = మిక్కిలి, పారయ = దాటింపుము, నః = మా యొక్క, పూః = నివాస భూతమగు పట్టణము, పృథ్వీ = విశాలమైనది యగుగాక, ఉర్వీ = భూమియు, బహులా = అధికమైనదియగుగాక (త్వం = నీవు) తోకాయ = పుత్రుల కొఱకును, తనయాయ = వారి పుత్రుల కొఱకును, శంయోః = సుఖములు కలుగజేయువాడవు (భవ = కమ్ము)

ఓ అగ్నీ ! నీవు అందరిచే కీర్తింవదగిన వాడవు. నీవు మమ్ము శుభాదులచే కష్టములను దాటింపుము మా పట్టణమును, విస్తారమగు భూమిని సమృద్ధ వంతముగా చేయుము సంతానరూపమైన పుత్రపుత్రాదులను కాపాడుము. (సాయనుడు – తనయ = కుమార్తె అని అర్థము చెప్పియున్నాడు

**విశ్వాని నో దుర్గహాజాతవేద ! స్సింధుం న నావా దురితా అతి పర్షి,**
**అగ్నే అత్రి వన్మనసాగృణానోస్మాకం ( భూత్వా) భోద్యవితా తనూనామ్ 4**

దుర్గహా = ఆపదలనన్నింటిని తొలగించునట్టియు, జాతవేదః = జాత వేదువడవగు

ఓ అగ్నీ !, నావా = ఓడ చేత, సింధుంన = సముద్రమును వలె, నః = మా యొక్క, విశ్వాదురితా = పాపములనన్నింటినీ, అతి పర్షి = తరింపజేయుము అగ్నే = ఓ అగ్నీ!, అత్రివత్ = అత్రిమహర్షివలె, (నీవును), మనసా = మనస్సుచేతను, గృణానః = పలుకుచున్నవాడవై, అస్మాకం = మా యొక్క, తనూనాం = శరీరములకు, అవితా = రక్షకుడవై, బోధి = తెలుసుకొనుము (సావధానుడవు కమ్ము) ఆపదలనన్నింటినీ తొలగించు ఓ అగ్నీ ! నావికుడు తన పడవతో సముద్రమును దాటించునట్లు, మా పాపములనన్నింటినీ దాటించుము ఓ అగ్నీ ! అత్రిమహర్షివలె ( అత్రి మహర్షి నిరంతరము సర్వేచ సుఖినస్సంతు సర్వేసంతు నిరామయాయ అనిలోకక్షేమమునే కోరుకుంటుంటాడు) మా దేహములను రక్షించుచూ, మాయందు నీ మనస్సుంచుము

అత్రి = ఆధ్యాత్మికాది తాపత్రయాలు లేనివాడు.

న త్రిః = అత్రింః - ఆయనవలె మమ్ము సంరక్షింపుము

పృతనాజితగ్ంసహమానముగ్రమగ్నిగ్ం హువేమ పరమాత్సధస్థాత్ ।
సనః పర్షదతి దుర్గాణి, విశ్వాక్షా మద్దేవోతి దురితాత్యగ్నిః 5

పృతనాజితం = శత్రుసేనలను జయించునట్టిదియును ( కాబట్టియే), సహమానం = శత్రువులను తిరస్కరించుచున్నట్టియు, ఉగ్రం = భయకారణమైనదియు, అగ్నిం = అగ్నిని, పరమాత్ = శ్రేష్ఠమైన, సధస్థాత్ = భృత్యుల తోడ నివసించియున్నతావునుండి, హువేమ = పిలుచుచున్నారము, సః = ఆఅగ్ని, నః = మా యొక్క విశ్వాదుర్గాణి = ఆపదలనన్నింటినీ, అతి పర్షత్ మిక్కిలి) నశింపజేయుగాక, దేవః = దేవుడగు, అగ్నిః = అగ్నిక్షామత్ = మాఅపరాధములను క్షమించుచు, అతి దురితా = మిక్కుటమగు మా పాపములను, అతి = అతిక్రమింపచేయుగాక!

శత్రు సైన్యములను జయించి, ఆశ్రితా పరాధములను సహించి, శత్రు భయంకరుడగు, అగ్నిని, తన పరివారముతో సహాకూర్చుండునట్టి స్థానము నుండి పిలుచుచున్నాము. అటువంటి స్వప్రకాశుడును, ఆశ్రితాపరధములను క్షమించువాడునగు అగ్ని దాటనలవిగాని సమస్త పాపములనతి క్రమించి, మమ్ములను రక్షించువాడగునుగాక!

ప్రత్నోషిక మీడ్యో అధ్వరేషు । సనాచ్చ హోతానవ్యశ్చ సత్సి ।
స్వాం చాగ్నే తను వంపి ప్రియస్వాస్వభ్యంచ సౌభగమాయజస్వ - (6).

అగ్నే = ఓ అగ్నీ, అధ్వరేషు = యాగములందు కొనియాడ దగిన వాడవై, కం = సుఖమును, ప్రత్నోషి = విస్తరింప జేయుచున్నాడవు, సనాత్ చ = కర్మఫలములనిచ్చువాడవయ్యున్న హోతా = హోమనిష్పాదకవుడును, నవ్యః = స్తుతికి అర్హుడవై, సత్సి = యాగ ప్రదేశమునందుందువు (అందువలన ఓ అగ్నీ!), స్వాం = స్వకీయమగు, తనువం = దేహమును, పి(ప్రియస్వ = నేనొసంగు హవిస్సు చేత నిండించుకొనుము, అస్మభ్యం = మా కొఱకు, సౌభగం = ఐశ్వర్యాదికమును, అయజస్వ = అంతట నొసంగుము

ఓ అగ్నిహోత్రుడా! నీవు యజ్ఞములయందు స్తుతింపబడిన వాడవై, ఆశ్రితుల సుఖమును విస్తరింపజేయుచున్నావు ప్రాచీనుడవును, దాతవునై, వయోవంతుడవు వలెనే ఉంటున్నావు మా చేత ఇవ్వబడిన హవిస్సుచేత స్వంత దేహమును సంతోషపెట్టుము మా కొఱకును శుభమును ఇమ్ము

విశే = భట్టభాస్కరులు, సనాత్ = పురాతనం = నవ్య = అధునాతన హోతలు అనగా దేవతలు మనుష్యులని వ్యాఖ్యానించారు. స్వంతనువాం = దేవుని శరీరమైన విశ్వం = (అంతేగాక) వ్యష్టిగా జీవుల దేహములు కూడా భగవన్నివాసములు

**గోభిర్జుష్టమయుజో నిషిక్తం, తవేంద్ర విష్ణోరనుసంచరేమ నాకస్య పృష్ఠమభిసంవసానో వైష్ణవీంలోక ఇహమాదయన్తాం. (7)**

ఇంద్ర = ఓ ఇంద్రుడా ! (వయాం = మేము) గోభిః = గోవుల చేత సేవింపబడినట్టియు, నిషిక్తం = (అమృత ధారల చేత) తడుపబడిన (మహా భాగ్యమును ద్వేశించి, అయుజః = పాపముల చేత దుఃఖముల చేత కూడు కొనబడనట్టియు, విష్ణోః = సర్వవ్యాపకుడవగు, తవ = నిన్ను, అను సంచరేమ = భృత్యువుల వలె అనుసరించెదము నాకస్య = స్వర్గము యొక్క, పృష్ఠ అభి = ఊర్ధ్వభాగమునందు, సంవసానః = నివసించుచున్న దేవతలందరు, వైష్ణవీం = విష్ణు భక్తిగలనన్ను, ఇహలోకే = భూలోకమునందు, మాదయన్తాం = అభీప్సితముల

నొసంగి సంతోషింపజేయుదురుగాక

ఓ దేవా = నీ కుపుణ్యా పాపములంటవు నీవు సర్వవ్యాపివి నీవు అమృతధారలచే తడుపబడిన భాగ్యమును ద్దేశించు గోవులచే సేవింపబడుచున్నావు నిన్ను నిరంతరము సేవించెదము స్వర్గము యొక్క పైభాగమున నున్న దేవతలందరు ఇహలోకముందున్న నా అభీష్టముల తీర్చెదరు గాక।

నేను విష్ణుభక్తుడను.

3 తృతీయో 2 ను వాకః

అన్న కామస్య హోమ మంత్రాః భూరన్నమగ్నయే పృథివ్యై స్వాహా
భువో 2 న్నం వాయవే అంతరిక్షాయస్వాహాను వరన్న
మాదిత్యాయ దివేస్వాహా భూర్భువ స్సువరన్నం చంద్రమసేదిగ్భ్యస్స్వాహా
నమోదేవే భ్యస్స్వధాపితృ భ్యో భూర్భువస్సువరన్న మోమ్

భూః = భూః అనుమంత్రము చేత ప్రతిపాదింపబడునట్టి, అగ్నయే = అగ్ని కొఱకును, పృథివ్యై = ఆ భూః అను మంత్రముచే ప్రతిపాదింపబడునట్టి, భూదేవి కొఱకును.

అన్నం = ఈ అన్నము, స్వాహా = హుతమగు గాక। భువః మంత్రముచేత ప్రతి పాదింపబడుచున్న వాయు అంతరిక్ష దేవతల కొఱకును, సువః అను మంత్రము చేత ప్రతి పాదింపబడు ఆదిత్యద్యులోక దేవతల కొఱకును, భూర్భువస్సువః అను మంత్రము చేత ప్రతి పాదింపబడు చంద్ర దిగ్దేవతల కొఱకును, నేను హుత మొనర్చుచున్న ఈ అన్నము సుహుతమగు గాక। దేవతల కొఱకును, పితరుల కొఱకును నమస్కారము ఓ భూర్భువస్సువః దేవతలారా! ఇట్లు ప్రార్థించుచున్న, మా ప్రార్థన నంగీకరించి, అన్నాదికమును అట్లే మీ కొసంగెదమని – అంగీకరింపుడు (ఇంకొక విధమైన వ్యాఖ్య) –.
భూః = భూ దేవత, (నాకు) అన్నం = అన్నమును (ఇచ్చుగాక) (తన్నిమిత్తము నా చేత), అన్నం = (ఇవ్వబడిన చరు రూపమగు అన్నము), అగ్నయే = పృథివినధిష్టించి యుండు అగ్నికొఱకును, పృథివ్యై = అగ్న్యధిపాత్రియగు పృథివి

కొఱకును, స్వాహా = హుతమగు గాక, (ఇట్లే తక్కిన వాటిని గ్రహింపవలయును)

4 చతుర్థో 2 వ వాకః

1 భూరగ్నయే పృథివ్యైస్వాహా
2 భువోవాయవే అంతరిక్షాయస్వాహా
3 సువరాదిత్యాయ దివేస్వాహా
4. భూర్భువస్సువశ్చంద్రమసే దిగ్భ్యస్స్వాహా
5 నమో దేవేభ్యస్స్వధా పితృభ్యో భూర్భువస్సువరగ్న ఓమ్

(ఇవి మహా వ్యాహృతమంత్రములు).

1 భూః = భూః అనుమంత్రము చేత ప్రతిపాదింపబడునట్టి అగ్నయే = అగ్నికొఱకును (ఆ భూః అనుమంత్రముచే ప్రతిపాదింపబడునట్టి) పృథివీ = ప్రథివీ దేవత కొఱకును, (హుతమొనర్పబడిన ఆజ్యాహుతి) స్వాహా = హుతమగును గాక
( ఇట్లే మిగిలినవి) – దేవేభ్యః = దేవతల కొఱకు, నమః = నమస్కారము, పితృభ్యః = పితృదేవతల కొఱకును, స్వధా = స్వధాకారము, భూః భువః సువః = భూర్భువస్సువః మంత్రములు ప్రతిపాదించునట్టి ఓ అగ్నీ, ఓమ్ = నా ఈ ప్రార్థనను అంగీకరించుము

విశే – భూః, భువః, సువః ఈ మూడు వ్యాహృతులు భూలోకము, అంతరిక్షము, స్వర్లోకములను సూచించును ఛాందోగ్యోపనిషత్ ప్రకారము - ప్రజాపతితనతపస్సుచే ఋగ్, యజుస్సామవేదములను అగ్ని, వాయువు, సూర్యులనుండి గ్రహించెను ఆ మూడు వేదములనుండి అదే క్రమములో మూడు వ్యాహృతులను భూః, భువః, సువః లను పొందెను అందుచేత ఈ మూడు వ్యాహృతులు, మూడు లోకములను, మూడు వేదములకు ప్రతీకలు – అవి పరమాత్మను సూచించును స్వాహా = అనునది యజ్ఞమునందు అర్పించుకొనుటను సూచించును నమః అనునపుడు మనో, వాక్కాయములతో ఆత్మార్పణ చేయుట సూచించును నమః అనునదియు ఆత్మార్పణను సూచించును నమః అనుట

వలన ఆరాధించుట సూచితమగును స్వధాఅనునది పితృదేవతలకు తర్పణము యిచ్చునపుడు చెప్పబడును
భట్ట భాస్కరులు – ఓమ్ అనగా జీవుడు పరమాత్మతో తాదాత్మ్యము పొందుట అని వ్యాఖ్యానించెను అయమాత్మాబ్రహ్మెగృహసూత్రములు ఈ మంత్రములను యజ్ఞములలో ఎప్పుడెప్పుడు చెప్పవలయునో వివరించయున్నవి

5. పంచవెూ 2 ను వాకః

భూరగ్నయేచ పృథివ్యైచ మహతే చస్వాహా
భువో వాయవేచాన్తరిక్షాయచ మహతేచస్వాహా
సువరాదిత్యాయచ దివేచ మహతేచస్వాహా
భూర్భువశ్చ్రన్ద్రమసేచ నక్షత్రభ్యేశ్చదిగ్భ్యశ్చమహతేచస్వాహా
నమోదేవేభ్య స్వధా పితృభ్యోభూర్భువ స్సువర్మహరోమ్.

మహతే = హిరణ్యగర్భుని కొఱకు, చ = ఆ దేవతల సేవకుల కొఱకు, స్వాహా = హుతమగుగాక
విశే = ఈ మంత్రము కీర్తిని సంపాదింపదలచిన వారు హోమముచేయునప్పుడు చెప్పవలసినది. మహత్‌ను ఉద్దేశించి చేయబడుహోమము ఆరాధించు వారు ఆరాధించిన దైవము యొక్క లక్షణమును పొందునని మనమతము చెప్పుచున్నది దుర్గాసప్తశతిలో త్వామాశ్రితా హ్యాస్రయతాం ప్రయాంతి – నిన్ను ఆశ్రయించిన వారు ఇతరులకు అశ్రిత భూతులగు చున్నారు

6. షష్ఠోను వాకము.

పాహినో అగ్నఏనసేస్వాహా । పాహినో విశ్వవేదసేస్వాహా ।
యజ్ఞం పాహి విభావసోస్వాహా । సర్వంపాహి శతక్రతోస్వాహా

ఇవి జ్ఞానప్రాప్తి కొఱకు చెప్పబడుమంత్రములు అగ్నే = ఓ అగ్నీ, నః = మమ్ములను, ఏనసే = పాపములనుండి, పాహి = రక్షింపుము, స్వాహా = సుహుతమగు గాక। విశ్వవేదసే = తత్త్వజ్ఞానమంతయు సిద్ధించుట కొఱకు, విభావసో = విశేష కాంతిగల

ఓ అగ్నీ శతక్రతో = నూరు క్రతువులకు నిష్పాదకుడవగు ఓ అగ్నీ, సర్వం = (జ్ఞానమునకు సాధన భూతమగు గురువు, శాస్త్రము మున్నగు వానిని) సకలమును, పాహి = రక్షింపు మమ్ములను ఓ అగ్నీ, పాపములనుండి కాపాడుము మాకు జ్ఞానము కలుగునట్లు మమ్ములను కాపాడుము ఓ కాంతి మంతుడగు ఓ అగ్ని మా యజ్ఞ కార్యముల రక్షింపుము ఓ ! శతక్రతూ ! సమస్తమును రక్షింపుము

7. సప్తమో 2 ను వాకః

పాహినో అగ్న ఏకయా ! పాహ్యుత ద్వితీయం ।
పాహ్యూర్జం తృతీయయా ! పాహి గీర్భిశ్చత సృభిర్వసోస్వాహా ।
వసో = జగన్నివాసమునకు హేతు భూతుడవగు, అగ్నే = ఓ అగ్నీ (నీవు), ఏకయా = ఋగ్వేద సంబంధమగు వాక్కు చేత కొని యాడబడిన వాడవై, నః = మమ్ములను, (పాపములనుండి) పాహి = కాపాడుము, ఉత = మఱియును, ద్వితీయయా = రెండవదియగు (యజుర్వేద సంబంధమగు), గిరా = వాక్కు చేత కొనియాడబడిన వాడవై, పాహి = పాపములనుండి రక్షింపుము, తృతీయయా = మూడవదియగు (సామ వేద సంబంధమగు వాక్కు చేత కొని యాడబడిన వాడవై) పాహి = రక్షింపుము, ఊర్జం = అన్నమును, చత సృభిః = నాలుగు వేదముల రూపమగు, గీర్భిః = వాక్కుల చేత కొని యాడబడిన వాడవై, పాహి = రక్షింపుము, స్వాహా = సుహుతమగు గాక !.

సర్వప్రాణులకు ఆధార భూతుడవగు ఓ అగ్నీ, ఋగ్వేద మంత్రములచే కీర్తింపబడి మాకు రక్షణనిమ్ము, ద్వితీయ వేదమైన యజుర్వేద మంత్రములచే కొనియాడబడి మమ్ములను రక్షింపుము. మూడవదియగు సామవేదము చేత మా అన్నమును దాని సారమును రక్షింపుము నాల్గు వేదముల చేత కీర్తింవబడి మమ్ములను కాపాడుము స్వాహా -
(ఇది కొన్ని పాఠములలో లేదు)

8 అష్టమో అను వాకః

యశ్ఛంద సామృషభో విశ్వరూపశ్ఛం దోభ్యశ్ఛందాం స్యా వివేశ ! సతాంశిక్యః ! ప్రావాచోపనిషదింద్రో జ్యేష్ఠ ఇంద్రియాయ ఋషిభ్యోనమో దేవేభ్యస్స్వధా పితృభ్యోభూర్భువస్సువ రోమ్.

విశ్వరూపః = సర్వజగదాత్మకనుగు, యః = ఏ ప్రణవము, ఛందసాం = వేదములకు, ఋషభః = శ్రేష్ఠ మైయున్నదో, (సః = అ ప్రణవము), ఛందోభ్యః = వేదములనుండి (అవిర్భవించెను), ఛందాంసి = గాయత్రిమున్నగు ఛందస్సులు (గల మంత్రములందు), ఆవివేశ = ప్రవేశించెను సతాం = సత్పురుషులకు, శిక్యః = (కర్మానుష్ఠాతల చేతను) ఉపాసకుల చేతను, జ్ఞానుల చేతను) పొందుటకు శక్యమైన వాడును, జ్యేష్టః = అందరికంటె పెద్దవాడును, ఇంద్రః = ఇంద్రుడు, ఋషీణాం = ఋషులకు (జ్ఞాన సామరధ్యము కలుగుట కొఱకు), ఉపనిషత్ = ఈ వేదాంత సిద్ధాంతమును, పురా = పూర్వమున, ఉవాచ = ఉపదేశించెను) తత్ప్రతిబంధనివారణార్థము), దేవేభ్యః = దేవతల కొఱకు, నమః = నమస్కారము, పితృభ్యః = పితరుల కొఱకు,స్వధా = నమస్కారము, భూః భువః సువః = భూర్భువ సువర్లోవకములందున్న, ఛంద = మంత్ర బ్రాహ్మణాత్మ కమగు వేదమును, ఓం = పొందుచున్నాడను.

సర్వజగదాత్మకమగు ప్రణవము వేదములకంటే ముందే యున్న అది మూడు వేదములాయెను వేదమంత్రములందు ప్రవేశించెను. శిక్యః = ఉట్టి, చిక్కము వలె, సత్పురుషులకు పొందుటకు శక్యమైన వాడును, అందరికంటె పెద్ద వాడును, అగు ఇంద్రుడు ఋషులకు ఈ వేదాంత సిద్ధాంతమును ఉపదేశించెను ప్రతి బంధక నివారణార్థము, దేవతలకు నమస్కారము = పితురులకు స్వధా, భూః భువః సువః లోకములు, సర్వవేదములు ఓంకారము నందే యున్నవి అన్నియు ఓంకారమే దానిని పొందుచున్నారు. విశే – జ్ఞాన సముపార్జనకై ఈ మంత్రము నిర్దేశింపబడినది. కఠ, ప్రశ్న, ఛాందోగ్య, మాండూక్యోపనిషత్తులు ఓం అనునదే సర్వవేదముల సారమనియు, ఓం కారమే బ్రహ్మమనియు దానినే ఉపాసించ వలయుననియు చెప్పుచున్నవి ఇచటే ఇంద్రుట ఉపనిషత్ అనియు, ఇంద్రుడే ప్రణవమనియు గ్రహింపవ చ్చును

9 = నవమో 2 ను వాకః

నమో బ్రహ్మణే ధారణంమే అస్త్వనిరాకరణం ధారయితా
భూయాసం కర్ణయో శ్రుతం మాచ్యోఢ్వం మమాముష్య ఓమ్

బ్రహ్మణే = బ్రహ్మము కొఱకు, నమః = నమస్కారము, మే = నాయొక్క (చిత్తమునందు), ధారణం, గ్రంథము, దాని యొక్క అర్థము ధారణము అస్తు = అగుగాక, అనిరాకరణం = నిరాకరణము లేని విధముగా, ధారయితా = ధరించువాడును, భూయాసం = అయ్యెదను గాక, అముష్య = ఈ (విధముగా ప్రార్థించుచున్న నామము గల), మే = నా యొక్క కర్ణయోః = కర్ణములందు (వినబడిన వేద శాస్త్రములు మా చ్యోఢ్వం = నాశము చేయకుము (పిదప నేను స్థిరమైన ధారణను) ఓం = పొందెదను

(ఈ మంత్రమును, చదువబడిన వేదములను మరువకుండుటకు పఠింపవలయును) – ఇది శ్రుత ధరీ విద్యయందు వాడబడుచున్నది
బ్రహ్మమునకు నానమస్కారము నేను గురువు వద్ద నేర్చుకొనిని వేదములను మరువకుందునుగాక ఇటువంటి నా శ్రోత్రములకు వినబడిన దంతయు నాశము గాకుండుగాక ఓం పరబ్రహ్మము

భట్ట భాస్కరుల వ్యాఖ్య – పరబ్రహ్మమునకు నమస్కారములు నా ధ్యానము లన్నియును ఆయన యందే యుండు గాక నేను ఆయునతో తాదాత్మ్యము చెందుటకై ఆయుననే ధ్యానించెదను గాక నా ధ్యానమునకు విఘ్నములు కలుగకుండుగాక నేను ఇంతవరకు నా చెవులతో వినినది చాలు ( ఇతర ఇంద్రియములతో ఎన్నో సుఖములననుభవించితిని) ఓ ఇంద్రియములారా! ఇప్పుడు నన్ను వదలవద్దు ( మీరు ఇప్పుడు పరమాత్మ యందే లగ్నము కండి – నేను ఆయనతో తాదాత్మ్యము పొందదలచియున్నాను) అదే ఓమ్.

10 దశమో ను వాక ః

ఋతం తపస్సత్యం తపశ్శ్రుతం తపశ్శాన్తం తపో దమస్తప శ్శమస్తపోదానంతపో యజ్ఞం తపో భూర్భువ స్సువర్బ్రహ్మైతదు పాస్యై తత్తపః –

ఋతము, సత్యము, శ్రుతము = పూర్వమీమాంసా, ఉత్తర మీమాంసాధ్యయనము, శాంతము = బాహ్య అంతరింద్రియముల ఉపరతి, దమము = శాస్త్రీయములగు ఉపవాసాదికములచే

దేహమును కృశింప జేయుట, శమము = శత్రువులందు కూడా కోపము లేకుండుట, దానము = ప్రత్యుపకారబుద్ధి లేక యోగ్యులకు ధనాదుల నిచ్చుట, యజ్ఞము = అగ్నిహోత్రాద్యాచరణము, భూర్భువస్సువః = భూర్భువస్సువర్లోకాత్మక విరాడ్రూపదేహధారియగు, బ్రహ్మ = బ్రహ్మమును, ఉపాస్య = ఉపాసింపుము, ఏ తత్ = ఈ ఉపాసించుట, తపః = తపస్సయగుచున్నది

విశే – చిత్తైకాగ్రతయనగాతపస్సు అయ్యదిజ్ఞానమునకు సాధనము ఆ తపస్సే శ్రౌతస్మార్తసకలకర్మ రూపము అని ప్రశంసించుచు – అట్టి తపస్సిద్ధికై ఈ మంత్రమును జపింపవలెను

ప్రకృతిలోని అనుల్లంఘనీయమైన, క్రమము తప్పని నియమములే ఋతము ప్రకృతిలోని ఆ నియతియే ఋతము ఇందులో చెప్పబడిన ఎనిమిది విషయములలో మానవుని నైతిక, అధ్యాత్మిక క్రమశిక్షణకు దోహదపడు అన్ని నియమములూ కూడియున్నవి ఆత్మసాక్షాత్కారమునకై ప్రయత్నించు సాధకునికి ఈ తపస్సు అతి ముఖ్యము – నిరంతర భగవద్ధ్యానమునకు ఇవి కేవలము అంగములు మాత్రమే తపస్సు, మనస్సు, నమస్సు, వచస్సు అనునవి ఇవన్నియు మనుస్సు ఏకాగ్రతయున్ను, దేహమును తన స్వాధీనములో యుంచుకొనుట ఇహపరములలో మనము సిద్ధినిపొందవలయుననిన తపస్సే ప్రధానమని మన శాస్త్రములు చెప్పుచున్నవి ఋషిత్వమునకు దైవత్వమును పొందుటకు తపస్సే చక్కటి మార్గము. బ్రహ్మచర్యము, అహింస, తితీక్ష, ఇవన్నియు తపస్సుకు అవసరము

11 = ఏకాదశోఽను వాకః

యథావృక్షస్య సంపుష్పి తస్య దూరాద్గంధో వాత్యేవం
పుణ్యస్య కర్మణో దూరాద్గంధో వాతి। 1
యథా ౨ సిధారాం కర్తే ౨వహితా మవక్రామే యద్యువే యువేహవా
విహ్వయిష్యామి కర్తం పతిష్యా మిత్యేవ మమృతా దాత్మానం జుగుప్సేత్.

సంపుష్పితస్య = బాగుగ వికసించిన, వృక్షస్య =చంపకము మున్నగు వృక్షముల యొక్క, గంధః = గంధము, దూరాత్ = దూరదేశములకును, యథా = ఏ విధముగా, వాతి = వీచు చున్నదో, ఏవం = ఈ విధముగా, పుణ్యస్య = జ్యోతిష్టో మాదికమగు పుణ్యమైన, కర్మణః = కర్మము యొక్క, గంధః = గంధము, దూరాత్ = దూరము వఱకు, వాతి = వీచుచున్నది కర్తే = గర్తమునందు, అవహితాం = అడ్డముగా వేయబడిన అసిధారాః= అసిధారను, అవక్రామేత్ = పాదములతో నడచుటకు ఇచ్ఛగించునో, (అపుడాతడిట్లు తలచును) యువేయువేయత్ = పాదమును గర్తమునకు అడ్డముగా వేసియుండెడి (అసిధారయందు) మిశ్రమణము చేసి గమనాగమములను చేసిన ఎడల (అప్పుడు), విహ్వఇష్యామి హ్వై = పాదచ్ఛేదమగుట చేత వ్యాకులము గల వాడనగుచున్నా కదా! (పాదములతో అసిధారను స్పృశించని ఎడల), కర్తం = గర్తమును గూర్చి, పతిష్యామ = పడగలను, ఇతి = ఈ విధముగా (చింతించుచు) అమృతాత్ = మోక్షప్రాప్తి హేతువగుటవలన, ఆత్మానం = తనను, జుగుప్సేత్ = పాపమువల్లనుండి జుగుప్సను పొందవలెను.

ఏ విధముగా బాగుగ పుష్పించిన చెట్టునుండి సుగంధము బహుదూరముగా వ్యాపించునో, పుణ్యకర్మలను చేయుట వలన వచ్చెడి కీర్తి స్వర్గమువరకు వ్యాపించును. అట్లే ఇంకొక విశేషము పదునైన కత్తులను బావి మీద పరుపబడియున్నది దానిని దాటదలచినవాడు ఇట్లు చింతించును నేను వాటి మీద నడచినచో కాళ్ళు కోసుకొని పోవును లేక నేను బావిలో పడిపోయెదను అదేవిధముగా, బహిరంగ, అంతరంగ పాపములచేసిన వాడు ఈ రెండు అడ్డంకులనుండి తనను తాను తప్పించుకొని, మోక్షార్థియై, పాపములఎడ విముఖత చూపవలయును.

పారాం = యద్యువేయువే హవా విహ్వాదిష్యామి కర్తం
వదిష్యామ్యేవ మన్నృతాదాత్మానంజాగుప్సేత్

(అనృతమునుండి తనను తాను కాపాడు కోవలెను)

అణోరణీయాన్ మహతోమహీయన్ !
ఆత్మా గుహాయాంనిహితో౽స్య జంతోః !
తమ క్రతుం పశ్యతి వీత శోకోధాతుః ప్రసాదాన్మ హిమాన మీ శమ్–

ఆత్మా = పరమాత్మ, అణోః = అణువుకంటె, అణీయాన్ = మిక్కిలి సూక్ష్మమైన వాడు, మహతః = గొప్పదైన దాని కంటె, మహీయాన్ = మిక్కిలి గొప్పవాడు, (అట్టి పరమాత్మ), అస్య = ఈ, జంతోః = దేవమనుష్యాది ప్రాణి జాతము యొక్క, గుహాయఅ = హృదయపుండరీక మధ్యవర్తి యగు బుద్ధి =గుహాయందు, నిహితః = విద్య చేతలభించును, ధాతుః = పరమేశ్వరుని యొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అక్రతుం = సంకల్పరహితుడును, మహిమానం = మిక్కిలి మహిమ గలవాడును (అగు) తం = ఆ, ఈశం = పరమేశ్వరుని, పశ్యతి = సాక్షాత్కారము చేసికొనుచున్నాడు.

వీతశోకః = జన్మమరణాది శోక రహితుడు (అగుచున్నాడు) (పై అనువాకములో చెప్పిన రీతి పుణ్యకర్మల నాచరించుచు నిషిద్ధ కర్మల పరిత్యజించుచు, పరిశుద్ధాంతః కరణుడై యుండువానికి తత్త్వోపదేశముచేయబడుచున్నది ఆపరమాత్మ సూక్ష్మముకంటే అతి సూక్ష్మమైనది. గొప్పవాటి అన్నింటికంటె గొప్పది అది అందరి హృదయ కుహరములందు ఉంటున్నది ఏ కర్మబంధములు లేని వాడు మహామహిమాన్వితుడు ఆ పరమేశ్వరుని అను గ్రహము చేత ఆయనను సాక్షాత్కరింపచేసుకొని, జన్మమృత్యుదుః ఖరహితుడగుచున్నాడు
ఈశ్వరాను గ్రహాదేవపుంసామద్వైతవాసనా
మహాభయకృత త్రాణాద్విత్రాణాం యదిజాయతే (అవధూత గీత)
(ఈ మంత్రము కఠోపనిషత్తు లోనూ, శ్వేతాశ్వతర ఉప నిషత్తు లోనూ కలదు).

సప్త ప్రాణాః ప్రభవంతి తస్మా ! త్సప్తార్చిషస్సమిధస్సప్త జిహ్వాః !
సప్తఇమేలోకా యేషుచరంతి ప్రాణాగుహాశయాన్నిహితాస్సప్తసప్త - (2)

గుహాశయాత్ = గుహయందున్న, తస్మాత్ = ఆ పరమాత్మవలన సప్త = సప్తసంఖ్యగల, ప్రాణాః = ప్రాణములున్ను, సప్తార్చిషః = సప్తసంఖ్యగల ప్రకాశమానశక్తులున్నూ, సప్తసమిధః = సప్తసమిధలు, సప్తజిహ్వాః = సప్తజిహ్వలున్ను, ప్రభవంతి = పుట్టు చున్నవి, యేషు = ఏలోకములందు, ప్రాణాః = ప్రాణవులు, చరంతి = సంచరించుచున్నవో (అట్టి) ఇమే = ఈ, లోకాః = లోకములు, సప్తసప్త = ఏడేసి పదార్థములు, తస్మాత్ = ఆ పరమాత్మనుండి, నిహితాః = పుట్టినవి (ఉంచబడినవి). సప్తప్రాణములు = శిరస్సునందున్న రెండు చెవులు, రెండు ముక్కులు, రెండు కళ్లు, నోరు = ఇవి ఏడు, సప్తార్చిషః = సప్త ఇంద్రియములు = పంచజ్ఞానేంద్రియములు, మనోబుద్ధులు ఇవి ఏడు ప్రకాశములు, సప్తసమిధలు = ఆ ఇంద్రియ విషయము, సప్తజిహ్వలు, కాళి, కరాళి, మనో జవ, సులోహిత, సుధ్రూమవర్ణ, స్ఫులింగినీ, విశ్వరుచి (ఇవి అగ్నియొక్క శిఖలు), సప్త సప్త = సప్తఋషులు, సప్తసముద్రములు - మున్నగునవి సప్తలోకములు తైత్తిరీయసంహితలో 4-6-5

అతస్సముద్రా గిరయశ్చ సర్వే 2 స్మాత్స్యందం తేసింధవస్సర్వ రూపాః!
అతశ్చవిశ్వా ఓషధయోరసాచ్చ ! యేనైష భూతస్తిష్టత్యంతరాత్మా - 3.

అతః = ఆ పరమాత్మ వలన, సర్వే = సకల విధములైన, సముద్రాః = సముద్రములును, (సర్వే) గిరయః = (సమస్త) పర్వతములున్ను, (జాతా = ఉద్భవించెను) అస్మాత్ = ఆ పరమాత్మనుండి, సర్వరూపాః, అన్ని దిక్కులకు, సింధవః = నదులు, స్యందంతే = ప్రవహించుచున్నవి, ఏషః = అహంప్రత్యయ గమ్యమానుడగు, అంతరాత్మా = స్థూల దేహ చిదాత్మలకు మధ్యవర్తియగు లింగదేహి, అతః = ఆ కారణమునుండియే, విశ్వా = సమస్తములైన, ఓషధయః = ఓషధులు, రసాత్ = రసములచేత బేడ, భూతః = అదిష్ఠింపబడి తిష్ఠతి = నిలిచియుంటున్నదో, (పుట్టినది) ఆపరమాత్మనుండియే సర్వసముద్రములు, పర్వతములు, పుట్టుచున్నవి. అతని నుండియే అన్నివైపులా ప్రవహించునదులు పుట్టుచున్నవి. అతని నుండియే అన్ని ఓషధులు, రసములు కలుగు చున్నవి. ఆ ఓషధుల సారము వలన, జీవుడు సూక్ష్మశరీరముతో కలిసి ఉంటున్నాడు.

(ఈ మంత్రము ముండకోపనిషత్ II – 1-9లో కొద్దిమార్పులతో ఉన్నది = ఈ మంత్రోద్దేశము = అపరమాత్మయే సర్వజగత్కారణుడనియు, అతనినే మనము తెలుసుకొని ఆరాధింపవలయునని),

**బ్రహ్మదేవానాం పదవీః కవీనా । వృషిర్విప్రాణాం మహిషోమృగాణామ్ ।**
**శ్యేనోగృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం. సోమః పవిత్ర మత్యేతి రేభన్ ॥ 4**

(పరమాత్మ), దేవానాం ః = దేవతలలో, బ్రహ్మః = బ్రహ్మ (యగుచున్నాడు) కవీనాం ః కవులలో, పదవీం = శాస్త్రజ్ఞులు (మార్గదర్శకులు గను), విప్రాణాం = బ్రాహ్మణులలో, ఋషిః = ఋషిగను, మృగాణాం = మృగములలో, మహిషః = మహిషమై, గృధ్రాణాం = పక్షులలో శ్యేనః = డేగగను, వనానాం = వనములను (భేదించుటకై), స్వధితిః = గొడ్డలిగను, సోమః = సోమలతాత్మకుడై, రేభన్= మంత్రశబ్దయుక్తుడగుచు, పవిత్రం = శుద్ధికారణముగు గంగాది పవిత్రజలముగను, అత్యేతి ః అతి క్రమించియున్నాడు. (సోమః = చంద్రుని వలె ఆనందింపజేయువాడుగను, రేభన్ = ప్రకాశించుచున్న పరమాత్మ, పవిత్రం ః పవిత్ర మైన సమస్తవస్తువును, అత్యేతి ః అతిక్రమించుచున్నాడు (తాత్పర్యము సులభము)

**అజామేకాంలోహిత శుక్లకృష్ణాం బహ్వీం ప్రజాంజనయన్తీగ్ం, సరూపామ్ ।**
**అజోహ్యేకోజుషమాణో 2నుశేతే । జహాత్యేనాం భుక్తే భోగా మజో2న్యః (5).**

అజాం = పుట్టుకలేనట్టియు, ఏకం = ఒకటిఅయినట్టియు, లోహిత శుక్ల కృష్ణాం ః రజస్సత్వ తామసగుణాత్మికయు, సరూపాం ః సమానమైన రూపముగల, బహ్వీం= అనేకమయిన, ప్రజాం ః ప్రజను జనయన్తీం = పుట్టించుచున్నట్టిదియును, ఏకః = ఒకడగు అజః = ఆసక్తిగలజీవుడు, జుషమాణః = ప్రీతి పూర్వకముగ సేవించుచు, అనుశేతే = అనుసరించుచున్నాడు అన్యః = మరొకడగు, అజః = విరక్తిగలజీవుడు, భుక్త భోగా = భుక్తభోగయగు, ఏనాం = ఈమాయను, జహాతి = వదలుచున్నాడు

జన్మము లేనట్టి అద్వితీయమగు ఆత్మ తేజోభిన్నముల యొక్క పరిణామములచేత ఎఱుపు, తెలుపు, నలుపులగు, రజోగుణ, సత్వగుణ, తమోగుణములు గలదియునై, తన కనుగుణమైన అనేకవిధమగు సృష్టిని కలుగజేయుచున్న ప్రకృతిని పొంది

అనుసరించుచున్నది. జన్మములేని మరొక ఆత్మ అనుభవింపబడిన భోగముగల ఈ ప్రకృతిని విడిచి పెట్టుచున్నది.

విశే - యదగ్నే రోహితగ్ం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదాపాం యత్కృష్ణం తదన్నస్య (ఛాం. ఉ 6-4-1) ఆ మూలప్రకృతి, తేజము, జలము, అన్నము అను మూడు రూపముల పుట్టించి, తద్రూపయై ఎపుడుండునో అప్పుడు లోహిత, శుక్ల, కృష్ణవర్ణోపేతమైయుండును. జీవుడుకూడా అనాది అయిన వాడే వాడు ద్వివిధముగా నున్నాడు ఒకడుగు ఆసక్తజీవుడు మాయను ప్రీతి పూర్వకముగా సేవించుచున్నాడు. వాడు మాయను అనుసరించిమేయుండును అనగా విషయసుఖములననుభవించు చూ వివేక రహితుడై జనన మరణరూపసంసారమును పొందుచున్నాడు విరక్తుడైన జీవుడు యేమాత్రము భుక్తభోగయగు ఈ మాయను పరిత్యజించును. (విరక్తికంటే ముందే భోగములనను భవించియుండును. తర్వాత అనుభవింపడు. కావున భుక్తభోగ యని చెప్పబడుచున్నది (ఈ మంత్రము బంధము, మోక్షముఅను వాటిని గూర్చి మాయా సిద్ధాంతముననుసరించి చెప్పబడుచున్నది అద్వైత మతమున అవిద్య ప్రకృతి, మాయ అనునది ఒకే అర్థముగలవి ప్రకృతి అనాది అయినది.)

**హగ్ం సశ్శుచిషద్వసురంతరిక్షస ! ద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ ! నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా ! గోజా, ఋతజా అద్రిజా ఋతం బృహత్ - (6).**

హంసః = ఆదిత్యుడు, శుచిషత్ = శుద్ధ జ్యోతిర్మండలము నంగుండు వాడు, వసుః = సూత్రాత్మస్వరూపము గలవాడై, అంతరిక్షసత్ = అంతరిక్షమునందుండువాడు, హోతా = హోమ నిష్పాదకములగు ఆహవనీయాగ్ని స్వరూపము గల వాడు, వేది షత్ = వేదియందుండు వాడు, అతిథిః = అతిథిరూపమున, దురోణసత్ = (ఇతరుల) గృహములందుండు వాడు, నృషత్ = (కర్మాధికారులగు) మనుష్యులందు జీవరూపమునయుండువాడు, వరసత్ = శ్రేష్ఠములగు (కాశీ, రామేశ్వరము వంటి పుణ్యక్షేత్రముల యందుండు వాడు, ఋతసత్ = సత్యములగు వైదిక కర్మలందు ఫలరూపమున యుండు వాడు. వ్యోమసత్ = ఆకాశముందునక్షత్రరూపమున యుండు వాడు, అబ్జాః = ఉదకములందు, శంఖ, మకరాది రూపమున పుట్టినవాడు, గోజాః = గోవులందుండి క్షీరాది రూపమున పుట్టినవాడు ఋతజాః = సత్యవచనమునుండి కీర్తిరూపమున పుట్టినవాడు, అద్రిజాః

= కొండలందు వృక్షాది రూపమున పుట్టిన వాడు, ఋతం = వెనుక చెప్పబడిన జగజ్జాతమంతయు సత్యమే, బ్రహ్మ = బ్రహ్మమే
(ఆదిత్య రూపుడగు పరబ్రహ్మమే జ్యోతిర్మయమండలములందు వస్వాది శబ్దవాచ్యుడై యున్నాడు)
(తాత్పర్యము సులభము)

**ఘృతం మిమిక్షిరే ఘృతమస్య యోని । ర్ఘృతే శ్రితో ఘృత మువస్య ధామ!**
**అనుష్వధమావహమాదయస్వ! స్వాహాకృతం వృషభవక్షిహవ్యమ్ 7**

(భోగజాతమును, జ్ఞానయోగ్య దేహాను కూలత్వమును, ప్రార్థించి జ్ఞానసాధనమగు యాగాదికమునకు హేతు భూతుడగు అగ్ని యొక్క అనుకూల్యమును ప్రార్థించుచున్నాడు)(పూర్వులగు యజమానులు ఆహవనీయాది రూపముగల అగ్ని యందు) ఘృతం = ఆజ్యమును, మిమిక్షిరే = చల్లుచుండిరి. ఘృతం = ఆ నెయ్యి, అస్య = ఈ అగ్నిహోత్రునకు, యోనిః = ఉత్పత్తికారణము (నేతిని పోసే కొద్దీ అగ్నిజ్వాలలు పెరుగుచుండును) (ఈ అగ్ని) ఘృతే = నేతియందు, శ్రితః = అక్రమించియుండును అస్య = ఈ అగ్నికి, ఘృతం ఉ = ఆజ్యమే ధామ = స్థానము (ఓ అగ్నీ!) అనుష్వధం = (మేము హుతమొనర్చెడి) హవిస్సుననుసరించి, ఆవహ = దేవతలనిచ్చటికి తీసికొని రమ్ము, మాదయస్వ = (తీసుకొనివచ్చి) సంతోషపెట్టుము వృషభ = శ్రేష్ఠుడవగు (ఓ అగ్నీ), స్వాహాకృతం = స్వాహాకారము చేత వా చేతయివ్వబడిన, హవ్యం = హవ్యమును, వక్షి = దేవతలను గూర్చిపొందింపుము.
(భట్ట భాస్కరుల వ్యాఖ్య - ఘృతము = పరబ్రహ్మము, మిమిక్ష) తడుపుటకు (సమస్తమును రుచిగలవిగా చేయుగాక) ఆపరబ్రహ్మమే ఈ ప్రపంచమునకు ముఖ్య కారణము ఆ పరబ్రహ్మమునందే సమస్త ప్రపంచములీనమగుచున్నది ఆ పరబ్రహ్మమే ఈ ప్రపంచమునకు ముఖ్యస్థానము అగ్నియే శరీరముగాగల ఓ పరమాత్మ! నీవు స్వాహాకారము చేవేల్చబడిన హవిస్సును వహించుచున్నావు. స్వధా కారముచేవ్రేల్చబడిన దానిని హవిస్సునకు తుల్యత నొందించుము మిగిలి యున్న సమస్త జనులను ఈ హవిస్సు చేతనే ఆనందింప జేయుము

సముద్రా దూర్మిర్మధుమాగం । ఉదార దుపాగం శునా సమ మృతత్వ మానట్ ।
ఘృతస్యనామగుహ్యంయదస్తి జిహ్వాదేవానా మమృతస్య నాభిః – 8.

సముద్రాత్ =( మిక్కిలి విస్తారముగా వ్యాపించియున్న) పరమేశ్వరునియందుండి, మధుమాన్ = మాధుర్యముగాల, ఊర్మిః = అలలతో సమానమగు ప్రపంచము, ఉదారత్ = పుట్టెను ఘృతస్య = స్వయం ప్రకాశకుడగు బ్రహ్మము యొక్క, గుహ్యం = రహస్యమగు, యత్ = ఏ, నామ = ప్రణవమనునామము, అస్తి = కలదో, ఉపాంశునా = ( ధ్యానకాలమందు) మెల్లగా ఉచ్చరింపబడు ఆ ప్రణవముచేత అమృతత్వం = ఉత్పత్తి వినాశరహితమగు బ్రహ్మత్వమును, సంన ఆనట్ = చక్కగా పొందుచున్నాను ( ఆ ప్రణవము) దేవానాం = దేవతలకు జిహ్వా = నాలుక, అమృతస్య = మోక్షమునకు నాభిః = బండికుండనడిమి తూమువలె ఆశ్రయభూతమైనది (ఘృ = దీప్తి = స్వయంప్రకాశము, చూడు, కఠోపనిషత్ 2–15)

( భట్టభాస్కరులు – మథింపబడిన సముద్రము వలన అమృతతరంగము పుట్టెను అది రహస్యమంత్రోపసానచేత మిక్కిలి అమృతభావమును పొందెను ఈ ప్రకారము ప్రసిద్ధమైన బ్రహ్మము యొక్క ఆ రహస్యనామము దేవతలకు జిహ్వాసదృశమును, అమృతమునకు ఆశయమునై ఘృతమని చెప్పబడుచున్నది ఇట్లు ఘృతశబ్దము చేత భోగ్య భూతమైన బ్రహ్మమే చెప్పబడుచున్నదని చూచుకొనదగినది. ఇది ఘృతశబ్దస్స్తుత్యర్థమైన మంత్రము

వయం నామ ప్రబ్రవామా ఘృతే నాస్మన్ । యజ్ఞే ధారయామానమోభిః
ఉపబ్రహ్మ శృణవచ్ఛస్యమానం । చతుశ్శృఙ్గో ఉవమిద్గౌరఏతత్ – 9

వయం = జ్ఞానార్థులమైన మేము, అస్మిన్ = ఈ, యజ్ఞే = జ్ఞానయజ్ఞమునందు, ఘృతేన = స్వయం ప్రకాశమగు బ్రహ్మముచేత, నామ = ప్రణవనామమమును, ప్రబ్రవామ = సదా ఉచ్చరించుచున్నాము నమోభిః = నమస్కారములతోడ, ధారయామి = (చిత్తమునందు) ధరించుచున్నావము. చతుశ్శృంగః = శృంగచతుష్టయము కలిగిన ట్టియు, సస్యమానం = మా చేత కొని యాడ బడునట్టియు, ఉపశ్రణవత్ = సమీపమునందున్న బ్రహ్మవేత్తలచేత వినబడునట్టియు గౌరః = శ్వేతవర్ణముగల ప్రణవమనెడి వృషభము, అవమీత్ = బ్రహ్మతత్త్వమున

ప్రతిపాదించెను
(చతుశ్శృంగములు = ప్రణవమండలి, అకార, ఉకారము మకార నాదములు)
(చతుశ్శృంగములు = నాలుగు వేదములు)

చత్వారిశృంగా త్రయో అస్యపాదా । ద్వేశీర్షే సప్తహస్తా సోఅస్యత్రిధా బద్ధో వృషభోరోరవీతి । మహా దేవో మర్త్యాగ్ం అవివేశ. 10

అస్య ఈ ప్రణవ స్వరూపుడగు పర బ్రహ్మమునకు, శృంగాః = శృంగములు, చత్వారి = నాలుగు, (అకార, ఉకార, మకార, నాదములు), పాదాః = పాదములు, త్రయః = మూడు (విశ్వ, తైజస, ప్రాజ్ఞులు) అధ్యాత్మమునకు – విరాట్,హిరణ్యగర్భ, అవ్యాకృతులు) – బ్రహ్మతత్వమును ఎరుగుటకు వీరు ద్వారభూతములు కావున పాదములని చెప్పబడుచున్నారు) శీర్షే = శిరములు, ద్వే = రెండు, (చిదచిద్రూపములగు శక్తిద్వయము) – హస్తాసః = హస్తములు సప్త = ఏడు (భూర్భువస్సువరాదిలోకములు) త్రిధా = మూడు విధములుగా, బద్ధః = కట్టబడిన (అ, ఉ, మ – కారములు, విశ్వతైజసప్రాజ్ఞులు, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృతులుగా కట్టబడిన) వృషభః = ప్రణవము, మహః = బ్రహ్మతత్వమును రోరవీతి = ప్రతిపాదించుచున్నది, దేవః = పరమేశ్వరుడు, మర్త్యాన్ = మనుష్యదేహములను, ఆవివేశ = ప్రవేశించెను వృషభముగా భావింపబడిన ఓంకారమునకు నాల్గు శృంగములు, మూడు పాదములు, రెండు తలలు, ఏడుచేతులు కలిగియున్నది అది మూడు విధములుగా బంధింపబడియున్నది, ఆ వృషభము పరబ్రహ్మతత్త్వమును గూర్చి అంకెవేయుచుచెప్పుచున్నది అదియే మర్త్యులయలదేహమున ప్రవేశించెను
సవాఏష ఇహప్రతిష్ఠ అన ఖాగ్రేభ్యః = బృహ ఉప = 1–4) మనుష్యులందు నఖశిఖపర్యంతము పరమాత్మ ఆవరించియున్నాడు.

త్రిధాహితం పణి భిర్గుహ్యమానం । గవిదేవాసో ఘృత మన్వవిన్దన్ । ఇంద్రఏకగ్ం, సూర్య ఏకం జజాన। వేనాదేకగ్గ్ం స్వధయానిష్టతక్షుః. 11

త్రిధా = మూడు విధములుగా (శరీరమునందు విశ్వ, తైజస, ప్రాజ్ఞులను పేరు

తోడను, బ్రహ్మాండమందు విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృతులను పేరుతోను, హితం = ఉన్నవాడును, పణిభిః = స్తోత్రముతోను (బహ్మవేత్తల చేతను), గుహ్యామానం = పరమరహస్యముగ కాపాడబడుచున్నదియును, ఘృతం = స్వయంప్రకాశమగు బ్రహ్మతత్వమును, దేవాసః = సాత్వికులగు బ్రహ్మవేత్తలు, గవి = తత్త్వ మస్యాది మహావాక్యజాతమందు, అన్వవిందన్ = అనుక్రమముగా పొందినది ఇంద్రః = పరమైశ్వర్య యుక్తుడగు విరాట్పురుషుడు, ఏకం = ఒకదానిని (జాగరణ రూపమున), జజాన = పొందించెను, సూర్యః = సూర్యుడు (తేజస్వియగుటచేత హిరణ్యగర్భుడు)

ఏకం = మరొకదానిని, (స్వప్నరూపమును) జజాన = కలుగజేసెను, వేనాత్ = సర్వదుః ఖరహితుడగుటచేత కమనీయుడగు అవ్యాకృతుని వలన, ఏకం = మరొకటి (సుషుప్తిరూపము కలిగెను), ఈ విధముగా, ఇంద్రసూర్యవేనులు, విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృతులు, స్వధయా = అనన్యాశ్రయమగు బ్రహ్మశక్తిచేత, నిష్టతక్షుః = జాగరణ, స్వప్న, సుషుప్తి రూపములను పుట్టించిరి

స్వయం ప్రకాశమగు బ్రహతత్వమును, బ్రహ్మవేత్తలగు మహాత్ములు దానిని విశ్వతైజసప్రాజ్ఞులుగా, విరాట్‌హిరణ్యగర్భ, అవ్యాకృతులుగా, జాగ్రత్స్వప్న సుషుప్త్యవ స్థలుగా తమ తపస్సులో దర్శించి తత్త్వమస్యాది మహావాక్యములతో కీర్తింపబడునదియు, తమ హృదయకుహరములలో రహస్యముగా యున్న దానిని, ఇంద్ర, సూర్యవేనులుగా గుర్తించిరి స్వప్రకాశమానమైన పరబ్రహ్మము చేతనే ఈ మూడువిధములైన వర్గములు ఏర్పడినవి

(భట్టభాస్కరులు - ఇంద్రుడు సంకర్షణ వ్యూహమును, సూర్యుడు ప్రద్యుమ్న వ్యూహమును, వేనుడు = వ్యాప్తిగల వాసుదేవుని) వలన పుట్టిన అనిరుద్ధవ్యూహమును, ప్రతిరూపమైన జ్ఞానము చేత పొందిరి (ఈ 10,11, ఋక్కులచేత ప్రణవము ప్రతిపాదింపబడినది)

**యోదేవానాం ప్రథమం పురస్తా ! ద్విశ్వాధియోరుద్రో మహర్షిః హిరణ్యగర్భం పశ్యతజాయమానగ్ం ! సనోదేవ శ్శుభయా స్మృత్యాస్సంయునక్తు - 12.**

యః = ఏ దేవుడు, దేవానాం = ఇంద్రాఅగ్ని దేవతలకు, ప్రథమం = అధిభూతుడును,

పురస్తాత్ = ఆ దేవతలకంటె ముందుగా, జాయమానం = పుట్టుచున్న, హిరణ్య గర్భం = హిరణ్యగర్భుని, పశ్యత = చూచుచున్నాడో, విశ్వాధియః = జగత్తునకు కారణభూతుడగుట వలన అధికుడో, రుద్రః = వేద శబ్ద ప్రతిపాద్యుడో, మహర్షిః = అతీంద్రియ ద్రష్టలగు వారిలో అధికుడో, సః = ఆ, దేవః = దేవుడు, నః = మమ్ములను, శుభయా = శుభమగు, స్మృత్యా = తత్త్వాను స్మృతి చేత, సంయునక్తు = సంయుక్తులుగా చేయుగాక!
(తాత్పర్యము సులభము)

**యస్మాత్పరం నా పరమస్తికి ఞ్చి! ద్యస్మాన్నాణీ యో నజ్యాయో ఽస్తికశ్చిత్ ! వృక్షఇవస్త బ్ధోదివితిష్ఠత్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్ !! – (13)**

యస్మాత్ = దేనికంటె, పరం = శ్రేష్ఠమైనదియు, అపరం = నికృష్టమైనదియు, కించిత్ = కొంచమైనను, న అస్తి = లేదో, యస్మాత్ = దేనికంటె, అణీయః = సూక్ష్మమైనది, కశ్చిత్ = ఒకటియును, నఅస్తి = లేదో, జ్యాయః = గొప్పదియును, న = లేదో, (అట్టి), ఏకః = ఒక్కడగు పరమాత్మ, వృక్షఇవ = వృక్షమువలె స్తబ్ధః = నిశ్చలుడై, దివి = స్వప్రకాశమునందు, తిష్ఠతి = ఉంటున్నాడు. తేన = ఆ, పురుషేణ = పురుషుని చేత, ఇదం సర్వం = ఈ కనబడుచున్న ప్రపంచమంతయు, పూర్ణం = పూర్ణమైయున్నది ఏ పరమాత్మకంటె ఇతరమైన ఉత్కృష్ట పదార్థము ను లేదో, ఎవనికంటె సూక్ష్మమైనదియును, స్థూలమైనదియును ఒకటియును లేదో, ఆ అద్వితీయమగు పరమాత్మ పరమ పదమునందు వృక్షమువలె స్తబ్ధుడై యుంటున్నాడు ఆపరమాత్మ చేత ఈజగత్తం తయునిండియున్నది

**నకర్మణా న ప్రజయాధనేన ! త్యాగేనైకే అమృతత్వమానశుః ! పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజ దేతద్యతయో విశన్తి (14).**

కర్మణా = అగ్నిహోత్రాది కర్మా చరణము చేత, న = (మోక్షమును) పొందలేదు, ప్రజయా = సంతానము చేత, న = (మోక్షమును), పొందలేదు, ధనేన = ధనముచేత, న = (మోక్షమును) పొందలేదు, ఏకే = కొందరు, త్యాగే = త్యాగము చేతనే, అమృతత్వం = మోక్షమును, ఆనశుః = పొందిరి, యతయోః = (యతీశ్వరాదులు

(యత్ = ఏ అమృతత్వమును (విశంతి = పొందుచున్నారో, తత్ = ఆ, ఏతత్ = ఈ అమృతత్వమును, నాకం = స్వర్గమున కంటె, పరేణ = శ్రేష్ఠమై, గుహాయాం = ఏకాగ్రమయిన స్వకీయ బుద్ధిగుహాయందు, నిహితం = ఉన్నది, విభ్రాజత్ = ప్రకాశించుచున్నది (దీనిని అంతర్ముఖులైన వారే ఎరుగుచున్నారు) భట్టబాస్కరులు = త్యాగమనగా = కర్మఫలత్యాగమనియు, సన్న్యాసమనగా శరణాగతి యనియు వ్యాఖ్యానించిరి) ఇది కైవల్యో వర్యోపనిషత్తులో కూడ ఉన్నది

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థా స్సన్న్యాసయోగాద్యతయశ్శుద్ధసత్త్వాః ।
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాత్పరి ముచ్యంతి సర్వే 15

(పూర్వమంత్రమునందు త్యాగము మోక్ష సాధనమని చెప్పబడినది ఈ మంత్రమునందు "శ్రుతి తరతి శోకమాత్మ విత్" చాందో ఉప (7-1-3), జ్ఞానాదేవతు కైవల్యం ప్రాప్యతే యేనముచ్యతే = (స్మృతి) జ్ఞానమువల్లనే మోక్షమును పొందగలరు అని చెప్పుచున్నవి కావున వెనుకటి మంత్రమునకును ఈ శ్రుతిస్మృతులకు విరోధము తటస్థించుచున్నది దానిని పరిహరించుటకై, జ్ఞానసన్న్యాసములు మోక్షమునకు వేర్వేరుగ ఉపకరించునని చెప్పుచున్నారు

(యే = ఎవరు), వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః = వేదాన్త = ఉపనిషద్వాక్యఉత్పన్నమైన విజ్ఞానముచేత నిశ్చయింపబడిన జీవబ్రహ్మైకలక్షణ విషయములు గలవారై, సన్న్యాస యోగాత్ = త్యాగయోగముల వలన శుద్ధసత్త్వాః = శుద్ధ చిత్తులై, యతయః = నియమశీలురగుచున్నారో, తేసర్వే = వారందరూ, బ్రహ్మలోకే = బ్రహ్మసాక్షాత్కారము కలిగిన పిదప, పరాంతకాలే = పరాంతకాలమందు, పరామృతాత్ = అవ్యాకృతము వల్ల నుండి, పరిముచ్యన్తి = విడువబడుచున్నారు

విశే - జ్ఞానము తత్త్వప్రకాశన పూర్వకముగా అవిద్యానివర్తకమనియు, త్యాగము విషయభోగ నివృత్తిద్వారా చిత్తశుద్ధికి హేతు భూతమనియు, వేర్వేరుగా ఉపయోగము చెప్పబడుచున్నది. అజ్ఞానులకు స్థూల సూక్ష్మబంధమోచనము ప్రళయమున సంభవించును కానీ (అవ్యాకృత) కారణ శరీర బంధమునుండి విముక్తి కాజాలరు జ్ఞానులు కారణశరీరబంధమునుండియు విముక్తులగుచున్నారు - జ్ఞానులకు అజ్ఞానులకు ఇదియే భేదము (భట్టబాస్కరలు - సన్న్యాసము = కర్మఫలత్యాగము, బ్రహ్మార్పణము చేయుటయనియు, యోగము = సమాధి సాధన అనియు వ్యాఖ్యానించారు)

దహ్రం విపాపం పరవేశ్మభూతం యత్పుణ్డరీకం పురమధ్య సగ్ంస్థమ్
తత్రాపిదహ్రం గగనం విశోక స్తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యమ్.   16

దహ్రం = అల్పమైనట్టియు, విపాపం = శుద్ధమైనట్టిదియు, పరమేశ్మభూతం = పరమాత్మకు స్థాన భూతమైనట్టియు, పురమధ్యసంస్థం= శరీర మధ్యభాగమందున్న, యత్ = ఏ, పుండరీకం = అష్టదళమగు హృదయకమలము, (అస్తి = కలదో), తత్రాపి = ఆదహర పుండరీకమందున్న, దహ్రం = అతిసూక్ష్మమైన, గగనం = ఆకాశమువలె(అమూర్తమగు) విశోకః = శోకరహితమగు పరబ్రహ్మము (కలదు), తస్మిన్ = ఆహృదయకమలమునందు అంతః = లోపల, యత్ = ఎయ్యది కలదో, తత్ = అయ్యది, ఉపాసితవ్యం = ఉపాసింపదగినది.
(తత్త్వజ్ఞానమునెఱుగుటకు అసమర్థుడగు వానికి సుక్ష్మోపాయము చెప్పబడినది) (ఛాందో - ఉప (8-1-1)లో యదిదమస్మిన్ బ్రహ్మపురేదహరం పుండరీకం వేశ్మదహరోఽస్మిన్నంతరాకాశస్తస్మిన్యదన్తం దన్వేష్టవ్యం తద్వావ విజ్ఞాసితవ్యమ్

ఉపాసించుటకు అనగా ఇతరవిధమైన జ్ఞానములేక, కేవలము సజాతీయజ్ఞానప్రవాహరూపముగ భావించుట)

యోవేదాదౌస్వరః ప్రోక్తోవేదాన్తేచ ప్రతిష్ఠితః తస్యప్రకృతి లీనస్య ।
యః పరస్స మహేశ్వరః (17)

(అజోఽన్య అవివేశ - సర్వే చత్వారిచ) యః = ఏ, స్వరః = ప్రణవము, వేదాదౌ = వేదాది యందు, ప్రోక్తః =చెప్పబడినదో, వేదాంతేచ = ఉపనిషత్తుల యందున్న, ప్రతిష్ఠితః = ప్రతిపాదించబడినది, ప్రకృతి లీనస్య = ప్రకృతియందు లీనమైన, తస్య = ఆ ప్రణవము యొక్క, యః = ఏ, పరః = శ్రేష్ఠభాగము (గలదో), సః = అదియే, మహేశ్వరః = మహేశ్వరుడని ఎరుగవలయును

వేదముల మొదటను, ఉపనిషత్తుల యందును, ప్రతిష్ఠింపబడి, ప్రతిపాదింపబడి, ధ్యానసమయమున ప్రకృతి యందు లీనమగు చున్న ఓంకారము న కంటె అతీతమై యున్నదో అతడే మహేశ్వరుడు

ప్రణవోచ్చారణలో, ధ్యానములో, అకార, ఉకార, మ కారముల స్వరము ప్రకృతికి మూలకారణమైన పరమాత్మలో తుదకులీనమగుచున్నది అనాదాతీతుడే మహేశ్వరుడు
( భట్టభస్కరులు = పరబ్రహ్మస్వరూపుడగు విష్ణువేమహేశ్వరుడు)

13 త్రయోదశోஉను వాకః –

సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశం భువమ్
విశ్వం నారాయణందేవ మక్షరం పరమం పదమ్ (1)

సహస్రశీర్షం = అనేక శిరస్సులు గలిగినట్టియు, విశ్వాక్షం = అనేక నేత్రములు కలిగినట్టియు, విశ్వశంభువం = ప్రపంచమునకు సుఖము కలుగజేయు నట్టియు, విశ్వం = జగదాత్మకుడైనట్టియు, నారాయణం = జగత్కారణములగు పంచభూతముల యందుండు వాడును, అక్షరం = నా శరహితుడు, పరమం = శ్రేష్ఠుడును, పదం = జ్ఞానులచేత పొందబడువాడను, (అగు) దేవం = మహేశ్వరుని ( ధ్యానము చేయవలయును). (నారాయణుడు = ఆపోనారాఇతి ప్రోక్తా అపోవైనరసూనవః అయనం తస్యతాః పూర్వం తేన నారాయణస్మృతః. జగత్కారణములగు పంచభూతములందుండు వాడు

విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్
విశ్వమేవేదం పురషస్త ద్విశ్వముపజీవతి (2)

పతింవిశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ (3)

విశ్వతః=జడవర్గమగు జగత్తు కంటే పరమాత్ = శ్రేష్ఠమైనట్టియు, విశ్వం = సర్వాత్మకుడైనట్టియు, నారాయణం = నారాయణుడును, హరిం =పాపమును, అజ్ఞానమును నశింపజేయువాడును (అగు పరమేశ్వరుని ధ్యానించుచున్నాను). ఇదం = ఈ, విశ్వం ఏవ = ప్రపంచమే, పురుషః = పరమాత్మ, తత్ = ఆపరమాత్మ, విశ్వం = ప్రపంచమును, ఉపజీవతి = ఆశ్రయించుచున్నాడు.

విశ్వస్య = ప్రపంచమునకు, పతిం = పాలకుడగుటచేత అధిపతియు, ఆత్మేశ్వరం = జీవులకు ఈశ్వరుడును, శాశ్వతం = శాశ్వతుడైన వాడును, శివం = మంగళస్వరూపుడును, నారాయణం = నారాయణుడును, మహాజ్ఞేయం = తెలుసుకొనతగిన తత్త్వములో ప్రౌఢుడును, విశ్వాత్మానం = ప్రపంచమే ఆత్మగా గలవాడును, పరాయణం = ప్రపంచాధారకుడును (అగు పరమేశ్వరుని ధ్యానించెదను)
(పూర్వాను వాకమందు, హృదయపుండరీకమునందు పాసింపదగినదిగా నిర్దిష్టమైన మహేశ్వర స్వరూపము యొక్క ఉపాసింపదగిన గుణవిశేషములు చెప్పబడినవి)

**నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణః పరః**
**నారాయణ పరం బ్రహ్మతత్త్వం నారాయణః పరః**
**నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః. (4)**

నారాయణః = నారయణుడే, పరః = శ్రేష్టమగు, జ్యోతిః = జ్యోతి స్వరూపము, నారాయణః = నారాయణుడే, పరః ఆత్మా = పరమాత్మ నారాయణః = నారాయణుడే, పరం = శ్రేష్టమగు, బ్రహ్మ = వేదాంత వేద్యమగు, తత్త్వం = వస్తువు, నారాయణః = నారాయణుడే, పరః = శ్రేష్టమైన, ధ్యాతా = వేదాంతాధికారి, నారాయణః = నారయణుడే, ధ్యానం = ధ్యానము, నారాయణః = నారాయణుడే, పరః = పాపాత్ములకు శత్రువు (అగుచున్నాడు) ఇట్టి నారాయణమూర్తిని ధ్యానించవలెను

**యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా**
**అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థితః (5)**

జగత్ = ఈజగత్తునందు, యత్ = ఏ, కించిత్ = కొంచెమగునది, సర్వం = అంతయు, దృశ్యతే = చూడబడుచున్నదో, అపివా = లేక, శ్రూయతేచ = వినబడుచున్నదో, తత్ = దానియొక్క, అంతః = లోపలను, బహిశ్చ = వెలుపలను, సర్వం = అంతటా, నారాయణః = నారాయణుడు, వ్యాప్య = వ్యాపించి, స్థితః = ఉన్నాడు

అనంత మవ్యయం కవిగ్ం సముద్రేఽంతం విశ్వశంభువమ్
పద్మకోశప్రతీకాశగ్ం । హృదయంచాప్యధోముఖమ్ (6)

అనంతం = దేశకాలనిమిత్తములు లేనివాడును, అవ్యయం = వినాశ రహితుడును, కవిం = చిద్రూపముచేత సర్వజ్ఞుడును, సముద్రే = సంసారసాగరమునందు, అంతం = అవసాన భూతుడును, విశ్వశం భువం = సంసారసుఖోత్పత్తికి కారణ భూతుడును (అగు నారాయణుని ఉపాసించెదను), పద్మకోశ ప్రతీకాశం = తామర మొగ్గతో సమానమగు, అధోముఖం = అధోముఖమగు, హృదయం = హృదయకమలము (కలదు) (ఈమంత్రములోని ప్రథమార్థము నారాయణుని యొక్కవాస్తవస్వరూపమును సంక్షేపముగా చెప్పబడినది)

అధోనిష్ట్యావితస్త్యాంతే నాభ్యాముపరితిష్ఠతి
జ్వాలమాలా 22కులం భాతీ విశ్వస్యాయతనం మహత్ – 7

నిష్ట్యాః = గ్రీవాబంధముయొక్క, అధః = క్రిందిభాగమందు, నాభ్యాం ఉపరి = నాభికిపైన, వితస్త్యాంతే = ద్వాదశాంగుళ పరిమితిగల ప్రదేశము యొక్క చివరి భాగమునందు (హృదయపుండరీకమునందు) తిష్ఠతి = ఉన్నది, విశ్వస్య= బ్రహ్మాండమునకు, ఆయతనం = ఆధారభూతమైనట్టి, జ్వాల మాలాకులం = ప్రకాశ పరంపరతో కూడుకొనియున్న, మహత్ = పరబ్రహ్మము, భాతీ = ప్రకాశించుచున్నది.

సంతతగ్ం శిలాభిస్తు లంబత్యాకోశ సన్నిభమ్ ।
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్ – 8.

ఆకోశసన్నిభం = పద్మము కులములతో సమానమగు (హృదయకమలము) లంబతి = (హృదయ మధ్యమునందధోముఖముగా) వ్రేలాడుచున్నది (ఆ హృదయకమలము), శిలాభిః = నాడులచేత, సంతతం = అంతటా వ్యాపింపబడియున్నది, తస్య = ఆహృదయము యొక్క, అంతే = సమీపమునందు, సూక్ష్మం = సూక్ష్మమగు, సుషిరం = రంధ్రము (కలదు) తస్మిన్ = ఆరంధ్రమునందు, సర్వం = ఈ జగమంతయూ, ప్రతిష్ఠితం = ప్రతిష్ఠింపబడియున్నది.

అరంధ్రము = సుషుమ్న

తస్యమధ్యేమహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతో ముఖః ।
సో௨గ్రభుగ్విభజన్తిష్ఠన్నాహారమజరః కవిః ।
తిర్యగూర్ధ్వమధశ్శాయీరశ్మయస్తస్య సన్తతాః. (9)

తస్య = ఆసుషుమ్నానాళముయొక్క, మధ్యే = మధ్యభాగమునందు , మహాన్ = ప్రౌఢమగు, అగ్ని = అగ్ని (కలదు) (ఆ యగ్ని), విశ్వార్చిః = అధికములగు జ్వాలలు కలది, విశ్వతోముఖః = నలువైపుల వ్యాపించినముఖములు కలది, సః = ఆయగ్ని, అగ్రభుక్ = తనకు ముందున్న దానిని (అన్నాదికములను) భుజించును, ఆహారం = భుజించిన ఆ ఆహారము (ఆయా అవయవములకు సమానముగా, విభజన్ = విభజించుచు తిష్ఠన్ = ఉండును, అజహరః తాను నశింపనివాడై, కవిః = సర్వజ్ఞుడై యుండును తస్య = ఆ అగ్నియొక్క, రశ్మయః = జ్వాలలు తిర్యగూర్ధ్వమధశ్శాయీ = అడ్డముగా, నిలువుగా వ్యాపించి నవై, సంతతః = అంతటావ్యాపించియున్నది. (భ, గీ) = (అహం వైశ్వానరోభూత్వాప్రాణినాందేహమాశ్రితః)

సంతాపయతిస్వం దేహమాపాద తలమస్తకః
తస్యమధ్యేవహ్నిశిఖా అణీయోర్ధ్వావ్యవస్థితః – (10).

(ఆయగ్ని) ఆ పాద తలమస్తకః = పాదముమొదలు శిరస్సు వరకు వ్యాపించినదై స్వం = స్వకీయముగు, దేహం = దేహమును, సంతాపయతి = సంతాపము కలుగుజేయున్నది, తస్య = ఆ దేహమునందంతయు వ్యాపించియున్న అగ్ని జ్వాలల యొక్క, మధ్యే = మధ్యభాగమునందు, వహ్ని శిఖా = ఒక అగ్నిజ్వాల, అణీయః = సూక్ష్మమైనదై, ఊర్ధ్వా = ఊర్ధ్వప్రసారము కలదై, వ్యవస్థితః = విశేషముగానున్నది.

నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవ భాస్వరా
నీవారశూకవత్తన్వీప్తా భాస్వత్యణూపమా – (11)

(అవహ్నిశిఖ) నీలతోయదమద్యస్థా = నీలమేఘము యొక్క మధ్యభాగమందున్న, విద్యుల్లేఖేవ = మెఱుపుతీగవలె, భాస్వరా = ప్రకాశించుచున్నదైయున్నది, నీవార

శూకవత్ = నీ వారధాన్యపుగింజ కొనయందుండుముల్లు వలె తనీ్వ = సూక్ష్మమైనది, పీతా = పీతవర్ణముగల, భాస్వత్ = కాంతి గలది అణూపమా = సూక్ష్మవస్తువులకు ఉపమాన భూతమైనట్టిది

తస్య శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః
సబ్రహ్మసశ్శివస్సహరి స్సేంద్ర సోఽక్షరః పరమస్స్వరాట్ (12)

(అపివా సన్తతా షట్పు)
తస్యాః = ఆ సూక్ష్మమగు వహ్నిజ్వాలయొక్క, శిఖాయాః = అగ్రము యొక్క, మధ్యే = మధ్యభాగమునందు, పరమాత్మా = పరమాత్మ వ్యవస్థితః = ఉన్నాడు, సః = అతడే, బ్రహ్మ = చతుర్ముఖ బ్రహ్మ, సః = అతడే, శివః = శివుడు, సః = అతడే, హరిః = విష్ణువు, సః = అతడే, ఇంద్రః = ఇంద్రుడు, సః = అతడే, అక్షరః, నాశరహితుడు, సః = అతడే, పరమః = శుద్ధ చిద్రూపుడు, సః = అతడే, స్వరాట్ = స్వరాట్టును (స్వయం ప్రకాశుడు)
(ప్రథమమున సహస్ర శీర్షం దేవం మున్నగు విశేషణములతో ప్రతిపాదింపబడిన పరమాత్మను పద్మకోశప్రతీకాశం అనునటువంటి వాక్యములతో నిర్ణయించిన విధముగా ధ్యానింపవలెను)

## 14 చతుర్దశోఽనువాకః

ఆదిత్యోవా ఏష ఏతన్మండలం తపతి తత్రతా ఋచస్తదృచా
మండలగ్ం సఋచాంలోకోథ యఏష ఏతస్మిన్మండలే ఽ ర్చిర్దీప్యతే,
తాని సామాని ససామ్నాంలో కోథయ ఏష ఏతస్మిన్మండలే
ఽర్చిషిపురుషస్తాని యజూగ్ంషిసయజుషా మండలగ్ం సయజుషాం
లోకస్సైషాత్రయ్యేవవిద్యాతతి యఏషో 20తరాదిత్యే హిరణ్మయ పురుషః.

(పూర్వానువాకమందు చెప్పబడిన పరమేశ్వరుడు), ఏషః = ఈ, ఆదిత్యంవై = సూర్యుడేకదా, ఏతత్ = ఈ, మండలం = సూర్యమండలము, తపతి = తపింపచేయుచున్నది, తత్ర = ఆ మండలమునందు, తాః = ప్రసిద్ధములగు, ఋచః = మంత్రములు (ఉంటున్నవి), తత్ = అకారణములవలన, మండలం = మండలము,

ఋచా = ఋక్కుచేత (నిర్మింపబడినది), సః = ఆమండల భాగము, ఋచాం = ఋక్కుల యొక్క, లోకః = నివాసస్థానము, ఏతస్మిన్ = ఈ, మండలే = మండలమందు, యః = ఏ, ఏషః = ఈ, అర్చిః = తేజస్సు, దీప్యతే = ప్రకాశించుచున్నదో, తాన్ = ఆకాంతిస్వరూపములను, సామాని = సామములుగా (ధ్యానింపవలెను), సః = ఆకాంతి భాగము, సామ్నాం = సామాభిమాని దేవతలకు, లోకః = నివాసస్థానము, అథ = ఇక, ఏతస్మిన్ = ఈ, మండలే = మండలసంబంధముగ, అర్చిషి = కాంతియందు, యః = ఏ, ఏషః = ఈ, పురుషః = పురుషుడు కలడో, తాని = ఆ దేవతారుపములను, యజూంషి = యజుస్సులుగా (ధ్యానింపవలెను) సః = ఆ యజూరాత్మకుడగు పురుషుడు, యజుషా = యజుస్సులచేత (నిర్మింపబడిన) మండలం = మండలమని ధ్యానింపవలెను, సః = ఆయజూర్భాగము, యజుషాం = యజూరభిమాన దేవతలకు, లోకః = నివాసస్థానము, సాఏషా = ఆ ఇదియే, త్రయీఏవ = ఋగ్యజుస్సామాత్మకమే విద్యా = విద్యగా, తపతి = ప్రకాశించుచున్నది యః = ఏ, ఏషః = ఈ, పురుషః = పురుషుడని చెప్పబడైనో ఆ పురుషుడు, అంతః ఆదిత్యే = ఆదిత్య మండలమధ్య భాగమునందు, హిరణ్మయః పురుషః = హిరణ్మయ పురుషుడై యున్నాడు శ్రుతి = అథయఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వఏవ సువర్ణః = చాందోగ్యో = 1-6-6 - = ఈ ఆదిత్యమండలము యొక్క మధ్యభాగమునందు హిరణ్మయుడగు ఏ పురుషుడు కనబడుచున్నాడో అతడు హిరణ్మయశ్మశ్రువు = బంగారు మీసములు కలవాడు, హిరణ్యకేశుడు, గోరు మొదలుకొని అంతయు బంగారుగా గలవాడు

ఇప్పుడు సూర్యాంతర్గతమైన ఉపాసనను చెప్పుచున్నాడు) ఈ కనుపించుచున్న సూర్యమండలము ఋగ్వేదముగాను, ఈ సూర్యమండలములోని తేజస్సు సామ వేదముగాను, సూర్యమండలాంతర్గత తేజస్సునందలి పురుషుడు యజుర్వేదముగాను, ప్రకాశించుచున్నాడు ఇట్లు వేదస్వరూపమైన సూర్యుని యందుమనోహరమైన స్వరూపముతో యోగులచేత చూడదగిన వాడును, తేజోమయుడును, పరిపూర్ణుడును అగు పరమాత్మ ఉపాసకులచే ధ్యానింపదగిన వాడు

15. పంచదశోఽనువాకః

ఆదిత్యోవైతేజ ఓజోబలం యశశ్చక్షుశ్శ్రోత్రమాత్మా మనోమన్యుర్మను ర్మృత్యుస్సత్యో మిత్రోవాయు రాకాశః ప్రాణోలోకపాలః కః కింకం తత్సత్య మన్న మమృతో, జీవో, విశ్వః కతమ స్స్వయంభుః బ్రహ్మైతద మృత ఏష పురుష ఏష భూతానామధిపతి ర్బ్రహ్మణస్సాయుజ్యగ్ం సలోకతా మాప్నోత్యేతా సామేవ దేవతా నాగ్ం సాయుజ్యగ్ంసార్ష్టితాగ్ం సమానలోకతా మాప్నోతియఏవం వేదేత్యుపనిషత్.

ఆదిత్యః వై = ఆదిత్యుడే, తేజః = దీప్తియు, ఓజః = బలకారణుడున్ను, బలం = శరీరశక్తియు, యశః = కీర్తియు, శ్రోత్రం = రెండుచెవులున్ను, ఆత్మా = దేహమున్ను, మనః = మనస్సున్నూ, మన్యుం = కోపమున్ను మనుః = వైవస్వతాది మనువులున్ను మృత్యుః- యముడున్ను, సత్యః = సత్యుడను దేవతయు, మిత్రః = మిత్రుడనే దేవతయు, వాయుః ఆకాశః = వాయువు, ఆకాశములను భూతములన్ను, ప్రాణః = ప్రాణమున్నూ, లోకపాలః = ఇంద్రాదిలోకపాలురున్నూ, కః = ప్రజాపతియు, కిం = అనిర్వచనీయమున్నూ, కం = సుఖమున్ను, తత్ = పరోక్షమైనదియును, సత్యం = యదార్థభాషణమున్ను, అన్నం = అన్నమున్నూ, అమృతః = దేవతాసమూహము (లేక) మోక్షమున్నూ, జీవః = సమస్త జీవకోటియు, విశ్వః = జగత్తంతయు (లేక) విశ్వతైజసప్రాజ్ఞులున్ను, కతమః = అత్యంతసుఖమున్ను, స్వయంభూః = ఉత్పత్తి వినాశములేని బ్రహ్మయు, ఏతత్ = ఇది యంతయు (ఆదిత్యుడే), అమృతః = నిత్యుడగు, ఏషః = ఈ ఆదిత్యుడే, పురుషః = పూర్ణుడు కావున పురుషుడు, ఏషః = ఈ ఆదిత్యుడే, భూతానాం = భూతములకు, అధిపతిః = ప్రభువు, యః = ఎవ్వడు, ఏవం = ఈ విధముగా, వేద = ఉపాసించుచున్నాడో, (సః = వాడు), బ్రహ్మణః = హిరణ్యగర్భుని యొక్క, సాయుజ్యం= సహభావమును అనగా తాదాత్మ్యమును, సలోకతాం = సాలోక్యమును (హిరణ్యగర్భునిలోకమున నివసించుట), అప్నోతి = పొందుచున్నాడు ఏతాసాం = ఈ, దేవతానాం = భూరాది దేవతల యొక్క సాయుజ్యం = సాయుజ్యమును గానీ, సార్ష్టితాం = సమాన ఐశ్వర్యత్వమును గానీ, సమానలోకతాం = వారిలోకములోసమానమైన లోకమును పొందుటగాని, అప్నోతి = పొందుచున్నాడు, ఇతి = ఈ విధముగా, ఉపనిషత్ = ఉపనిషద్రహస్య భూతమగు విద్య (సమాప్తిని పొందినది)

16. షోడశోఽనువాకః -

| | | |
|---|---|---|
| నిధన పతయేనమః | – | నిధనపతాంతికాయనమః |
| ఊర్ధ్వాయనమః | – | ఊర్ధ్వలింగాయనమః |
| హిరణ్యాయనమః | – | హిరణ్యలింగాయనమః |
| సువర్ణాయనమః | – | సువర్ణలింగాయనమః |
| దివ్యాయనమః | – | దివ్యలింగాయనమః |
| భవాయనమః | – | భవలింగాయనమః |
| శర్వాయనమః | – | శర్వలింగాయనమః |
| శివాయనమః | – | శివలింగాయనమః |
| జ్వలాయనమః | – | జ్వలలింగాయనమః |
| ఆత్మాయనమః | – | ఆత్మలింగాయనమః |
| పరమాయనమః | – | పరమలింగాయనమః |

ఏతత్ సోమస్యసూర్యస్యసర్వలింగగ్ంస్థాపయతి పాణి మంత్రం పవిత్రం.

నిధన పతయే = (కుబేర రూపమను) అతిశయమైన ధనమునకు ప్రభువగు (పార్వతీ పతికొఱకు) నమః = నమస్కారము. నిధనప+త+అంతికాయ = నిధనప = అతిశయమైన ధనమునకు అధిపతి అయిన, త = (ఆ ధనమును) భక్తులకు కలుగుజేయునట్టియు, అంతికాయ = (భక్తులకు) సమీపమున యుండు వాడును అగు (పార్వతిపతి కొఱకు) నమస్కారము నమః ఊర్ధ్వాయ = ఊర్ధ్వలోకములందు దేవతారూపమన యుండు నట్టి, నమః, ఊర్ధ్వలోకములందు దేవతారూపమున యుండు నట్టి. నమః, ఊర్ధ్వలింగాయనమః = ఊర్ధ్వలోకములందు లింగాకారమున పూజింపబడునట్టి నమః

హిరణ్యాయనమః = (సర్వాత్మకుడు కావున) స్వర్ణ రూపుని కొఱకు, హిరణ్య లింగాయనమః = సువర్ణనిర్మితలింగాకారముగల వానికి, సువర్ణాయనమః = మంచి కాంతిగలవాని కొఱకు, సువర్ణలింగాయనమః = మంచి కాంతిగల వెండితో చేయబడిన లింగమునకు, దివ్యాయనమః = ద్యులోకసుఖ స్వరూపుడు, దివ్యలింగాయనమః = ఇంద్రాదిదేవతల చేత ద్యులోకమున ప్రతిష్ఠింపబడిన లింగాకారముగలవానికి, భవాయనమః = సంసారరూపుడు, భవత్యుత్పద్యతే

బ్రహ్మాండం యస్మాదితి భవః = ఎవని వల్ల బ్రహ్మాండము పుట్టుచున్నదో - అతడు భవుడు, భవలింగాయనమః, భవులు అనగా జీవులు, వారిచే పూజకొఱకు ప్రతిష్ఠింపబడినవారు, శర్వాయనమః = ప్రళయే హినస్తి శర్వః = ప్రళయకాలమునందు బ్రహ్మాండమును సంహరించువాడు శర్వలింగాయ నమః = శం = మహత్సుఖం వాతి గచ్ఛతీతి శర్వః = గొప్పసుఖమును పొందించునది శివలింగము కళ్యాణ ప్రదము శివాయనమః = మంగళ స్వరూపుడైన శివునికి శివలింగాయనమః = కళ్యాణమూర్తి అయిన శివునిక. జ్వలాయనమః = జ్యోతిర్మయుడు కావున ప్రకాశించు శివునికి జ్వలలింగాయనమః = భూలోకములోని ద్వాదశ జ్యోతిర్లింగస్వరూపునికి ఆత్మాయనమః = సకల జగదాత్మకుడైన శివునికి, ఆత్మలింగాయనమః = లీనం = సురనరాది సర్వప్రాణిగుహాసు గోపితం బ్రహ్మ వేదాన్త రూపేణ గమయతి జ్ఞాపయతీతి – లింగః – దేవమనుష్యాది సర్వజంతువుల గుహలయందు గుప్తమైయుండు బ్రహ్మమును వేదాంతరూపముగ తెలుపునట్టివాడు లింగడు = అట్టిశివునికి, పరమాయనమః = పరముడు, ఎవనికంటే శ్రేష్ఠమైనది కానీ, శ్రేష్ఠుడైన వాడు కానీ లేడో – అతడు, పరమలింగాయనమః = ప+ రమ+ లింగడు = ప= జగమును రక్షించుచువాడు, రముడు = మోక్షసామ్రాజ్యమునరమించువాడు, లింగం = లీనం విలీనం అపి సర్వజ్ఞత్వాద్ధఫ్పత్యవగచ్ఛతిజానాతీతి – లింగః లీనమైన దానిని సర్వజ్ఞుడు కావున తెలిసుకొనిడి వాడు. లింగడు – ఏతత్ = ఈ మంత్రములచేత, పాణిమంత్రం = అవయవ భూతములైన వేద మంత్రములు కలిగినట్టియు, పవిత్రం = పాపులను కూడ పునీతుల చేయునట్టియు, సోమస్య సూర్యస్య = సూర్యచంద్రాది దేవతలందరి యొక్క, సర్వలింగం = సక[illegible]ధములగు లింగములను, స్థాపయతి = స్థాపించుచున్నారు

(ప్రతిదినము పార్థివలింగ పూజ చేసికొనునట్టి సమయమున వినియోగింపబడునట్టియు, జపమాత్రముచేత పాపక్షయ మొనర్చునట్టియు, శివాలయమందు లింగ ప్రతిష్ఠసమయము నందును, పఠించబడు పార్వతీ పతియొక్క నమస్కారబోధక మంత్రములు – ఇవి

## 17 – సప్త దశో ఽను వాక

సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః భవేభవే నాతి భవే భవస్వమాం భవోద్భయనమః – (మహాదేవుని యొక్క పశ్చిమ వక్త్రమును,

జ్ఞానోత్పత్తి నిమిత్తము (ప్రతిపాదించుచున్నాడు)

సద్యోజాతం = సత్యోజాతమను పేరుగల ఏ పశ్చిమ వక్త్రము కలదో తద్రూపముగల పరమేశ్వరుని, ప్రపద్యామి = శరణు బొందెదను సద్యోజాతాయ = అట్టి సద్యోజాతుని కొఱకు నమః నమః వై = మాటిమాటికి నమస్కారమగు గాక (ఓ సద్యో జాత వక్త్రమా!) భవే భవే = ఆయాజన్మనిమిత్తము, మాం = నన్ను నభవస్వ = ప్రేరేపింపవలదు అతిభవే = జన్మాతి క్రమణమందు; భవస్వ = ప్రేరేపింపుము, భవోద్భవాయ = సంసారము నుండి ఉద్ధరించునట్టి, సద్యో జాతునికొఱకు, నమః = నమస్కారము

18 – అష్టాదశోఽను వాకః.

వామదేవాయనమో జ్యేష్ఠాయనమశ్శ్రేష్ఠాయనమో రుద్రాయనమః కాలాయనమః కలవికరణాయ నమో బలవికరణాయనమో బలయానమో బల ప్రమథనాయ నమ స్సర్వభూతదమనాయనమో మనోన్మనాయ నమః. (ఇది ఉత్తర వక్త్ర ప్రతి పాదకమగు మంత్రము).

వామ దేవాయ = సుందరమయి ప్రకాశించుచున్న) (ఈశ్వరుని యొక్క ఉత్తర) వక్త్రము కొఱకు, నమః = నమస్కారము, జ్యేష్ఠాయ = అన్నింటికి ముందు పుట్టినట్టినది గనుక జ్యేష్ఠమైన ఉత్తరముఖమునకు, నమః = నమస్కారము, శ్రేష్ఠాయ = ఇంతకంటే మరొకటి లేదు కాబట్టి శ్రేష్ఠమైన (అఉత్తరముఖమునకు) నమః = నమస్కారము, రుద్రాయ = ప్రళయ కాలమునందు అందరినీ రోదింపజేయు(అవక్త్రమునకు) నమః = నమస్కారము, కాలాయ = (కావుననే) సర్వప్రాణులయొక్క ఆయుః క్షయహేతువగుట వలన కాలస్వరూపమగు (ఆముఖమునకు) నమః = నమస్కారము, కలవికరణాయ = కల = సుఖమును స్వీకరించునది వికరణము = వివిధమైన జగత్తును (చేయునది) (ఇట్టిదానికొఱకు) నమః = నమస్కారము, బలవికరణాయ = (రాక్షసుల) బలమును హింసించునట్టి (ఆముఖమునకు), నమః నమస్కారము, బలాయ = సకలశక్తులకు స్థానమగుట చేత బలరూపమగు ఆముఖమునకు) నమః = నమస్కారము బలప్రమథనాయ = స్వేచ్ఛగా సకల శక్తులను ఉపసంహారము (చేసుకొనునట్టి దాని కొఱకు) నమః = నమస్కారము,

సర్వభూతదమనాయ = సకల భూతములను శిక్షించునట్టి (ఆముఖము కొఱకు), నమః = నమస్కారము, మనోన్మనాయ = అంతయు ఎఱుగునట్టి (ఆముఖమునకు) నమః = నమస్కారము

19 = ఏకోనవింశో2ను వాకః,

అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో, ఘోరఘోరతరేభ్యః !
సర్వేభ్యస్సర్వశర్వేభ్యోనమస్తే అస్తురుద్రరూపేభ్యః.
(ఇది దక్షిణ వక్త్ర ప్రతిపాదకమగు మంత్రము).

సర్వ = సర్వాంతర్యామివగు ఓ పరమేశ్వరా ! అఘోరేభ్యః ఘోరములు గాక శాంతములైనట్టియు, ఘోరేభ్యః = ఘోర (ఉగ్ర) ములైనట్టియు, తే = నీ యొక్క, ఘోరఘోరతరేభ్యః = మిక్కిలి ఉగ్రతరములైనట్టియు, శర్వేభ్యః = లయకాలమునందు హింసించునట్టి, సర్వేభ్యః = సమస్తములైన, రుద్రరూపేభ్యః = రుద్రరూపములకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక.

20 = వింశోఽను వాకః

తత్పురుషాయ విద్మహే మహాదేవాయధీమహి
తన్నోరుద్రః ప్రచోదయాత్.
(ప్రాగ్వక్త్ర ప్రతిపాదక మంత్రము)

ప్రాగ్వక్త్ర దేవత తత్పురుషుడను నామముగలవాడు అట్టి తత్పురుషాయ = తత్పురుషుడను దేవుని, విద్మహే = గురూపదేశ శాస్త్రాధ్యయనము వలన ఎఱుగుచున్నాము. (అట్లు తెలుసుకొని), మహా దేవాయ = ఆ మహాదేవుని, ధీమహి = ధ్యానించు చున్నాము, తత్ = ఆకారణమువలన, రుద్రః = ఆ రుద్రుడు, నః =మమ్ములను, ప్రచోదయాత్ = జ్ఞానధ్యానార్థము ప్రేరేపించుగాక

21. ఏకవింశోఽనువాకః.

**ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వ భూతానాం**
**బ్రహ్మాధిపతి బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మ శివో మే**
**అస్తుసదాశివోమ్.( ఊర్ధ్వవక్త్ర ప్రతిపాదకమగు మంత్రము).**

**ఊర్ధ్వ** వక్త్రాధిపతియగు దేవుడెవడు. [illegible] సర్వవిద్యానాం = విద్యలకన్నింటికీ = ఈశానః = [illegible] సర్వభూతానాం = అఖిల ప్రాణులకు, ఈశ్వరః = నియామకుండును, బ్రహ్మాధిపతిః = వేదములకు పాలకుండు. **బ్రహ్మణః** = హిరణ్యగర్భునకు, అధిపతిః = అధిపతి అయినవాడు, బ్రహ్మ = ప్రవృద్ధి గల పరమాత్మ, మే = నాకు, శివః = మంగళకరుడు, అస్తు = అగుగాక, సదా శివః = ఆసదా శివుడు, ఓమ్ = అగుచున్నాను.

22 ద్వావింశోఽనువాకః

**నమోహిరణ్యబాహవే, హిరణ్యవర్ణాయ, హిరణ్యరూపాయ**
**హిరణ్యపతయే ఉమ్బికాపతయ, ఉమాపతయే పశుపతయే నమో నమః.**
(ఇది శివదేవతా సంబంధమగు మంత్రము).

**తా** = సువర్ణమయమైన బాహువులు ఇతర అవయవములు కల వాడును, బంగారువలె దుర్లభములగు వేదాక్షరములు గల వాడును, తేజోరూపుడును, నవనిధుల కధిపతి అయిన వాడును, పార్వతీ పతియును, అగు పరమేశ్వరునకు నమస్కారము ఉమాపతికినీ పశువులకు = బ్రహ్మాద్యాః స్తంబపర్యంతాః పశవః పరికీర్తితాః, తేషామినాయకోయస్మాచ్ఛివః పశుపతిస్మృతః = ఆ బ్రహ్మస్తంబపర్యంతభూతములకు నాయకుడగు ఈశ్వరునకు, నమస్కారము, నమస్కారము. ఉమా = ( కాళిదాసు, ఉమేతి మాత్రాతపసోనిషిద్ధా పశ్చాదుమాఖ్యాం.

సుముఖీజగామ, ఉ = ఓ అమ్మాయీ ! మా = (తపస్సు) వలదు అని పార్వతిని ఆమె తల్లి వేడుకొనినది. అందుచేత ఆమె ఉమగా పేరు పొందెను.
{హిరణ్యబాహవేనమః హిరణ్యవర్ణాయనమః - హిరణ్యరూపాయ నమః, హిరణ్య పతయేనమః - అంబికా పతయే నమః, ఉమా పతయేనమః, పశుపతయే నమః -

అని ప్రత్యేకముగ కూడా చెప్పవచ్చును )

23 త్రయో వింశో2ను వాకః-

ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ, పురుషం కృష్ణ పింగళమ్
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమోనమః-

పరంబ్రహ్మ = శ్రేష్ఠమగు బ్రహ్మము, ఋతం సత్యం = హిరణ్యగర్భరూపము అగు వ్యావహారిక బ్రహ్మము గాక పారమార్థిక సత్యము ( బ్రహ్మ = బ్రహ్మము) ( భక్తాను గ్రహార్థము) కృష్ణపింగళం = కృష్ణ పింగళాకారమగు ( ఉమామహేశ్వరాత్మక స్త్రీపురుషరూపము కలిగియున్నది మహేశ్వరుడు కృష్ణవర్ణమున్ను, ఉమా సంబంధమైన వామ భాగము పింగళ వర్ణము ) ఊర్ధ్వరేతం = ఊర్ధ్వరేతస్కుడును, విరూపాక్షం = మూడుకన్నులు కలిగియుండుటచే విరూపాక్షుడును అగు పరమేశ్వరుని భావించి, విశ్వరూపాయ = సర్వజగదాత్మకుడగు ఆపురుషుని కొఱకు, నమోనమః = నమస్కారము, నమస్కారము - (ఆదరము కొరకు రెండు సార్లు చెప్పుట)

24 చతుర్వింశో2ను వాకః

సర్వోవై రుద్ర స్తస్మై రుద్రాయనమో అస్తు । పురుషోవై రుద్ర స్సన్మహో నమోనమః । విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానంచ యత్ సర్వో హ్యేష రుద్రస్తస్మై రుద్రాయ నమో అస్తు -

రుద్రుడే సమస్తము అయి ఉన్నాడు. అట్టి రుద్రునికి నమస్కారము అగుగాక । పురుషుడే రుద్రుడు కదా । సన్మహః = సద్రూపమైన తేజమునకు నమస్కారము, నమస్కారము ఏ జడాత్మకమగు విశ్వము కలదో, ప్రాణిజాతమునకు ఆత్మగానున్నదో, చేతనా చేతనా రూపమైన విచిత్రమైన జగత్తున్నూ, అనేక విధములుగా పుట్టినట్టియు, పుట్టు బోవునట్టియు, సర్వం ఈ రుద్రుడే కదా । అందు చేత రుద్రునకు నమస్కారము ( శివుని అష్టమూర్తిత్వాన్ని ప్రతి పాదించుచున్నారా).

25 పంచవింశోను వాకః –

కద్రుద్రాయప్రచేతసే, మీఢుష్టమాయతవ్యసే
వోచేమ శన్తమగం హృదే । సర్వో హ్యేష రుద్రస్తస్మై
రుద్రాయ నమో అస్తు –

ప్రచేతసే = శ్రేష్ఠమైన జ్ఞానము కలిగినట్టివాడును, మీఢుష్ట మాయ = భక్తుల అభీష్టములనొసగువాడును, తవ్యసే = కొనియాడదగిన వాడును, హృదే = హృదయాంతర్వర్తి యగుటచే హృద్రూపుడును, అగు, కద్రుద్రాయ = శ్రేష్ఠుడగు రుద్రుని కొఱకు, శంతమం = సుఖకరమగు స్తుతి రూపవాక్యమును వోచేమ = చెప్పుచున్నారము సర్వః = ఈ సమస్తము, ఏష రుద్రః = ఈ రుద్రుడే, తస్మై = అట్టి, రుద్రాయ = రుద్రునికొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక।

26. షడ్వింశోఽనువాకః

యస్యవైకఙ్కత్యగ్ని హోత్రహవణీ భవతి ప్రత్యేవాస్యా
ఽఽహుత యస్తి ష్ఠన్యథో ప్రతిష్ఠిత్యై

(అగ్నిహోత్ర హవణి అను సాధనమును ఏ వృక్షముతో చేయవలయునో చెప్పుచున్నారు)
తా = అగ్నిహోత్రమందు (వికంకతము) = పుల్లవెలగచెట్టుకొయ్యచే, చేయబడిన హోమ సాధన పాత్ర చేత యుంచబడినచో యజమానుని సంబంధమైన ఆహుతులు ఆ యజమానుని స్థితి కొఱకు సమర్థములగుచున్నవి

27 – కృణుష్వపాజఇతిపఞ్చ –

కృణుష్వపాజః అనుఋక్కుమొదలుగాగల ఐదు మంత్రములు తైత్తిరీయ సంహిత ప్రథమ కాండ ద్వితీయ ప్రశ్నమందు కలవు వాటిని ఇటపఠింపవలెను

కృణుష్వపాజః ప్రసితంనప్పృథ్వీం I యాహి రాజేవా
మవాగ్ ఇభేన I తృష్వీమనుప్రసితిం ద్రూణానో
ఽస్తాఽసి విద్య రక్ష సస్త పిష్ఠైః.(1)

ఓ అగ్నీ I నా కామ క్రోధాది శత్రు సంహరమునకై, పృథ్వీం = విస్తారమైన, ప్రసితింన = జాలమువలె, పాజః = బలమును, కృణుష్వ = ( మాకు) కలుగుజేయుము, రాజేవ = రాజువలె, అమవాన్ = సేవకులు గలవాడ్వై, ఇభేన = గజతురగాది చతురంగ బలములతో, యాహి = ( శత్రుసంహారార్థము) పొమ్ము, తృష్వీం = శీఘ్రముగా సంహారసాధనమగు ప్రసితిం = జాలముచేత, అనుద్రూణానః = పలాయన కాలమునందు శత్రువులను హింసించుచున్న వాడ్వై, అస్తా = బాణములు వేయువాడవు అసి = అయితిరి, తపిష్ఠైః = మిక్కిలి సంహార హేతువలగు ఆయుధముల చేత, రక్షసః = రాజాలను, విధ్య = తాడనము చేయుము.

తవ భ్రమాసఆశుయాపతం త్యనుస్పృశ ధృషతాశోశుచానః I తపూగ్ ష్యగ్నేజూహ్వాపతంగాన సందితో విసృజ్య విష్వగుల్కాః – (2)

అగ్నే = ఓ అగ్నీ భ్రామాసః = ప్రాణుల పీడించుటకై అంతట చరించు చున్నట్టియు, అశుయా = రాత్రింపగళ్ళు సంచరించుచున్నట్టియు (ఏ పిశాచములు) పతంతి = అటు ఇటు తిరుగు చున్నవో ( అట్టి „ పతంగాన్ = పతన శీలములగు అట్టి పిశాచములను, తపూంషి = ప్రపంచమును తపింపచేయునట్టి ఆ రాక్షసులను, ధృషతా = ప్రగల్భమైన నీ తేజస్సుచేత, అనుస్పృశ = దహింపుము, శోశుచానః = లేక అంతర్బహిశ్శత్రువులను మిక్కుటముగ దుఃఖింపజేయుచు, జుహ్వా = జుహువుచేత (హోమము చేయబడు) హవిస్సుతచేత, అసందితః = రాక్షసులచేత ఖండింపబడని వాడవై, విష్వన్ = మాటి మాటికి, ఉల్కాః = అగ్నిజ్వాలలకు విసృజ = ప్రసరింపజేయుము

ప్రతిస్పశో విసృజ తూర్ణిత మోభవా పాయుర్విశో అస్యా అదబ్ధః యోనోదూరే అఘశ్యంసోయో అంత్యగ్నే మాకిష్టేవ్యధిరాదధర్షీత్ – (3)

అగ్నే = ఓ అగ్నీ I తూర్ణితమః = అతిశీఘ్ర గాముడవగు నీవు, స్పశః = పాపములను,

ప్రతి = శత్రువులను గూర్చి), విస్పజ = వదలుము అస్యాః = ఈ మాయొక్క, విశః = పుత్రపౌత్రాది సంతానమునకు, పాయుః = రక్షకుడవు, భవ = కమ్ము, యః = ఎవడు, నః మాకు, దూరే = దూరమందును, అంతి = సమీపమునందును, అఘశం సః = పాపము చేయనిశ్చయించిన వాడు కలడో (వానినిపో గొట్టుము) అదబ్ధః = నేను శత్రువుల చేత హింసింపబడనివాడను అయ్యెదను గాక, వ్యథిః = వ్యథనుకలుగజేయునట్టి (రాక్షసుడు), కిం = ఎవ్వడున్నా, మా +ఆ+ దధర్షీత్ = సమర్థమైన వాడు కాక పోవును గాక, అగ్నిదర్శనము రాక్షస పిశాచ పలాయన హేతువని నీతి శాస్త్రమున కలదు – (శ్లో) = దివాసూర్యప్రతాపేన రాత్రౌవహ్ని ప్రతాపతః పిశాచరాక్షసాదీనాం దూరతస్తు పలాయనం। తస్మాద్రాత్రౌ మనుష్యాణాం వనేమార్గే గృహేపివా వహ్నిసేవన మహాత్మ్యమత్పిశాచాది పలాయనమ్

**ఉదగ్నేతిష్ఠప్రత్యాతనుష్వ । న్యమిత్రాగ్ం । ఓషతాత్తి గ్మహేతే । యోనో అరాతిగ్ం సమిధాన చక్రే నీచాతం ధక్ష్యత సంనశుష్కమ్ – 4.**

అగ్నే = ఓ అగ్నీ, ఉత్తిష్ఠ = (మమ్ములనను గ్రహించుటకై) లెమ్ము, ప్రతి = మమ్ములగూర్చి, ఆ + తనుష్వ = దయచేయు ము అమిత్రాన్ = శత్రువులను, నిఓషతాత్ = మిక్కిలి భస్మీభూతులుగా చేయుము తిగ్మహేతే = తీక్షణములైన ఆయుధములు గలట్టియు, సమిధాన = ప్రజ్వరిల్లు చున్న ఓ అగ్నీ। యః = ఎవ్వడు, నః = మాకు అరాతిం = శత్రుత్వమును, చక్రే = చేసెనో, తం = వానిని, శుష్కం అతి సంన = ఎండిన వృక్షమువలె, సందక్షి = దహింపుము (మరియు) నీచా = (నరక మార్గమును) పొందించుము

**ఊర్ధ్వోభవ ప్రతి విధ్యాధ్యస్మ । దావిష్కృణుష్వ దైవాన్యగ్నే । అవస్థిరా తను హియాతుజూనాం । జామి మజామిం ప్రమృణి హి శత్రూన్ ।**

అగ్నే = భగవానుడవుగు ఓ అగ్నీ, అధి అస్మత్ = మా యొక్క (కామాది శత్రు సంఘమును), ప్రతి + విధ్య = తాడనమొనర్చుము దైవ్యాని = దేవతా సంబంధములగు సత్కర్మలను (సముదాయములను) అవిఃకృణుష్వ = ఆవిష్కరింపజేయుము (కలుగ జేయుము) ఊర్ధ్వః = ఊర్ధ్వలోకప్రదుడవు, భవ = కమ్ము, యాతు జూనాం = రాక్షసుల యొక్క, స్థిరా = స్థిరములగు ధనుస్సులను,

అవ + తనుహి = దింపిన నారి ( అల్లె త్రాడు) గలవానినిగా జేయుము, జామిం = ఆలస్యమును (విడిచి) ప్రమృణీహి = నాశమొనర్పుము, అజామిం = ఆలస్యము లేకుండ, శత్రూణ్ = శత్రువులను, ప్రమృణీహి = హింసింపుము (ఈ ఐదు మంత్రముల సారము)

ఓ అగ్నీ ! మా సంబంధమగు అంతర్బహిశ్శత్రు సంఘముల నిర్మూలము గావించి, మమ్ము్మలను మంచి పనులయందు ప్రవర్తింప జేసి, మా అంతః కరణమును నిర్మలమొనర్చి, నూరు సంవత్సరములు పుత్రపౌత్ర పారం పర్యముగా మాకు అన్నపానాదుల నిచ్చి, మరణానంతరము సకుటుంబముగా ముక్తి నిమ్ము

28 అష్టా వింశోఽను వాకః.

అతిర్దేవా గంధర్వావమనుష్యాః పితరోసురాస్తే షాగ్ సర్వ భూతానాం మాతామేదినీ మహతామహీసావిత్రీ గాయత్రీ జగత్యుర్వీపృథ్వీ బహులా విశ్వాభూతా కతమాకాయాసా సత్యేత్యమృతేతి వసిష్ఠః.

( జీవన హేతువగు క్షేత్రలాభము మున్నగు వానిని కలుగజేసి క్రమముగ ముక్తి నొసంగు భూదేవతను గూర్చిన మంత్రము )

అదితి = అఖండమైనది, భూమియే, దేవతలకు దానవులకు గంధర్వులకు, మనుష్యులకు, పితరులకు సర్వప్రాణులకు ఈ అదితియే జనని, మేదిని = (మధుకైటభుల మేధస్సు నుండి పుట్టినది) గొప్పది, పూజనీయురాలు, సావిత్రి (ప్రేరకుడగు అంతర్యామి సంబంధముకలది,) గాయత్రి = (తనను పాసించు వారల రక్షించునది) జగతీ = జగదాశ్రయ భూతమైనది. ఉర్వీ = సకలధాన్య పరిపూర్ణ మైనది, పృథ్వీ = అతివిస్తారమైనది బహులా = అంతటా నిండియున్న అవయవములు గలది విశ్వా = సర్వాత్మకమైనది, భూతా = ప్రాణిదేహోత్పత్తికి పూర్వమే యుండునది, కతమా = అతిశయసుఖరూపమైనది కాయా = సర్వప్రాణి దేహరూపమున పరిమితమైనది – ఆ, సత్యా = వ్యవహార దశయందు బాధలేనిది, నాశములేనిది, అని వసిష్ఠమహర్షి పలికెను

29. ఏకోనత్రింశో ఽనువాకః

ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావాఆపః పశవ ఆపో ఽమృత మాపోన్న మాప స్స మ్రాడాపో విరాడాప స్వరాడాపశ్ఛందాగ్ స్యాపోజ్యోతిగ్ం ష్యాపస్సత్యమాపస్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్

ఈ కనబడునదంతయు, శరీరములన్నియు, ప్రాణములు, పశువులు, అన్నము, అమృతము, సమ్రాట్ = (సూత్రాత్మ) యగు హిరణ్యగర్భుడు), విరాట్ = (బ్రహ్మాండమే దేహముగా గల పురుషుడు) స్వరాట్ = (స్వయముగా ప్రకాశించు ఈశ్వరుడు) గాయత్ర్యాది ఛందస్సులు (వేదములు) అదిత్యాది జ్యోతులు, యజుర్మంత్రములు, సత్యం = (యథార్థకథనము), దేవతలందరు, భూర్భువస్సువర్లోకములు - (అన్నియు) జలములే కదా! ఓం కారస్వరూపమయిన పరమాత్మ కూడా జలమే (వర్షాభావమువలన కలుగు పీడను పోగొట్టుటకు జలదేవతాను గ్రహము కొఱకు చెప్పు మంత్రము)

30. త్రింశో ఽనువాకః -

ఆపః పునంతుపృథివీం, పృథివీపూతాపునాతుమామ్. పునంతు బ్రహ్మణస్పతిర్బ్రహ్మ పూతా పునాతుమాం। యదుచ్ఛిష్టమభోజ్యం యద్వా దుశ్చరితంమమ। సర్వం పునంతు మామాపో ఽసతాంచ ప్రతి గ్రహగ్గ్స్వాహా.

ఈ జలములు భూమిని ప్రక్షాళనచేత పవిత్రముగా జేయునుగాక భూమి పవిత్రమైనదై నన్ను పరిశుద్ధునిగా చేయుగాక, ఈ జలములు వేదములకు పాలకుడగు ఆచార్యుని పవిత్రునిగా జేయుగాక, బ్రహ్మ = ఆచార్యో పదిష్టమగు వేదము స్వయముగా పరిశుద్ధమైనదైనన్ను పరిశుద్ధునిగా జేయుగాక ! ఎంగిలి అన్నము, అభోజ్యమైన అన్నాదికమును (వెంట్రుకలు, పురుగులు, పెంటికలు కల అన్నము) భుజింపబడియుండిననూ, లేక నా చేత చెడ్డపనులు చేయబడి యుండిననూ, ఆ సమస్తమును ఈ జలములు పోగొట్టి, అసతాం = దుర్మార్గులనుండి ప్రతిగ్రహణము చేసి యుండినదానిని పోగొట్టుగాక। స్వాహా = నా ముఖాగ్నియందు (ఈ జలరూప ఆహుతి) సుహుతమగుగాక!

(మాధ్యాహ్నిక సంధ్యయందు మంత్రాచరణము చేయవలసిన మంత్రము ఆచమనీయము చేయవలయును

31 = ఏక త్రింశఌను వాకః.

అగ్నిశ్చ, మామన్యుశ్చ, మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపే భ్యోరక్షన్తాం యదహ్నాపాప మకార్షం । మనసా వాచాహస్తాభ్యాం । పద్భ్యముదరేణ శిశ్నా । అహస్తదవలు మ్పతు । యత్కిఞ్చదురితంమయి । ఇదమహం మామమృత యోనౌ । సత్యేజ్యోతిషి జుహోమిస్వాహా -

అగ్నియును, మన్యుఃవ = కోపము అభిమానముగా గల దేవతయును, కోపమునకుని యామకులగు దేవతలును, నన్ను కోపము చేత చేయబడిన పాపములనుండి రక్షించెదరు గాక! గడచిన పగటి కాలమందు, మనస్సుచేత, వాక్కు చేతను, చేతులచేతను, పాదములచేతను, ఉదరము చేతను, గుహ్యేంద్రయముచేతను ఏ పాపమును చేసియుంటినో, నాయందు ఏ పాపము కలదో దానినంతయు దివాభిమానియగు దేవత అవలుంపతు = నశింపజేయుగాక । నేను ఈ పాపసమూహము నంతయు, లింగస్వరూపుడగు నన్నును, మరణరహితమై జగత్కారణ భూతమైనట్టిదియు, సత్యే = కాలత్రయా భాద్యుడైనట్టియు, జ్యోతిషి = స్వయం ప్రకాశమగు వస్తువునందు హుతము చేయుచున్నాను స్వాహా (తదర్థమభిమంత్రతి మగు ఈ జలము నాముఖాగ్ని యందు) సుహుతమగు గాక! (ఇది సాయం సంధ్యామంత్రాచమన మంత్రము)

32. ద్వాత్రింశఌను వాకః

సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చమన్యుకృతేభ్యః పాపేభ్యోరక్షన్తాం। యద్రాత్రియా పపమకార్షం। మనసా వాచా హస్తాభ్యాం। పద్భ్యముదరేణ శిశ్నా ।రాత్రి స్తదవలు మ్పతు । యత్కిఞ్చదురితంమయి । ఇదమహం మామమృతయోనౌ । సూర్యే జ్యోతిషిజుహోమిస్వాహా (ఇది ప్రాతస్సంధ్యా మంత్రాచమన మంత్రము)

31వ అనువాకములోని మంత్రము వంటిదే, సత్యమునకు బదులు సూర్యుడనియు

అహస్సునకు బదులు రాత్రి అనియు మార్పులున్నవి

33 త్రయస్త్రిం శోఽను వాకః.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా । బ్రహ్మఇత్యార్షం ।
గాయత్రం ఛన్దం । పరమాత్మం సరూపం ।సాయుజ్యం వినియోగమ్

ఓం ఇతి = ఓం అను, ఏకాక్షరం = ఒక అక్షరమే, బ్రహ్మ = బ్రహ్మము, అగ్నిః = అగ్ని, దేవతా = దేవత, బ్రహ్మ = బ్రహ్మము, అర్షం = ఋషి, గాయత్రం = గాయత్రము, ఛందం = ఛందస్సు.

పరమాత్మ = పరమాత్మలక్షణమైనట్టియు, సరూపం = సర్వజగత్స్వరూపమైనట్టియు, సాయుజ్యం = పరబ్రహ్మ ప్రాపిగియు, వినియోగః = వినియోగము.
(ప్రాణాయామాదికమునందు అవశ్యమగు ప్రణవమునకు ఋష్యాదికము ఈ మంత్రములో చెప్పబడుచున్నది) (ఈ మంత్రమును సాయనాచార్యుడు గానీ భట్టభాస్కరుడు గానీ పేర్కొనలేదు)

34. చతుస్త్రింశోఽను వాకః –

ఆయాతు వరదాదేవి । అక్షరం బ్రహ్మ సమ్మితమ్ । గాయత్రీం ఛన్దసాం మాతేదం బ్రహ్మ జుషస్వమే. యదహ్నాత్ కురుతే పాపం తదహ్నాత్ ప్రతి ముచ్యతే యద్రాత్రియాత్ కురుతే పాపం తద్రాత్రియాత్ ప్రతి ముచ్యతే । సర్వవర్ణే మహాదేవి సంధ్యావిద్యేసరస్వతి.

వరదా = భక్తులకు వరములనిచ్చునట్టి, దేవీ = గాయత్రిదేవీ, అక్షరం = నాశరహితమును, సమ్మితం = వేదాంతప్రమాణనిశ్చితమును అగు, బ్రహ్మ = జగత్కారణముగు బ్రహ్మమును గూర్చి ఆయాతు = మా సమీపమునకు వచ్చుగాక । ఛందసాం = గాయత్ర్యాది చంద్రస్సులకు (లేక) వేదములకు, మాతా = తల్లియగు, గాయత్రిం = గాయత్రీ దేవత, మే = నాకు, ఇదం = ఈ, బ్రహ్మ = బ్రహ్మత్వమును జుషస్వ = ఉపదేశించుగాక । సర్వవర్ణే = సకలాక్షర స్వరూపిణియు, సంధ్యా విద్యే

= సంధ్యాను ష్ఠాన రూపిణియు, మహా దేవి = మిక్కిలిగా ప్రకాశించుచున్నట్టియు, సరస్వతి స్వరూపిణివియునగు ఓ గాయత్రీ ! అహ్నాత్ = పగటిపూట, యత్ పాపం = ఏ పాపమును కురతే = నేను చేయుచున్నాడనో, తత్ = ఆ పాపము, అహ్నాత్ = ఆ పగటియందే, ప్రతిముచ్యతే = నన్ను వదలి పోవు గాక, యత్ = ఏ పాపమును, రాత్రియాత్ = రాత్రియందు, కురుతే = చేయుచున్నాడనో, తత్ పాపం = ఆ పాపము, రాత్రియాత్ = ఆ రాత్రియందే, ప్రతిముచ్యతే = నన్నువదలిపోవుగాక ! (మార్జనానంతరము సంధ్యాత్రయమునందును గాయత్ర్యావాహనము చేయునట్టి మంత్రము) – వరదాయనివైన ఓ గాయత్రీదేవీ ! వేదాంతముచే ప్రతిపాదింపబడిన పరబ్రహ్మతత్త్వమును పదేశించుటకై మా వద్దకు రమ్ము, వేదములకు తల్లివగు గాయత్రీ ! మాకు ఆ పరబ్రహ్మమును గూర్చి ఉపదేశించుము నీవు సర్వవర్ణస్వరూపిణివి నీవు సంధ్యలలో ఉపాసింపబడుదానవు నీవు సరస్వతివి నీ భక్తుడు పగటి పూట చేసిన పాపమును ఆ పగటిపూటే, రాత్రి చేసిన పాపము ఆ రాత్రే పోవునట్లు చేయుము

35 పంచత్రింశోఽనువాకః.

ఓజోఽసి, సహోఽసి, బలమసి భ్రాజోఽసి దేవానాం ధామనామాసి, విశ్వమసి విశ్వాయు స్సర్వమసి సర్వాయు రభి భూరోం ! గాయత్రీమావాహయామి, సావిత్రీమావా హయామి, సరస్వతీ మావాహయామి, ఛందర్షీనావాహ యామి శ్రియమావాహయామి.( బలమావాహయామి) గాయత్రయా గాయత్రీ ఛందో విశ్వామిత్ర ఋషిః ! సవితా దేవతా ఽగ్ని ర్ముఖం, బ్రహ్మశిరో, విష్ణుర్ హృదయగ్ం, రుద్రశ్శిఖా పృథివీ యోనిః ప్రాణాపానవ్యానోదాన సమానా సప్రాణా సాంఖ్యాయన సగోత్రా గాయత్రీ చతుర్విగం శత్యక్షరాత్రిపదా, షట్కుక్షిః పంచ శీర్ షోపనయనే వినియోగః ఓగాయత్రీ నీవు)

ఓజః = ఓజో ధాతువు, అసి = అయితివి. సహః = శత్రువులను పరాభవింపజేయునట్టి శక్తి స్వరూపిణివి అసి = అయితివి, భ్రాజః = కాంతిరూపముగల దానివి, అసి = అయితివి, దేవానాం = దేవతల యొక్క, ధామనామాసి = తేజసే పేరుగాగల దానివయితివి – విశ్వం = సర్వజగద్రూపిణివి, అసి = అయితివి విశ్వాయుః = సంపూర్ణ ఆయుః స్వరూపిణివి– అస = అయితివి సర్వం = సమస్తమును, అసి = అయితివి,

సర్వాయుః = సకలాయుస్స్వరూపిణివి, అసి = అయితివి, అభిభూః = సకలపాపముల తిరస్కరించుదానవు ( అసి = అయితివి), ఓం = ప్రణవ ప్రతిపాద్యవు (అసి = అయితివి) (అట్టి), గాయత్రీ = గాయత్రిని, అవాహయామి = (నా హృదయమునందు) ఆవహనము చేసికొనుచున్నాను, సావిత్రీం = సావిత్రిని, ఆ వాహయామి = నా హృదయమునందు ) ఆవాహనము చేసు కొనుచున్నాను సరస్వతీం = సరస్వతిని, ఆవాహయామి = ఆవాహనము చేసుకొనుచున్నాను ఛంద ర్షీన్ = సర్వఛందములను ఋషులను, అవాహయామి అవాహనము చేసుకొనుచున్నాను శ్రియం = సర్వదేవతల యొక్క లక్ష్మిని, ఆవాహయామి = అవాహనము చేసుకొనుచున్నా, గాయత్ర్యాః = గాయత్రీ మంత్రమునకు, గాయత్రి, ఛంధః = గాయత్రీ ఛందస్సు, విశ్వామిత్రఋషిః = విశ్వామిత్రుడు ఋషి, అగ్నిః = అగ్ని, ముఖం = ముఖము, బ్రహ్మ= చతుర్ముఖబ్రహ్మ, శిరః = శిరస్సు, విష్ణుః = విష్ణువు, హృధయం = హృదయము, రుద్రః = రుద్రుడు, శిఖా = శిఖ, పృధివీ = భూమి, యోనిః = యోని, ప్రాణాపాన వ్యానోదాన సమూనా సప్రాణా = ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాగేంద్రియసమన్వతమైనది, శ్వేతవర్ణా = తెల్లనిరంగు కలది, సాంఖ్యాయన సగోత్రా = సాంఖ్యాయనుని సమానమైన గోత్రము కలది, చతుర్వింశత్యక్షరా = ఇరువదినాలుగు అక్షరములు కలది

త్రిపదా = మూడు పాదములు కలది. షట్కుక్షిః = షడంగములు ( శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తి, జ్యోతిషము, కల్ప సూత్రములు) ఇవి వేదాంగములు) పంచ శీర్షా = ఐదు (వేదములు + ఇతిహాసపురాణములు) శిరములు గలది ఉపనయనే = ఉపనయనమందు, వినియోగః = వినియోగము

**ఓం భూః , ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్. ఓ మాపో జ్యోతీరసో ఉమృతం బ్రహ్మ, భూర్భుస్సువరోమ్.**

భూః మొదలుకొని సత్యం వరకును గలపదములు ఏడునూ, భూలోకము మొదలగు ఏడు లోకములను తెలుపును ఇవి వ్యాహృతులన బడును ఈ లోకములన్నియ ప్రణవమున కర్ధములగుట వలన, పరబ్రహ్మరూపములగుటను తెలుపుచున్నవి ప్రతి, పదముతోడను ఓంకారమును చేర్చి పలుకబడినది (1) భూలోకము ఓంకార

పదవాచ్యమగు పరబ్రహ్మము - ఇటులే 1 నుంచి 7 వరకు అదే అర్థము వీటిని ఉచ్చరించునపుడు గానీ, మనస్సులో తలచినప్పుడుగానీ, సర్వంఖల్విదం బ్రహ్మ = చరాచర రూపమున మనకు గోచరించునది అంతయు బ్రహ్మమే కదా ! అనిధ్యానించవలెను

(మంత్రార్థము) యః = ఏ పరమేశ్వరుడు, నః = మాయొక్క ధియః = బుద్ధి వృత్తులను, ప్రచోదయాత్ = చక్కగా తత్త్వ జ్ఞానమునందు ప్రేరేపించునో, (అట్టి), సవితుః = సర్వాంతర్యామియై వెలుగు, దేవస్య = దేవుని యొక్క, వరేణ్యం = శ్రేష్ఠమైన, భర్గః = తేజస్సును, ధీమహి = ధ్యానము చేయుచున్నారము, ఓం = ఈ మంత్రము ప్రణవ ప్రతి పాద్యము ఆపః = నదీ సముద్రాది గతములగు జలములు, జ్యోతిః = ఆదిత్య చంద్రాగ్నులందు గల తేజస్సును, రసః = మధురామ్లాది షడ్రసములు, అమృతం = దేవతాహారమగు అమృతమును, (ఇదంతయు ప్రణవ ప్రతి పాద్యమగు బహ్మ = పరబ్రహ్మము భూః, భువః, సువః = భూః భువః సువః లోకములున్న ఓం = ప్రణవ ప్రతి పాద్యములే

(ఇది గాయత్రీ ఆవాహన మంత్రము)

## 36. షట్ త్రింశోఽనువాకః.

**ఉత్తమే శిఖరే జాతే, భూమ్యాం పర్వత మూర్ధని**
**బ్రాహ్మణే భ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛదేవి యథాసుఖమ్.**

గాయత్రీ దేవీ ! భూమియందున్న మేరు పర్వతము యొక్క శిరస్సునందలి ఉత్తమ శిఖరము నందుండుటకు, ఉపాసకులైన బ్రాహ్మణులు అనుజ్ఞనుపొందిన దానవై స్వేచ్ఛగా పొమ్ము

**స్తుతోమయా వరదా వేదమాతా ప్రచోదయన్తీ పవనే ద్విజాతా ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం, మహ్యందత్వాప్రజాతుం బ్రహ్మలోకమ్.**

ఉపాసకులకు అభీష్టముల నొసగునదియు, వేదములకు తల్లియు, వాయువువలె అంతర్యామి రూపిణియై ప్రాణులను ప్రేరేపించు నదియు, ద్విజుల చేత ఉపాస్యమానయు (సూర్య, బ్రహ్మలోకములందు పాదుర్భవించినదియు)

అగుగాయత్రి, నా చేత కొనియాడబడినదై, భూమియందుండునాకు ఆయుర్దాయమును, ధనమును బ్రహ్మవర్చస్సును, ఇచ్చి శ్రేష్ఠమైన బ్రహ్మలోకమునకు పోవుగాక! (ప్రజాతుం = శ్రేష్ఠమైన = అతలవితలాది అధోలోకములకంటెను, భూర్భువస్సువరాది ఊర్ధ్వలోకములకంటెను శ్రేష్ఠమైనది

37 సప్త త్రింశో౽ను వాకః.

ఘృణి స్సూర్య ఆదిత్యో న ప్రభావాత్యక్షరమ్ ! మధుక్షరన్తి తద్రసమ్! సత్యంవైతద్రసమాపోజ్యోతీరసో౽మృతం బ్రహ్మ ! భూర్భువస్సువరోమ్.

జగదుత్పత్తికి కారణుడును, ఘృణిః = దీప్తికలవాడును, నాశము లేనివాడును, అగు ఆదిత్యుడు, తన కిరణములవలెనే ఆకాశమున పోవుచున్నాడు. ఆ సూర్యుని వల్ల జనించిన రసము (జలము) నదులై ప్రవహించుచున్నవి. అదియే సత్యము అపోజ్యోతి రసో ఓమ్). (గాయత్ర్యోపాసన చేయలేని వారు ఈ మంత్రమును జపించవచ్చును).

38 అష్టత్రింశో౽ను వాకః

బ్రహ్మమేతుమామ్ ! మధుమేతుమామ్, బ్రహ్మమేవ మధు మేతుమామ్
యాస్తేసోమ ప్రజావత్సో౽భిసోహమ్ ! దుష్ష్వప్న హన్దురుష్షహ !
యాస్తే సోమ ప్రాణాగ్ంసాత జ్జు హోమి – (1).

బ్రహ్మం = పరబ్రహ్మతత్త్వము, మాం = నన్ను, ఏతు = పొందుగాక, మధు = పరమానంద మాధుర్యోపేతమగు వస్తువు, మాం = నన్ను, ఏతు = పొందుగాక ! మధుం = మధురమగు, బ్రహ్మమేవ = పరబ్రహ్మతత్త్వమే, మాం = నన్ను, ఏతు = పొందుగాక, సోమ = బ్రహ్మవిద్యాసమేతుడవగు ఓ పరమేశ్వరా ! తే = నీ యొక్క, యాః = ఏ, ప్రజాః = ప్రజలు కలరో (వారిలో) అహం = నేను, వత్సం = బాలుడి వంటి వాడను, దుష్ష్వప్నహ = సంసారరూప, దుఃఖమును నశింపజేయునట్టి ఓ ఈశ్వరా ! దురుష్షహ = దుస్సహమగు పుట్టుకను నశింపజేయుము. సోమ = ఓ పరమేశ్వరా ! యాః = ఏ, తే = నీ యొక్క, ప్రాణాః = ప్రాణవృత్తులు గలవో, తాన్

= ఆ ప్రాణవృత్తులను, జుహోమి = నీయందు హుతమొనర్చుచున్నాను (ఇది ప్రఖ్యాతమైన త్రిసుపర్ణమంత్రములలో మొదటిది) జ్ఞానోదయమునుకున్న, బ్రహ్మహత్యాది మహాపాపములనివారణార్థము జపింపవలసినన మంత్రములు ఇవి వేదములందు సుపర్ణుడనగా సూర్యుడు, అగ్ని, ప్రజాపతి మొదలగు దేవతలు పురాణములలో సుపర్ణుడనగా గరుత్మంతుడు గరుత్మంతుడు పక్షిరాజు, అమృతరక్షకుడు ఈ మంత్రములు గూడా జీవుని రక్షించును ఇందులో సోముడు = ఉమాపతి అయిన పరమేశ్వరుడు

మంత్ర బ్రాహ్మణము:

త్రిసుపర్ణమయాచితం బ్రాహ్మణాయదద్యాత్
బ్రహ్మహత్యాంవతే ఘ్నన్తి! యే బ్రాహ్మణా స్త్రి పర్ణం పఠంతి । తేసోమం ప్రాప్నువంతి ఆ సహస్రాత్పఙ్క్తిం పునంతి = ఓమ్
త్రిసుపర్ణమంత్రమును యాచింపబడకయే ఇవ్వలయును ఏ బ్రాహ్మణులు త్రిసుపర్ణమంత్రమును పఠించుచున్నారో వారు బ్రహ్మహత్యాది దోషమును నాశన మొనర్చుచున్నారు వారు సోమయాగ ఫలమును పొందుచున్నారు వేయి మంది వున్న పంక్తిని పవిత్రముగా జేయుచున్నారు ఓం = ప్రణవ ప్రతిపాదిత దేవతయే త్రిసుపర్ణమంత్రమునకు దేవత

39 ఏ కోన చత్వారింశోఽను వాకః

బ్రహ్మమేధయా, మధుమేధయా, బ్రహ్మమేవ మధుమేధయా అద్యానో దేవసవితః । ప్రజావత్సా వీ సౌభగమ్ । పరాదుష్వప్నియగ్ంసువ । విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ । యద్భద్రం తన్మ ఆసువ । మధు వాతా ఋతా యతే । మధు క్షరంతి సిధవః । మాధ్వీర్న స్సంత్వోషధీః । మధునక్త ముతోషసి । మధు మత్పార్థివగ్ంరజః మధుద్యౌరస్తునః పితా । మధు మాన్నో వనస్పతిర్మధు మాగ్ం అస్తుసూర్యః । మాధ్వీర్గావో భవంతునః – (1).

బ్రహ్మ = జగత్కారణమును, సర్వవేదాంత ప్రతి పాద్యమును అగు బ్రహ్మము, మేధయా = గురూపదిష్ట మహావాక్యములను, తదర్థముల విచారించుచు,

నిర్ణీతార్థమును ధరించుట యనెడి ధారణాశక్తి చేత (పొందుబడును), మధు = పరమానంద మాధుర్యోపేతమగు వస్తువు, మేధయా = ధారణా శక్తి చేత (పొందబడును) - బ్రహ్మమేవ = బ్రహ్మమేయగు , మధు = పరమానంద మాధుర్యము గల వస్తువు, మేధయా = మేధాశక్తి చేత (పొందబడును), సవితః = ప్రేరకుడవగు దేవ = ఓ దేవా ! అద్య = నేడు, నః = మాకు, ప్రజావత్ = శిష్య ప్రశిష్య సంతతిగల, సౌభగం = ఆచార్య రూపమగు భాగ్యమును, సావీః = ప్రేరేపింపుము దుష్వప్నియం = దుస్స్వప్నము వంటి ద్వైతభావమును, పరాసువ = నాశన మొనర్చుము సవితః = ప్రేరకుడవగు, దేవ = ఓ దేవా ! (పరమేశ్వరా) విశ్వాని = సమస్తములైన, దురితాని = పాపములను, పరాసువ = తీసివేయుము, తత్ = ఆ, భద్రం = మంగళ కరమగు తత్వ్జ్ఞానమును, మే = నాకు, ఆసువ = సమగ్రముగా ఒసంగుము, ఋతాయతే = పరబ్రహ్మమును కోరు నా కొఱకు, వాతాః = వాయువులు, మధు = మాధుర్యముగా (సుఖముగా) (వాంతు = వీచుగాక), సింధవః = నదులు, మధు = తీయని నీటిని, క్షరంతు = సంపాదించుగాక, ఓషధీః = ఓషధులు, నః = మాకు, మాధ్వీః మధువు వలెహిత కరములు, సంతు = అగుగాక ! నక్తం = రాత్రియిందు, ఉత = మరియు, ఉషసి = ప్రాతః కాలమునందును, మధు = అనుకూలమగు సుఖము (మాకు కలుగుగాక), పార్థివం = భూసంబంధమగు, రజః = దుమ్ముసైతము, మధమత్ = మాధుర్యోపేతముగుగాక, నః = మాకు, పితా = తండ్రితో సమానమైన, ద్యౌః = ఆకాశము మధు = మాధుర్యమైనది (అగుగాక!) నః = మాకు, వనస్పతిః = వనస్పతులు, మధుమాన్ = మధుర ఫలసమన్వితములు (అగుగాక), సూర్యః = సూర్యుడు, మధుమాన్ = మాధుర్యము గలవాడు (అగుగాక) నః = మాకు, గావః = గోవులు, మాధ్వీః మధురమైన క్షీరముల నిచ్చునవిగా, భవన్తు = అగుగాక !

ఇమం సుపర్ణమయాచితం బ్రాహ్మణాయుద ద్యాత్ భ్రూణహత్యాంవా ఏతే ఘ్నన్తి! యే బ్రాహ్మణా సుపర్ణం

పఠన్తి ! తేసోమం ప్రాప్నువంతి ! ఆ సహసాత్పజిం పునంతి = ఓమ్ - (2) (అర్థము సులభము)

40 = చత్వారింశోஉను వాకః

బ్రహ్మమేధవా ! మధుమేధవా ! బ్రహ్మమేవ మధుమేధవా బ్రహ్మాదేవానాం పదవీః కవీనా వృషిర్విప్రాణాం ! మహిషోమృగాణాంశ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ ం పవిత్రమత్యేతిరేభన్ .
(12వ అనువాకం 4వ మంత్రమును చూడుడు)
బ్రహ్మము బ్రహ్మము, మధుమేధవా = మాధుర్యమైన యజ్ఞము కలది)

హగ్ం సశ్శుచిషద్వసురన్తరిక్షస ! ద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్ ! నృషద్వరసదృత సద్వ్యోమ సదబ్జా గోజా ఋతజా అద్రిజాఋతం బృహత్ – 3.

(అర్థమునకు 12వ అనువాకములో 6 వ మంత్రమును చూడుము)

ఋచేత్వారుచేత్వా సమిత్స్రవన్తి సరితోనధేనాః !
అన్తర్ హృదా మనసా పూయమానాః ! ఘృతస్యధారా అభిచాకశీమి (4).

ఓ పరమేశ్వరా ! ఋచే = ఋగ్వేదరూపుడువగు, నీకు, సమిత్ = ఈ సమిధ (అగ్నియందు హుతమొనర్చబడినది), రుచే = వేదప్రాప్తి కొఱకు, త్వా = నిన్ను గూర్చి, ధేనాః = దేవతలచే పానము చేయబడుచున్నట్టియు, అంఃహృదా = హృత్కోశమధ్యమందున్న, మనసా = మనస్సుచేత, పూయమానాః = పవిత్రములయినవిగా చేయబడినట్టియు, ఘృతస్య = (అగ్నియందు హుతమొనర్చబడిన) ఆజ్యము యొక్క, ధారాః = ధారలు, సరితఃన = నదులవలె, స్రవంతి = కారుచున్నవి, అభిచాకశీమి = అట్టి అజ్యధారలను అందుఱకు ఇవ్వగలను

హిరణ్యయోవేతసోమధ్య ఆసామ్ !
తస్మిన్ స్తుపర్ణో మధుకృత్కులాయీ భజన్నాస్తే మధుదేవతాభ్యః !
తస్యా 22సతే హరయస్సప్త తీరే స్వరాం దుహానా అమృతస్యధారామ్,

అసాం = పూర్వోక్త ఆజ్యధారలయొక్క, మధ్యే = మధ్యభాగమునందు, తస్మిన్ =

ఆయాహవనీయాగ్నియందు, హిరణ్యాః = జ్యోతిరూపుడును వేతసః = అధికధనముగలవాడును, మధుకృత్ = సుఖకరుడును, కులాయీ = సకల ప్రాణిదేహాశ్రయుడును, అగు, త్రిసుపర్ణో = త్రిసుపర్ణమంత్ర ప్రతిపాద్యుడగు పురుషుడు, అస్తే = ఉన్నాడు, తస్య = ఆపరమాత్మయొక్క, తీరే = సమీపమునందు, హరయః = తమ్ముసేవించువారియొక్క పాపములను పోగొట్టునట్టి, సప్త = సప్తమహర్షులు, అమృతస్య = అమృతము యొక్క, ధారాం = ధారయగు, స్వధాం = హవ్యకవ్యద్రవ్యములగు, దుహానాః = ఆయాదేవతల కొసంగు చున్నవారలై, ఆసతే = ఉంటున్నారు (అట్టిసప్త ఋషిమండల మధ్యమందు పరమాత్మయుంటున్నాడు) సుపర్ణులనగా = పక్షిస్థానీయులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కానీ, విశ్వతైజసప్రాజ్ఞులుకానీ, విరాట్, హిరణ్య గర్భ, ఈశ్వరుడు కానీ ఎవరివల్ల నుండి పుట్టిరో - అతడు సుపర్ణుడు అట్టి పరమాత్మ మహిమను ప్రకటించు గ్రంథము సైతము సుపర్ణమనబడును

## 41 ఏకచత్వారింశోఽనువాకః

**మేధాదేవీ జుషమాణానఆగా । ద్విశ్వాచీభద్రాసుమనస్యమానా త్వయా జుష్టానుదమానాదురుక్తా । న్బృహద్వదేమ విదథే సువీరాః - 1.**

(జీవాత్మకు ఈశ్వరా భేదజ్ఞానము నెడతెగక స్మరించునట్టి జ్ఞానము మేధా ధీనము కావున మేధాభిమాని దేవతా ప్రార్థనము) విశ్వాచీ = సర్వావగాహనక్షమయు (కావుననే), భద్రా = కళ్యాణదాయినియు, సుమనస్యమానా = మంచిమనస్సు కలదియు, అగు, మేధా = మేధా దేవి, జుషమాణా = ప్రీతిగలదై, నః = మమ్ముల గూర్చి, ఆగాత్ = వచ్చుగాక (ఓ మేధాదేవి) (మేమునీచే అనుగ్రహింపబడిన వారమై) దురుక్తాన్ = వేదబాహ్యములగు శబ్దములను, నుదమానాః = తీసివేయుచున్న వారమై, సువీరాః = మంచి పుత్రులు, శిష్యులును కలిగిన వారమై, విదథే = యజ్ఞమనుష్ఠింపబడినదగుచుండా (శుద్ధాంతః కరణము గలవారమై) బృహత్ = బ్రహ్మతత్త్వమును వదేమ = చెప్పదము

(ఋగ్విధాన - 96-97 ప్రకారము తల్లులు తమబిడ్డలకు పాలిచ్చుచూ ఈ మంత్రములను చెప్పవలెను ఆ బిడ్డలు పెద్దవారై మహామేధావులై వేదములను ధారణ

చేసుకొని వాటిని ఇతరులకుపదేశించగలరు జ్ఞానముతో పాటు ఐశ్వర్యముకూడా వుండవలయును జ్ఞానములేని ఐశ్వర్యము అపాయకరము, ఐశ్వర్యము లేని జ్ఞానము నిరర్థకము

తా - సర్వవ్యాపకురాలవై సూక్ష్మబుద్ధినిచ్చెడి శోభనమనస్సుగల ఓ మేధాదేవీ (సరస్వతీ) దయతో మావద్దకురమ్ము మేము నిందితవాక్కులను సేవించుచున్న మేము ఇక మీదట నీచే అను గ్రహింపబడి (బహ్మతత్త్వమును చెప్పెదము

త్వయా జుష్ట ఋషిర్భవతి దేవి ! త్వయా బ్రహ్మ గత శ్రీరుత త్వయా ! త్వయా జుష్టశ్చిత్రం విన్దతే వసు ! సానో జుషస్వ ద్రవిణో, నమేధే -

నీచేత అనుగ్రహింపబడినవాడు ఋషి (మంత్రద్రష్టయును, బ్రహ్మగను, సంపదగలవాడును, అగుచున్నాడు అట్టి, ఓ మేధాదేవీ, మమ్ములను ధనపతియగు కుబేరుని వలె జుషస్వ (అను గ్రహింపుము)

42. ద్విచత్వారింశో ఉను వాకః

మేధాం మ ఇన్ద్రో దదాతు మేధాం దేవీసరస్వతీ మేధాంమే అశ్వినా వుభావాధత్తాం పుష్కరస్రజా (1) అప్సరా సుచయావేధా గన్ధ ర్వేషుచయన్మనః దైవీం మేధా సరస్వతీ సావూం మేధాసురభిర్జుషతాగ్ం స్వాహా.

ఇంద్రుడు నాకుమేధను ఇచ్చుగాక! సరస్వతీ దేవి నాకుమేధను ఇచ్చుగాక! (పుష్కరస్రజా) = పద్మమాలలు గల అశ్వినీ దేవతలిద్దరూ నాకుమేధను ఇచ్చెదరు గాక!
అప్సరస్త్రీల యందు, దేవగాయకులైన గంధర్వులయందు,సరస్వతీ దేవి యందు యేమేధకలదో అది నాకు సకలాభీష్టప్రదయై! (మంచిగంధము గలదై) నన్ను పొందుగాక! -

43 త్రిచత్వారింశోஉను వాకః
ఆ మాం మేధసురభీర్విశ్వరూపా! హిరణ్య వర్ణా జగతీ జగమ్యా!
ఊర్జస్వతీ పయసాపిన్వమానా సామాంమేధాసుప్రతీకా జుషన్తాం

మేదా దేవి, సురభిః = అభీష్టప్రదయై; విశ్వరూపా=బహురూపములు గలదై, హిరణ్యవర్ణా= దేవతాశరీర మందు సువర్ణ మయాకారము గలదై, జగతీ = జగదాత్మకయై, జగమ్యా = పురుషార్థకామములచేత పొందదగినదై, మాం = నన్ను గూర్చి, ఆ (గచ్ఛతు) = వచ్చుగాక! ఊర్జస్వతీ = బలవతియై, పయసా = గోక్షరాదిరసముచేత, పిన్వమానా = మమ్ములను సంతోషపెట్టునట్టి, సా = అట్టి, మేధా = మేధాదేవత, సుప్రతీకా = సుఖముకలదై, జుషతాం= సేవించుగాక! (రక్షించుగాక)

44. చతుశ్చత్వారింశోஉనువాకః -

మయిమేధాం మయిప్రజాం మయ్యగ్నిస్తే జోద ధాతు
మయిమేధాం మయిప్రజాం మయీన్ద్ర ఇంద్రియంద ధాతు.
మయిమేధాం మయిప్రజాం మయిసూర్యోభ్రాజోద ధాతు.

అగ్ని నాయందు ధారణాశక్తిని ఉంచుగాక, నాయందు అవిచ్ఛిన్నమగు సంతతిని ఉంచుగాక! నాయందు బ్రహ్మవర్చస్సును ఉంచుగాక, ఇంద్రుడు నాయందు మేధను, సంతతిని, వీర్య పుష్టిని ఉంచుగాక సూర్యుడు నాయందు మేధను, సంతతిని, భ్రాజః = (దర్శన మాత్రము చేత శత్రువులను భయంకంపితులజేయు) ముఖకాంతిని కలుగజేయుగాక

45. పంచ చత్వారింశోஉఆనువాకః

అపైతు మృత్యురమృతంన ఆగన్ వైవస్వతో నోఅభయంకృణోతు!
పర్ణం వనస్పతే రి వాభి నశ్శీయ తాగ్ంరయి స్సచతాం నశ్శచీపతిః.

మృత్యుః = మృత్యుదేవత, అపైతు = దూరముగా తొలగి పోవుగాక అమృతం = మోక్షము, నః = మమ్ములను గూర్చి, ఆగన్ = వచ్చుగాక, వైవస్వతః = యముడు, నః

= మాకు అభయం = అభయమును, కృణోతు = చేయుగాక, నః = మాయొక్క, (పాపము), వనస్పతేః = వృక్షము యొక్క, పర్ణంన = పర్ణము వలె , అభిశీయతాం, అంతటాపడి నశించుగాక! నః = మమ్ముళను; శచీపతిః = ఇంద్రభోగ్యమగు, రయి = మహదైశ్వర్యము, సచతాం= పోందుగాక! (శివుని సమీపమున నిలబడి, అమృతత్వము కోసము, మృత్యు భయములేకుండుటకు, పాపక్షయమునకు శ్రేయస్సుకు, ఐశ్వర్యమునకై, వేడుకొనుమంత్రము–

46. షట్చత్వారింశోఽనువాకః-

పరం మృత్యో అనుపరేహిపన్థాం! యస్తేస్వ ఇతరో దేవయానాత్!
చక్షుష్మతే శృణ్వతే తేబ్రవీమి మానః ప్రజాగ్ం రీరిషో మోత వీరాః :

మృత్యోః = ఓ మృత్యుదేవతా! చక్షుష్మతే = నేత్రములు కలిగినట్టియు, శృణ్వతే = వినుచున్న, తే=నీకు, బ్రవీమి = చెప్పుచున్నాడను; దేవయానాత్ = దేవయాన; (పితృయాన) మార్గము (ల) కంటే, యః ఏ, ఇతరః = అన్యమైన, తే = నీ యొక్క, స్వః = స్వ భూతమగు , (మార్గముకలదో) పంథాం = ఆ మార్గమును, పరేహి = పొందుము ,నః = మా యొక్క, ప్రజాం = సంతతిని, మారీరిషః = హింసింపకుము, ఉత= మరియు, వీరాన్ = వీరులగు భృత్యులను, మా = హింసింపకుము – ఓ మృత్యుదేవతా ! నన్ను చూచుచున్న, నామటలు వినుచున్న నీకు చెప్పుచున్నాను దేవపితృ యానములకంటే భిన్నమైన, నీమార్గమునవే నీవు పొమ్ము., నాసంతతిని నాశనము చేయుకుము – మావీరులను హిసింపవలదు

47. సప్త చత్వారింశోఽనువాకః

వాతం ప్రాణం మనస్వాన్వార భామహే! ప్రజాపతిం యో భువనస్య గోపాః!
సనోమృత్యోస్త్రాయతాం పాత్వగ్ంహసో! జ్యోగ్జీవాజరామశీమహి; –

(వయం = మేము), ప్రాణం = సమస్త పిండాండమందున్న ప్రాణాపానాది వాయు రూపుడున్ను, వాతం = అంతరిక్షమందున్న వాయురూపుడును, (అగు) యః = ఎవ్వడు, భువనస్య = బ్రహ్మాండము యొక్క , గోపాః = రక్షకుడో (అట్టి), ప్రజాపతి

= పరమాత్మను, మనసా = మనస్సుచేత , అన్వారభామహే = అనుసరించు చున్నాము , సః = ఆ ప్రజాపతి , నః = మమ్ములను, మృత్యోః = మృత్యువునుండి , త్రాయతాం = రక్షించుగాక! జ్యోక్ = చాలాకాలము, జీవాః = జీవించుచున్న వారమై, జరాం = వార్ధక్యమును, అశీమహి = పొందెదముగాక – పాత్వంహసో – పాపములనుండి రక్షించుగాక! – (అంహసః + పాతు) –

## 48. అష్టచత్వారింశోఽనువాకః –

అముత్ర భూయాదధ యద్యమస్య! బృహస్పతే అభిశస్తేరముంచః ! ప్రత్యౌహతామశ్వినామృత్యుమస్మా! ద్దేవానామగ్నే భిషజా శచీభిః–

బృహస్పతే = వేద వాక్కులకు ఓ పరమాత్మా, యమస్య = యముని యొక్క, యత్ = ఏ భయముకలదో దాని నుండి), అముంచః = (నన్ను వదలింపుము), అభిశస్తే = అపకీర్తి వల్ల నుండి , (అముంచః = నన్ను వదలింపుము), అధ = పిదప, అముత్ర = పరలోకసుఖము , భూ యాత్ = నాకు అగు గాక, అశ్వినా = అశ్వినీదేవతలు , అస్మాత్ = నాసమీపమందుండి , మృత్యుం = మృత్యువును , ప్రతి+ ఔహతాం = దూరముగా చేయుదురు గాక , అగ్నే , దేవానాం = దేవతలయొక్క, భిషజా = వైద్యుడవగు (నీచేత) సంరక్షించ దగినవాడను శచీభిః = పుణ్యకర్మల ప్రభావముచే) – శచీభిః = ఇంద్రపత్నులచే కూడ (సంరక్షింపదగినవాడను),
ఓ పరమాత్మా ! మమ్ములను మృత్యు భయమునుండి , అపకీర్తి నుండి కాపాడుము నాకు పరలోకసుఖముకలుగుగాక ! – ఓ అగ్నీ ! దేవతలకు వైద్యులగు అశ్వినీ దేవతలు నాదగ్గరుండి మృత్యువునుండి, మాపుణ్యకర్మలప్రభావముచే, కాపాడుదురుగాక

## 49. ఏకోనపంచాశోఽనువాకః

హరిగ్ం హరంత మనుయంతి దేవా విశ్వస్యేశానంవృషభం మతీనామ్ / బ్రహ్మసరూపమనుమేదమాగాదయనం మా వివధీర్విక్రమస్య –

దేవాః = దేవతలందరూ; విశ్వస్య = ప్రపంచమునకు, ఈశానం = ప్రభువును, మతీనాం = ప్రాణి బుద్ధులకు, వృషభం = శ్రేష్ఠుడును, హరంతం = భక్తుల

పాపములను హరించునట్టియు, హరిం = విష్ణురూపుడవగు నిన్ను , అనుయంతి = భృత్యభావముతో అను సరించెదరు గాక! సరూపం = సమానరూపము గలట్టియు, ఇదం = ఈ , బ్రహ్మ = వేదచతుష్టయము, మా= నన్ను, అన్వగాత్ = అనుసరించుగాక ! అయనం = మేము సంపాదించుకొనిన మోక్షమార్గమును, మావివధీః = హింసింపకుము , విక్రమస్వ = (ఇచ్చుటకు) ప్రయత్నించుము - ప్రపంచమునకు ప్రభువును, (ప్రాణుల మనోబుద్ధులకు అధిపతియును, విష్ణురూపుడును, ప్రళయకాలమందు విశ్వమును లీనమొనర్చుకొనువాడును లేక భక్తుల పాపములను హరించువాడను) అగు హరిని దేవతలందరు సేవకులవలె అనుసరించెదరు వేదములలో వర్ణించబడిన మోక్షమార్గమును నాకు తెరువబడుగాక! నాకు దానిని అందకుండా చేయకుము- దానిని నాకు ఇచ్చుటకు ప్రయత్నించుము -

50 పంచాశోఽనువాకః -

శల్కైరగ్నిమిన్ధాన ఉభౌలోకౌసనే మహమ్
ఉభయోర్లోక యోర్ ఋద్ధ్వాఽతిమృత్యుంతరామ్యహమ్.

ఓ భగవంతా! (నేను) శల్కైః = సమిధలచేత, అగ్నిం = ఆహవనీయాది కమగు అగ్నిని, ఇంధానః = జ్వలింపజేయుచున్నవాడనై, ఉభౌలోకౌ = ఇహపరలోకములను, సనేం = పొందెదను, ఉభయోః లోక యోః లోకద్వయమును, ఋద్ధ్వా = పొంది, మృత్యుం = మృత్యువును, అహం = నేను, అతితరామి = అతిక్రమించెదను.

51 ఏకపంచాశోఽనువాకః.

మాచ్ఛిదోమృత్యోమావధీర్మామే బలం వివృహోమాప్రమోషీః
ప్రజాం మామేరీరిష ఆయురుగ్రనృచక్షసంత్వాహవిషా విధేమ.

ఉగ్ర = క్రూరుడవగు, మృత్యో = మృత్యువా, (నా యొక్క మంచి జ్ఞానమును) మాచ్ఛిద = నాశము చేయకుము (నాసత్కర్మానుష్ఠానమును) మా వధీః = హింసింపకుము, మే = నాయొక్క, బలం = శరీరబలమును, మా వివృహః = పీడింవకుము, మే = నా యొక్క, ప్రజాః = ప్రజను, ఆయుః = ఆయువును, మారీరిషః

= హింసింపకుము, నృచక్షసం = పుణ్యాపాప పరీక్షణార్థము జనులను చూచునట్టి, త్వా = నిన్ను, హవిషా = హవిస్సు చేత, విధేమ = సేవించుచున్నాము తాత్పర్యము సులభము

52 ద్విపంచాశోఽనువాకః

మానో మహాన్త ముత మానో అర్భకం । మానఉక్షన్త ముతమాన ఉక్షితం । మానోవధీః పితరం మోత మాతరం ప్రియామానస్తనువో రుద్ర రీరిషః –

రుద్ర =దుష్టులను ఏడ్పించునట్టి ఓ రుద్రుడా । నః = మా యొక్క, మహాన్తం = గురువు మున్నగు పూజ్యవర్గమును, మా వధీః = హింసింపకుము, ఉత = మరియును, నః = మా యొక్క, అర్భకం = బాలుని, మా = హింసింపకుము, నః = మా యొక్క, ఉక్షంతం = తేజోవంతుడగు యువకుని, మా = హింసింపకుము, ఉత = మరియు, నః = మా యొక్క, ఉక్షితం = గర్భస్థపిండములను, మా = హింసింపకుము, నః = మా యొక్క, పితరం = తండ్రిని, మా వధీః = హింసింపకము, నః = మా యొక్క, ప్రియాః = ప్రియమైన, తనువః = దేహమును, మారీరిషః = హింసింపకుము రుద్రా । మా పెద్దలను, పిన్నలను, యువకుల్ని, తల్లిగర్భస్థ పిండమును తండ్రినీ తల్లినీ హింసింపకుము మాకు ప్రియమైన నూతనువులను బాధింపకుము (ఎంత కరుణాయమైనదీ ప్రార్థన).

53. త్రిపంచాశోఽను వాకః –

మానస్తోకే తనయే మాన ఆయుషి । మానోగోషుమానో అశ్వేషు రీరిషః । వీరాన్మానో రుద్రభామితో । హవిష్మన్తో నమసా విధేమతే

రుద్ర = ఓ రుద్రుడా । (నీవు), భామితః = మేము చేసిన అపరాధములతో క్రుద్ధుడవై, నః = మా యొక్క, తోకే = పసిబాలురయందు, తనయే = తరుణులగు పుత్రుల యందును, మారీరిషః = హింసింపకుము, నః = మా యొక్క, ఆయుషి = ఆయుస్సునందు, మా = హింసింపకుము, నః = మా యొక్క, గోషు = గోవులందు, మా = హింసింపకుము, నః = మా యొక్క, అశ్వేషు = అశ్వములందు, మా

హింసింపకుము, నః =మా యొక్క, వీరాన్ = మా వీరులను, మా వధీః = హింసింపకుము హవిష్మంతః = హవిస్సుగలమేము, నమసా = నమస్కారము చేత, తే = నీకు, విధేమ = పరిచర్యచేసెదము

రుద్రా మా అపరాధములతో క్రుద్ధుడవై, మా బిడ్డలను, వారి బిడ్డలను హింసింపకుము అశ్వములను, గోవులను హింసింపకుము. నిన్ను, నమస్సులతోను, హవిస్సులతోనూ పూజించెదము

54. చతుః పంచాశోఽను వాకః.

ప్రజాపతే నత్వదేతాన్యన్యో ! విశ్వాజాతాని పరితాబభూవ యత్కామాస్తే జుహు మస్తన్నో అస్తు ! వయగ్ం స్యామపతయోరయీణామ్ !

ప్రజాపతే = ప్రజాధిపతివగు ఓబ్రహ్మ ! విశ్వా = సమస్తమైన, ఏతాని = ఈ కనబడుచున్న, తా = ఆ భూతములన్నియు, త్వత్ = నీ వల్లనుండియే జాతాని = పుట్టెను అన్యః = ఇతరుడు, న+పరి+బభూవ = సంహరింపజాలడు, వయం = మేము, యత్కామా = ఏ కోరిక గలవారమై, తే = నీ కొఱకు, జుహుమః = హోమము చేయుచున్నారమో, తత్ = ఆ కామము, నః = మాకు, అస్తు అగుగాక ! (వయం = మేము) రయీణాం = ధనములకు, పతయః = అధిపతులము, స్యామ అయ్యెదముగాక !

ఓప్రజాపతీ ! ఇదంతయును నీ నుండే పుట్టినవి ఇంకెవడూ పుట్టింపజాలడు రక్షింపజాలడు సంహరింపజాలడు నిన్నెవరూ అతిక్రమింపజాలరు మేమేమి కోర్కెలతో హోమము చేయుచున్నామో అవన్నియును తీరుగాక ! మేము ధనవంతులమయ్యెదము గాక !

55 పంచ పంచాశోఽను వాకః

స్వస్తి దావిశస్పతిర్వ్రుత్రహా విమృధోవశీ వృషేన్ద్రః !
పురఏతునస్స్వస్తిదా అభయం కరః –

స్వస్తి దా = ఇహ సుఖకరుడును, విశస్పతిః = విశ్వాధిపతియు, వృత్రహా = వృత్రునిసంహరించు, విమృధః = రక్షోజాతిని సంహరించిన వాడును, వశీ = ముల్లోకములను వశపరచుకొను శక్తిగలవాడును, వృషా = వర్షమును కురిపించువాడును, స్వస్తిదా = పరలోక సుఖము నిచ్చువాడును, అభయంకరః = తన్నాశ్రయించిన వారికి అభయము నొసంగు వాడును, అగు, ఇంద్రః = ఇంద్రుడు, నః = మాకు,పురః = ప్రాగ్భావమునందు, ఏతు = వచ్చుగాక (ఇదే మంత్రము 1వ అనువాకం 42 మంత్రము).

56. షట్పంచాశోఽనువాకః

త్ర్యయంబకం యజామహే సుగంధింపుష్టివర్ధనమ్
ఉర్వారుక మివబంధనాన్మృత్యోర్ముక్షీయమాఽమృతాత్

(భగవంతుడవగు ఓ పార్వతీ పతీవయం = మేము) సుగంధిం = మంచి పరిమళము గలట్టియు, పుష్టివర్ధనం = లౌకిక, వైదిక పుష్టిని వృద్ధిపరచునదియును, త్ర్యంబకం = మూడునేత్రములు గల ఈశ్వరుడగు నిన్ను, యజామహే = పూజించుచున్నారము (ఓ పార్వతీ పతీ!) బంధనాత్ = తొడి మవల్లనుండి, ఉర్వారుకం ఇవ = దోసకాయవలె, మృత్యోః = మృత్యువునుండి, ముక్షీయ = వదలిపెట్టిబడిన వారము అగుదుముగాక! అమృతాత్ = మోక్షమునుండి, మా = వదలి పెట్టబడిన వారము కాకపోయెదము గాక! –(పురుషార్థసాధనమునకై ప్రతి ఒక్కరూ జపింపవలసిన మంత్రము ఇది) ముఖ్యంగా సంసార బంధముక్తికై జపించవలసినదీ మంత్రము ఇహపర సౌఖ్యప్రదాతగా భావింపడుచున్నాడు మానవుడు పరిపక్వస్థితిలో సహజముగానే దోసపండువలె సంసారమునుండి సునాయాసముగా విడిపడి పోతాడు) కన్యలు దీనిని పఠించవలెను

57. సప్త పంచాశోఽనువాకః

యేతే సహస్రమయుతం పాశామృత్యో మర్త్యాయహంతవే
తాన్ యజ్ఞస్యమాయయా సర్వానవయజామహే

మృత్యోః = ఓ మృత్యుదేవతా ! మర్త్యాయ = ప్రాణిజాతమును హంతవే = హింసించుటకై, సహస్రం = వేలకొలదిగను, అయుతం = పదివేల కొలదియును, తే = నీ యొక్క, యే = ఏ, పాశాః = పాశములు (కలవో), తాన్ సర్వాన్ = ఆ పాశములనన్నింటినీ, యజ్ఞస్య = సత్కర్మజాతము యొక్క, మాయయా = శక్తిచేత, అవ + యజామహే = నివారించుచున్నాము

58 అష్ట పంచాశోఽనువాకః

మృత్యవే స్వాహా ! మృత్యవేస్వాహా

(ఇక పాప నివారకములగు మంత్రములు చెప్పబడుచున్నవి - 67వ అనువాకము వరకు హోమ మంత్రములే = స్వాహా శబ్దము చివరయుండుటచేత హోమమంత్రములు

మృత్యవే = మృత్యువు కొఱకు, స్వాహా = ఈ హుత మొనర్పబడిన ఆజ్యమునుహుతమగునుగాక ! మృత్యవే = మృత్యుదేవతకొఱకు స్వాహా

(ఈ మంత్రమునకు దేవత మృత్యువు (ఎవని చేత ప్రాణులు చనిపోవుచున్నారో అతడు మృత్యువు) - (రెండు సార్లు హోమము నందు ఆజ్యము అర్పించుటచే పాపములు పోగొట్టుకై చేయుచున్నది)

59. ఏకోన షష్టి తమోఽనువాకః -

1. దేవకృత స్యైనసోఽవయజనమసి స్వాహా
2. మనుష్యకృత స్యైనసో 2 వయజనమసి స్వాహా
3. పితృకృత స్యైనసోఽవయజనమసి స్వాహా
4. ఆత్మకృత స్యైనసోఽవయజనమసి స్వాహా
5. అన్యకృత స్యైనసోఽవయజనమసి స్వాహా
5. అస్మత్కృతస్యైనసోఽవయజనమసి స్వాహా
7 యద్దివాచనక్తంచైనశ్చకృమతస్యావయజనమసిస్వాహా
3. యత్స్వపన్తశ్చజాగ్రతశ్చైనశ్చకృమతస్యావయజనమసిస్వాహా

9. యత్సుషుప్తశ్చజాగ్రతశ్చైనశ్చకృమ తస్యావయజనమసిస్వాహా
10. యద్విద్వాగ్ంసశ్చా విద్వాగ్ంశ్చైన కృమతస్యావయజనమసిస్వాహా
11. ఏనస ఏనసో౽వయజనమసిస్వాహా
(ఈ మంత్రములకు, అగ్ని యే దేవత).

1 (ఓ ఆజ్యమా ! నీవు) దేవకృతస్య – దైవిక కర్మల నాచరించునపుడు చేయవలసినదానిని సరిగా చేయకపోవుట వల్ల కలుగు పాపము లేక ఇంద్రియములను దుష్కర్మలయందు ప్రవేశపెట్టిన పాపము ఏనసః = పాపమునకు, అవయజనం = నివారకమైన దానవు, అసి = అయితివి (కావున అట్టి ఆజ్యము అగ్నిదేవుని కొఱకు) స్వాహా = సుహుతమగును గాక! – (2) మనుష్యకృతస్య = మనుష్యుల ధిక్కరించుట, అతిథులకు అన్నము పెట్టక పోవుట (ఇది మనుష్యకృత పాతకము) (అవయజనమసిస్వాహా, పాపమునకు నివారక మయితివి – కావున స్వాహా)
3 పితృకృతస్య = పైతృక కర్మలయందు క్రియాలోపమొనర్చుట (ఏనసః అవయజనమసి స్వాహా)
4 ఆత్మకృతస్య = స్వయముగా నొనర్చబడిన స్వాహా
5 అన్యకృతస్య = భార్యమున్నగు ఇతరుల చేచేయబడిన స్వాహా
6. అస్మత్ కృతస్య = మా జ్ఞాతిసమూహముచే చేయబడిన స్వాహా
7 యత్ = ఏ, ఏనః = పాపమును, దివాచ = పగలున్ను, నక్తంచ = రాత్రియును, చకృమ = చేసినారమో, తస్య = అట్టి పాపము యొక్క – అవయజనమసిస్వాహా
8. స్వపంతఃచ = (మేము) స్వప్నము చెందిన వారలమై, జాగ్రతఃచ = మేల్కొనిన వారలమై, యత్ = ఏ, ఏనః = పాపమును, చకృమ = చేసితిమో, తస్య = అట్టి పాపము యొక్క (అవయజనమసిస్వాహా).
9. (మేము) సుషుప్తఃచ = సుషుప్తిని చెందిన వారలమై, జాగ్రతఃచ = మేల్కొనిన వారలమై, యత్, ఏ = ఏనః = పాపము యొక్క. స్వాహా
10 (మేము) విద్వాం సఃచ = ఎఱిగియున్న వారలమై, ఆ విద్వాంసఃచ = అవిద్వాంసులమై, యత్ = ఏ, ఏనః = పాపమును, చకృమ = చేసితిమో
11 (ఓ ఆజ్యమా ! నీవు) ఏనసః = పాపుల సంపర్కమువలన, ఏనసః = పాపము యొక్క – అవయజనం = నివారకము, అసి = అయితివి (కావున), స్వాహా

60 షష్టితమోऽనువాకః.

యద్వోదేవాశ్చకృమ జిహ్వయా ।గురుమనసోవా ప్రయుతీ దేవహేడనమ్ ।అరావాయోనో అభిదుచ్ఛునాయతే తస్మిన్తదేనో వసవో నిధేతన స్వాహా –

వసవః = అంతటా వసించునట్టియు, గురుమనసః = గంభీరమైన మనస్సుగల, దేవాః = దేవతలారా ! (వయం = మేము), వః = మిమ్ములనుద్దేశించి, యత్ = ఏ, ప్రయుతీ = అధికమైన, దేవహేడనం = దైవదూషణను, జిహ్వయా = నాలుక చేత, చకృమ = చేసితిమో, తత్ = ఆ, ఏనః = పాపమును, తస్మిన్ = ఆగంభీరమైన మనస్సు నందే, నిధేతన = ఉంచుకొనుడు, వా = నిజము, వాయో = సప్తమరుత్తులకుని ధానమైన ఓ వాయువా ! నః = మా యొక్క, యః = ఏ పాపము, అభిదుచ్ఛునాయతే = చెడుకుక్కవలె అపవిత్రమైయున్నదో (అట్టి), అరా = మరణనివర్తకమగు (ఆజ్యము అగ్నిదేవుని కొఱకు) స్వాహా = సుహుతమగు గాక ! (అగురుమనసః = అనికూడా చెప్పవచ్చును) గురువునందు భక్తిలేని వారు దేవతలను హేలనము చేయుదురు) వసువులారా ! దేవతలారా ? మేము మా నోటితో, మా చేతలతో, మా మంద బుద్ధితో దైవ దూషణను, చేసి యుంటిమో, ఆపాపమును మా వద్దకు వచ్చు దుష్టులయందుంచుడు

61. ఏకషష్టితమోऽనువాకః

కామో ऽకారిషీన్న మో నమః కామోऽకార్షీత్కామః కరోతి ।
నాహం కరోమి ।
కామః కర్తానాహం కర్తాకామః కారయితా నాహం కారయితా ।
ఏషతే కామ కామాయస్వాహా –

(ఓ దేవతరాలా ! మీ కొఱకు), నమోనమః = నమస్కారము, నమస్కారము, కామః = మన్మధుడు, అకార్షీత్ = (వెనుక చెప్పిన పాపమునుచేసెను, కామః = మన్మధుడే, కరోతి = చేయుచున్నాడు అహం = నేను, న కరోమి = చేయను, కామః = కాముడే, కర్తా = కర్త, అహం = నేను, నకర్తా = కర్తను కాను, కామః = కాముడే, కారయితా = చేయించువాడు, అహం = నేను, కారయితా = చేయించు వాడను, న = కాదు, కామ = ఓ కాముడా ! కామాయ = మంచి ఆకారముగల, తే = నీ కొఱకు, ఏషః =

ఈ ఆజ్యాహుతి, స్వాహా = సుహుతమగు గాక ।

62 ద్విషష్టి తమోఽనువాకః

మన్యురకార్షీన్నమోనమః । మన్యురకార్షీన్మన్యుః కరోతి ।
నాహం కరోమి । మన్యుః కర్తానాహంకర్తా
మన్యుః కారయితా నాహం కారయితా । ఏ షతే మన్యో మన్యవేస్వాహా –

(దేవతలారా । మీకు) నమోనమః = నమస్కారము, నమస్కారము (వెనుక చెప్పిన పాపమును) మన్యుః = కోపాభిమాన దేవత ఆకార్షీత్ = చేసెను, మన్యుః = కోపాభిమాన దేవతయే, అకార్షీత్ = చేసెను, మన్యుః = కోపాభిమాన దేవతయే, కరోతి = చేయు చున్నది, అహం = నేను, న కరోమి = చేయను, మన్యుః = కోపాభిమానదేవతయే, కర్తా = కర్త, అహం = నేను, నకర్తా = కర్తను కాను, మన్యుః = కోపాభిమాన దేవతయే, కారయితా = చేయించువాడు, అహం = నేను, న కారయితా = చేయించువాడను కాను, మన్యో = కోపాభిమాన దేవతా । మన్యవే = క్రోధరూపుడవగు, తే = నీ కొఱకు, ఏషః = ఈ ఆజ్యాహుతి, స్వాహా = సుహుతమగుగాక । (పాపము చేయువానికి సంభవించునా ? చేయించువానికి సంభవించునా ? అనుమీమాంసకు సమాధానము పాపమును బలాత్కారముగా ఒకని చేతచేయించిన ఎడల చేయించిన వానికే దోషము, కానీ ఇచ్ఛలేక చేసిన వారికి దోషము లేదు

63. త్రిషష్టితమో ఽనువాకః

తిలాఞ్జుహోమి సరసాగ్ం సపిష్టాన్గంధార ।మమచిత్తేరమన్తు స్వాహా –

గంధార = ఓ పరమాత్మా । సపిష్టాన్ = పిష్టముతో కూడు కొనియున్న సరసాన్ = రసముతో కూడినదియు, తిలాన్ = తిలలను, జుహోమి = హోమము చేయుచున్నాను (ఈ హోమమునకు ఫలముగా పవిత్రములగు నీ గుణములు) మమచిత్తే = నా చిత్తమునందు, రమన్తు = క్రీడించుగాక । స్వాహా = సుహుతమగు

గాక।

గావోహిరణ్యంధనమన్నపానగ్ం సర్వేషాగ్ం శ్రియైస్వాహా,

తా = గోవులు, బంగారు, ధనము, అన్నపానములు, సర్వము గజాంతమగు ఐశ్వర్యము కొఱకు, ఈహవిస్సునీకివ్వబడినది, స్వాహా

శ్రియంచ లక్ష్మీంచ పుష్టించ కీర్తించానృణ్యతామ్ ( బహ్మణ్యం బహు పుత్రతాంశ్రద్ధామేధేః ప్రజాస్సం దధాతు స్వాహా

రాజ్యలక్ష్మిని, మోక్షలక్ష్మిని, శరీరపుష్టిని, త్రిలోకములకు విదితములగు కళ్యాణగుణములు కలిగియుండు కీర్తిని, అనృణ్యతాం = దేవ, ఋషి పితృఋణవిముక్తిని, సర్వబ్రాహ్మణులలో శ్రేష్ఠత్వమును, అనేక పుత్రులు కలిగియుండుట, శ్రద్ధ = గురు వేదాంతవాక్యములందు విశ్వాసము, మేధ = వేదశాస్త్రార్థధారణను, పుత్రికలను పరమాత్మనాకు ఇచ్చుగాక)

64. చతుష్షష్టితమోఽను వాకః

**తిలాః కృష్ణా, స్తిలా శ్వేతాస్తిలాసౌమ్యావశానుగాః!**
**తిలాః పునంతు మే పాపంయత్కి ఞ్చిద్దురితంమయి - స్వాహా**

నల్లని నువ్వులు, తెల్లని నవ్వులు, ఈ రెండు విధములైన నువ్వులు రోగాది ఉపద్రవముల నివ్వవు అవినావశమందున్నవి - ( ఓ పరమాత్మా నీ యాజ్ఞ చేత ఈ నువ్వులు నా యందుండు ఏ కొద్ది పాపాన్నయినా దానిని పోగొట్టి నన్ను పవిత్రునిగా జేయుగాక - సుహుతమగుగాక స్వాహా
చోరస్యాన్నం నవ శ్రాద్ధం బ్రహ్మహా గురుతల్పగః గోస్తేయగ్ం సురాపానం భ్రూణహత్యా తిలాశాన్తిగ్ం శమయన్తు - స్వాహా - (2)
( ఓ పరమాత్మా నీ యాజ్ఞచేత) - దొంగ యొక్క అన్నము తినుటయు, నవ శ్రాద్ధము = ఏ కోద్దిష్టము, అశౌచశ్రాద్ధభోజనము) నందు భుజించుట - బ్రహ్మహత్య, గురుభార్యాగమనము, గోవులను దొంగిలించుట నుద్యపానము, భ్రూణహత్య

మున్నగు పాపముల నాశనమును, చేయుగాక ! – స్వాహా
శ్రీశ్చలక్ష్మీశ్చ పుష్టిశ్చ, కీర్తించానృణ్యతామ్ ! బ్రహ్మణ్యం బహు పుత్రతాం శ్రద్ధా మేధా ప్రజ్ఞాతు జాత వేదస్సందదాతుస్వాహా (63 అనువాకం 2 మంత్రము వంటిదే – అందులో ప్రజా, ఇచట ప్రజ్ఞా అని మార్పుకలదు ఇది జాతవేదునీ (వేదముల పుట్టించన వానిని) ప్రార్థించుచున్నాడు

65 పంచషష్ఠితమోఽనువాకః –

ప్రాణాపానవ్యానోదాన సమానామే శుధ్ధ్యంతాం జ్యోతిరహం
విరజావిపాప్మా భూయాసగ్ం స్వాహా – (1)
(ఇవి అజ్యహోమములు) (1)

ఓ పరమాత్మా, ! ఈ అజ్యహోమము చేత ఇవన్నియును పరిశుద్ధములగుట చేత, నేను పాపరహితుడనై, రజోగుణములేని వాడనై, జ్యోతిః = జగత్కారణమైన ప్రకాశస్వరూపుడనుఅయ్యెదనో – అట్టి నా యొక్క ప్రాణాపాన వ్యానోదాన సమానులను ప్రసిద్ధపంచవాయువులు పరిశుద్ధములగు గాక స్వాహా

2. వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణ రేతో బుధ్ధ్యా కూతి సంకల్పావేమే శుధ్ధ్యంతాం, జ్యోతి రహం విరజావిపాప్మాభూయాసగ్ం స్వాహా

ఓ పరమాత్మా అయ్యెదనో అట్టి నా వాక్కు, మనస్సు కన్నులు, చెవులు, నాలుక, ముక్కు, గుహ్యేంద్రియము, బుద్ధి, ఆకూతిః = అనిశ్చితాత్మకమగు వృత్తి, సంకల్పము, ఇవన్నియు, పరిశుద్ధములయినవి అగుగాక ! – స్వాహా

త్వక్చర్మమాగ్ంసరు ధిరమేదో మజ్జాస్నాయవోఽస్థినిమే
శుధ్ధ్యంతాం జ్యోతిరహం విరజావిపాప్మాభూయాసగ్ం స్వాహా – (3).

ఓ పరమాత్మా . అయ్యెదనో అట్టి నా త్వక్కు, చర్మము, మాంసము, రక్తము, మేదస్సు, వస, నరములు, ఎముకలు, పవిత్రములైనవి అగుగాక ఇట్టి ఉద్దేశముతో నేనొసగిన ఈ ఆహుతి, సుహుతమగు గాక (స్వాహా)

శిరఃపాణి పాద పార్శ్వ పృష్ఠోరూదరజంఘ శిశ్నోపస్థపాయవోమే శుధ్యన్తాం । జ్యోతి రహం విరజావి పాప్మా భూయాగ్ం స్వాహా -
ఓ పరమాత్మా ! . అయ్యేదనో అట్టినా శిరస్సు, హస్తములు, పాదములు, పార్శ్వములు, వీపు, తొడలు, పొట్ట, పిక్కలు, శిశ్నము, ఉపస్థ, గుదము ఇవి పరిశుద్ధమైనవి అగుగాక ! – స్వాహా –

ఉత్తిష్ఠ పురుష, హరిత , పిఙ్గల, లోహితాక్షి దేహి దేహిదదాపయితా మేశుధ్యన్తాం జ్యోతిరహం విరజావి పాప్మా భూయాసగ్ం స్వాహా –
హే పురుష! (పూర్ణుడవగు స్వామీ! హేహరే (లేక హరిత) లోహిత = ఎఱ్ఱతామరవలె, పింగళ = గోరోజన కాంతిగల నేత్రములు గల నీవు లెమ్ము ( నీవిషయమైన జ్ఞాన శక్తిని) దేహిదేహి = ఇమ్ము, ఇమ్ము, మే = నాయొక్క, దదాపయితాః = ఆ దానము నిప్పించెడి (పై మంత్రములలో చెప్పబడినవన్నియు పరిశుద్ధములగును గాక ( అహం స్వాహా) (హరిత = భక్తుల దుఃఖముల పోగొట్టు) – (ఈ మంత్రమునందు సర్వకర్మలకు ప్రధాన భూతుడైనట్టి అగ్ని యొక్క ఉపాధి విశిష్టుడగు పరమేశ్వరుని స్తుతించడమైనది) (సర్వోత్కృష్టమైన చతుర్థాశ్రమమును స్వీకరించు సమయము నందు చేయవలసిన విరజాహోమమునకు వినియోగింపబడునట్టి ఈ మంత్రములు 63, 64, 65, 66 అను వాకములుగా యున్నవి హవిస్సులు స్వీకరించు దేవుడు పరమాత్మయే

66. షట్ షష్టి తమోఽను వాకః

పృథివ్యాపస్తే జోవాయురాకాశామే శుధ్యంతాం
జ్యోతి రహం విరజావిపాప్మాభూయాగ్ం స్వాహా (1)

భూమి, జలములు, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములు పరిశుద్ధములయినవి యగుగాక ( ఓ పరమాత్మ స్వాహా) -

శబ్ద స్పర్శరూప రసగంధామేశుధ్యన్తామ్, జ్యోతిరహం విరజా, విపాప్మా భూయాసగ్ం స్వాహా – (2)

శరీరోపాదాన కారణములగు పంచ భూతములయందు ఈ శబ్ద స్పర్శరూప రసగంధములు గలవు ఇయ్యవిపరిశుద్ధములైనచో నేను పాపరహితుడను, రజోగుణరహితుడనయ్యెదనని ఆ ఉద్దేశముతో చేయబడిన ఈ అజ్యాహుతి సుహుతమగు గాక

మనోవాక్కాయ కర్మాణి మే శుద్ధ్యన్తాం ,
జ్యోతి రహం విరజావిపాప్మాభూయాగ్గ్ంం స్వాహా (3)

నామనోవాక్కాయకర్మలు పరిశుద్ధములగు గాక. ఓ పరమాత్మా .. స్వాహా.
అవ్యక్త భావైరహం కారైర్జ్యోతిరహం విరజావి పాప్మాభూయాగ్ంస్వాహా – (4).

అవ్యక్త భావములు (లోలోన అణగియుండు అభిప్రాయములు) అహంకారము నాకు లేకుండుగాక – ఓ పరమాత్మ – స్వాహా)
5. ఆత్మామే శుద్ధ్యన్తాం. జ్యోతిరహం విరజావిపాప్మాభూయాసగ్ంస్వాహా
6. అంతరాత్మా మే శుద్ధ్యన్తాం జ్యోతిరహం
విరజావిపాప్మాభూయాసగ్ంస్వాహా
7. పరమాత్మమే శుద్ధ్యన్తాం జ్యోతిరహం విరజావిపాప్మాభూయాసగ్ంస్వాహా
(5) దేహము శుద్ధమగు గాక (6) అంతరాత్మ శుద్ధమగును గాక
(7) పరమాత్మ శుద్ధమగు గాక ! ( ఓ పరమాత్మ స్వాహా)
8) క్షుదేస్వాహా, (9) క్షుత్పిపాసాయస్వాహా,(10) వివిష్ట్యైస్వాహా (11) ఋగ్విధానాయ స్వాహా, (12) కషోత్కాయస్వాహా।
క్షుదధిష్ఠాన దేవత కొఱకు స్వాహా, క్షుత్పిపాసాధిష్ఠాన దేవత కొఱకు స్వాహా
వివిష్టి = విశేషముగా వ్యాపించినట్టి బ్రహ్మము కొఱకు, ఋగ్వేద మంత్రములను రచించినట్టి బ్రహ్మకొఱకు, కషోత్కాయ = కార్యప్రపంచమునకుపకరించునట్టి పరమేశ్వరుని కొఱకు, స్వాహా.

13. క్షుత్పిపాసామలాం అజ్యేష్ఠామలక్ష్మీర్నాశయామ్యహం అభూతి మసమృద్ధించ సర్వాం నిర్ణుద మేపాప్మానగ్ం స్వాహా

ఓ పరమేశ్వరా ! నేను క్షుత్పిపాసారూపమగు మాలిన్యాన్ని, లక్ష్మీదేవికి జ్యేష్ఠయగు,

అలక్ష్మిని, అభూతిని = అనైశ్వర్యమును, అసమృద్ధిని, వీనినన్నింటినీ నాశముచేయుచున్నాను నా యొక్క పాపమును, నిర్ణుద = నాశనమొనర్పుము స్వాహా

14. అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, మానందమయ మాత్మామే శుద్ధ్యన్తామ్ । జ్యోతిరహం విరజా, విపాప్మా భూయాసగ్గం స్వాహా.

నా యొక్క అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయములనెడు పంచకోశము ఈ ఆజ్యహోమము చేత పరిశుద్ధమగునుగాక ! నేను ప్రతిబంధక పాపరహితుడను, పాపమునకు కారణభూతమగు రజోగుణమును లేని వాడనై జగత్కారణ భూతబ్రహ్మజ్యోతి స్వరూపుడనయ్యెదను గాక ! స్వాహా

67. సప్త షష్టితమోऽనువాకః

1. అగ్నయేస్వాహా (2) విశ్వేభ్యోదేవే భ్యస్వాహా. (3) ధ్రువాయ భూమాయస్వాహా (4) ధ్రువక్షితయే స్వాహా (5) అచ్యుతక్షితయే స్వాహా (6) అగ్నయే స్విష్ట కృతే స్వాహా -

(1) అగ్నిదేవునికి స్వాహా (2) విశ్వేదేవతలకు స్వాహా (3) భూమాయ = విస్తారుడగు, ధ్రువాయ = ధ్రువుడను దేవత కొఅకు స్వాహా (4) ధ్రువక్షితి = (శాశ్వతమగు స్థితి) అను పేరు గలదేవతకు (5) అచ్యుతక్షితి అని పేరుగల దేవతకు - స్వాహా (6) స్విష్టకృతే = ఒకానొకప్పుడు ప్రమాదవశమున, అనుష్ఠాతలగు వారు, తప్పుగా కర్మల నాచరించినను దానిని సః ఇష్టంకృత్ = మిక్కిలి చక్కగా చేయువారు - ఇట్టి విశేషణములుగల అగ్ని = స్విష్టకృత్ - స్వాహా
(ఇవి వైశ్వదేవ మంత్రములు).
(ఇక, బలిహరణ మంత్రములు చెప్పబడుచున్నవి)

(7) ధర్మాయస్వాహా (8) అధర్మాయస్వాహా (9) అద్భ్యః స్వాహా (10) ఓషధి వనస్పతి భ్యస్స్వాహా (11) రక్షోదేవజనేభ్యస్వాహా

12- గృహ్యాభ్యస్స్వాహా (13) అవసానేభ్యస్స్వాహా (14) అవసానపతి భ్యస్స్వాహా (15) సర్వభూతేభ్యస్స్వాహా (16) కామాయస్వాహా 17 అన్తరిక్షాయస్వాహా 18 యదేజతి జగతి యచ్చ చేష్టతి నామ్నో భాగోఽయంన్నామ్నే స్వాహా - (19) పృథివ్యైస్వాహా (20) అన్తరిక్షాయ స్వాహా (21) దివేస్వాహా (22) సూర్యాయస్వాహా (23) చన్ద్రమసే స్వాహా (24) నక్షత్రేభ్యస్స్వాహా (25) ఇంద్రాయ స్వాహా (26) బృహస్పతయే స్వాహా (27) ప్రజాపతయే స్వాహా (28) బ్రహ్మణే స్వాహా (29) స్వధా పితృభ్యస్వాహా (30 నమోరుద్రాయ పశుపతయే స్వాహా

తా = (7) దర్మ్ముడను దేవతకు (8) అధర్మ్ముడను దేవతకు (9) జలాది దేవతకు (10) ఓ షధివనస్పతులకు (11) రాక్షసులకు దేవతాభృత్యులకు (12) గృహమందున్నకుల దేవతలకు (13) గృహప్రాంత ప్రదేశదేవతలకు (14) గృహసమీప ప్రదేశ దేవతలకు (15) పంచమహా భూతములకు (16) లోకత్రయ వ్యామోహకుడగు మన్మధునికి (17) అంతరిక్షమందలి వాయువుకు (18) జగతి = బ్రహ్మాండమందు, యత్ = ఎయ్యది, ఏజతి = కదులుచున్నదో, యత్చ = ఏమనుష్యాది కము కదలుచున్నదో అయం = ఇదంతయు, నామ్నః = పరమాత్మ యొక్క, భాగః = భక్షణీయాంశము, నామ్నే = (అట్టి) పరమాత్మ కొఱకు, స్వాహా (19) పృథ్వీ అధిష్టాన దేవతకు (20) అంతరిక్షమునకు (21) దివే = ద్యులోకాభిమానదేవతకు (22) సూర్యునికి (23) చంద్రునికి, (24) నక్షత్రములకు (25) ఇంద్రునికి (26) బృహస్పతికి (27) విరాడ్రూపుడగు బ్రహ్మకు (28) హిరణ్యగర్భునికి (29) పితృదేవతలకు, స్వధా కారమునకు – ఈ ఒసంగబడిన బలి స్వాహా – (30) పశుపతి శబ్దవాచ్యుడగు – రుద్రుని కొఱకు నమస్కారము. స్వాహా

(పంచ మహాయజ్ఞ మంత్రములు, అగ్రదాన మంత్రములును దివానక్తమంత్రములును చెప్పబడుచున్నవి). (31) దేవేభ్యస్స్వాహా (32) పితృభ్యస్స్వధా ఉస్తు, (33) భూతే భ్యోనమః (34) మనుష్యేభ్యో హన్తా (35) ప్రజాపతయే స్వాహా (36) పరమేష్టనే స్వాహా (37) యధాకూపశ్శత ధార స్సహస్రధారో అక్షితః। ఏవామే అస్తు ధాన్యాగ్ం సహస్రధార మక్షితం ధన ధాన్యైస్వాహా (38) యేభూతాః ప్రచరన్తి దివానక్తం బలిమిచ్ఛన్తో వితుదస్య ప్రేష్యాః । తేభ్యో బలింపుష్టి కామో హరామిమయి పుష్టిం పుష్టిపతి ర్దధాతు స్వాహా -

ఓషధి వనస్పతిభ్యస్స్వాహా ఉన్తరిక్షాయస్వాహా। నమోరుద్రాయ పశుపతయే స్వాహా
వితురస్య ప్రేష్యా ఏకంచ
31 ఇంద్రాది దేవతలకు, 32 పితరులకు, 33 దేవయోని విశేషుల కొఱకు, 34 మనుష్యులకు, 35 బ్రహ్మము కొఱకు, 36 చతుర్ముఖబ్రహ్మకు, స్వాహా 37, యథా = ఏ విధముగ, శతధారః సహస్రధారః = నూర్లకొలది, వేల కొలది జల ధారలు కల, కూపః = బావి (లేక), గుంట, (పలువురు) నీటిని తోడు కొనినూ) అక్షితః = అక్షయమగుచున్నదో, ఏవ = అటులే, మే = నాకు (పరమేశ్వరాను గ్రహమువలన), ధాన్యం = ధాన్యము, అక్షితం = అక్షయమైనదియు, సహస్రధారం = వేలకొలది పుట్లుపరిమాణము గలదియు అగు గాక (అందుకై ఈ ఆహుతి), ధనధాన్యై = ధనదాని అనిపేరుగల దేవతకు - స్వాహా 38 వితురస్య = శ్మశాన వాసియగు కాలాగ్నిరుద్రునకు, ప్రేష్యాః = భృత్యుల వంటి వారగు, యే = ఏ, భూతాః = భూతములు, బలిం = బలిని, ఇచ్ఛంతన్ = కోరుచున్నవై, దివానక్తం = రాత్రింబగళ్ళు, ప్రచరంతి = సంచరించుచున్నవో, తేభ్యః = అట్టి భూతములకొఱకు, పుష్టికామునడనై, బలిం = బలిని, హరామి = ఇచ్చుచున్నాను, పుష్టిపతిః = ధనధాన్యబలిపోషణాదులకు ప్రభువగు భగవంతుడు, మయి = నా యందు, పుష్టిం = పుష్టిని దధాతు = స్థాపించుగాక
(34 వ నామములో హన్తా = అను పదము, నమః = స్వధా, స్వాహావలె భగవత్స్వం బోధనార్థముపయోగింపబడునది)

68. అష్టషష్టితమోఽను వాకః.

ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా, ఓం తత్సత్యం ఓ తత్సర్వమ్, ఓ ం తత్పురోర్నమః। అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు। త్వం యజ్ఞస్త్వం, వషట్కారస్త్వ మిన్ద్రస్త్వగ్ం రుద్రస్త్వం, విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః త్వం తదాప ఆపోజ్యోతిరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

ఓం = ప్రణవ ప్రతి పాద్యమగు, తత్ = ఆ వేదాంత వేద్యమగు వస్తువు, బ్రహ్మ = మిక్కిలి గొప్పది, ఓం = ప్రణవ ప్రతి పాద్యమగు, తత్ = ఆ వస్తువే, వాయుః = వాయువు, ఓం = ప్రణవ ప్రతి పాద్యమగు, తత్ = ఆవస్తువే, ఆత్మా = జీవుడునూ,

ఓం = ప్రణవ ప్రతిపాద్యమగు, తత్ = ఆవస్తువే, సత్యం = సత్యమున్ను, ఓం = ప్రణవ ప్రతి పాద్యమగు, తత్ = ఆ వస్తువే సర్వం = సకల చరాచరజగత్స్వ రూపము ఓం = ప్రణవ ప్రతిపాద్యమగు, తత్ = అ వస్తువే, పురః = విస్తీర్ణమగు బ్రహ్మాండమునకు కారణము ( అందువలన ఆ వస్తువునకు) నమః = నమస్కారము, ( ఇట్టి బ్రహ్మము), విశ్వమూర్తిషు = నానావిధశరీరములుగల, భూతేషు = ప్రాణులందు, గుహాయాం అంతః = హృదయపుండరీకమధ్యమునందు, చరతి = సంచరించుచున్నది ( ఓ పరమేశ్వరా) త్వం = నీవు, యజ్ఞః = నానావిధక్రతురూపుడవు త్వం = నీవే, వషట్కారః = వషట్కారము, త్వం = నీవే, ఇంద్రః = ఇంద్రుడవు, త్వం = నీవే, రుద్రః = రుద్రుడవు, త్వం = నీవే, విష్ణుః = విష్ణువు, త్వం = నీవే, బ్రహ్మః = బ్రహ్మవు, త్వం = నీవే, ప్రజాపతిః = విరాట్పురుషుడవు, త్వం = నీవే, తత్ = ప్రసిద్ధమగు, బ్రహ్మాండము, త్వం = నీవే, ఆపః = జలములు, త్వం = నీవే, జ్యోతిః = సూర్యాదులకు గల జ్యోతిస్సు, త్వం = నీవే, రసః = మధురాదిరసము, అమృతం = అమృతము, త్వం = నీవే, బ్రహ్మ = వేదరాశివి త్వం = నీవే, భూర్భువస్సువః = భూర్భువస్సువర్లోకస్వరూపుడవు (త్వం = నీవే), ఓం = ఓకారరూపుడవగు శబ్ద బ్రహ్మము

69 ఏకోనసప్తతి తమోఽను వాకః.

1. శ్రద్ధాయాం ప్రాణే నివిష్టోఽమృతం జుహోమి
2. శ్రద్ధాయామపానే నివిష్టోఽమృతం జుహోమి
3. శ్రద్ధాయాం వ్యానే నివిష్టోఽమృతం జుహోమి.
4. శ్రద్ధాయాముదానే నివిష్టోఽమృతం జుహోమి
5. శ్రద్ధాయాగ్ం సమానే నివిష్టోఽమృతం జుహోమి.
6. బ్రహ్మణి మఆత్మాఽమృతత్వాయ.

శ్రద్ధాయాం = శ్రద్ధ కలిగినదగు చుండగా, ప్రాణే = ప్రాణమను పేరుగల మొదటి వాయువునందు, నివిషః = ఆదరము గల వాడనై, (అహం = నేను) అమృతం = అమృతతుల్యమగు అనగా స్వాదుగుణములు కలిగిన ఈ హవిస్సును, జుహోమి = హోమము చేయుచున్నాను (అటులనే అపాన, వ్యాన, ఉదాన, సమాన ప్రాణములకు ముఖావహనీయాగ్నియందు హుతమొనర్చుచున్నాడను) ఇవి

ప్రాణాహుతి మంత్రములు
(6) ఈ అయిదు ఆహుతుల చేత, మే = నా యొక్క, ఆత్మా = జీవుడు, అమృతత్వాయ = మోక్షము కొఱకు, బ్రహ్మణి = పరబ్రహ్మమునందు (ఏకీభవతు = ఏకీభవించుగాక)

జలపాన మంత్రములు.
7. అమృతోపస్తరణమసి.

(ఓ జలమా ! నీవు), అమృతోపస్తరణం (ప్రాణదేవతకు) నశించని అస్తరణము, అసి = అయితివి (ఉపస్తరణమనగా - మంచము మున్నగు వాని మీద నిద్రించుటకై పరుచుకొను, పురుపు, కంబళి మున్నగునది అటులే ఈ జలము కూడా ప్రాణదేవతకు ఉపస్తరణము
ప్రాణాహుతి విషయమందు పక్షాంతరమందు కొందరు వికల్పముగా చెప్పిన మంత్రములు.

(1) శ్రద్ధాయాం ప్రాణే పనివిష్టోఽమృతం జుహోమి శివోమావిశాప్రదాహాయ । ప్రాణాయ స్వాహా.
(2) శ్రద్ధా యామపానే నివిష్టోఽమృతం జుహోమి శివోమా విశా ప్రదాహాయ । అపానాయ స్వాహా.
(3) స్రద్ధాయాం వ్యానే వివిష్టోఽమృతం జుహోమి శివోమా విశాప్రదాహాయ । వ్యానాయస్వాహా.
(4) శ్రద్ధాయాం ఉదానే నివిష్టోఽమృతం జుహోమి శివోమా విశా ప్రదాహాయువ్యానాయస్వాహా
(5) శ్రద్ధాయాగ్ం సమానే నివిష్టోఽమృతం జుహోమి శివోమావిశాప్రదాహాయ సమానాయ స్వాహా
(6) బ్రహ్మణిమఆత్మా ఽమృతత్వాయ

శ్రద్ధాయాం = శ్రద్ధకలిగిన దగుచుండగా, ప్రాణే = ప్రాణమను పెరుగల, ప్రథమ వాయువునకు, నివిష్టః = అదరము కలవాడనై (అహం = నేను) అమృతం = అమృత తుల్యమగు హవిస్సును, జుహోమి = హోమము చేయుచున్నవాడను (హుతము

చేయబడిన పదార్థమా ! నీవు) శివం = శాంతము అయిన దానివై, అప్రదాహాయ = ఆకలివల్ల కలిగిన దాహము నశించుటకై, మా = నన్ను, విశ = ప్రవేశించుము (ఈ హుత మొనర్చబడిన ద్రవ్యము) ప్రాణాయ = ప్రాణదేవత కొఱకు, స్వాహా = సుహుతమగు గాక !.
(అటులనే, అపాన, వ్యాన, ఉదాన, సమాన ప్రాణమములకు హుత మొనర్చబడినది – 2,3,4,5ల అర్థము వలెనే)
6 మే నా యొక్క, ఆత్మా = జీవుడు, అమృతత్వాయ = మోక్షము కొఱకు, బ్రహ్మణి = పరబ్రహ్మము నందు, ఏకీభవతు = ఏకీభవించుగాక

**అమృతాపిధానమసి.**
(ఆచమనము చేయబడుచున్న ఓ జలమా ! నీవు) అమృతాపిధానం = నశింపని, అచ్ఛాదనమైతివి అసి = అయితివి

## 70. సప్తతి తమోऽను వాకః.

(భోజనానంతరము ఉత్తరాపోశనము తర్వాత కాళ్ళు చేతులు కడుగు కొనిన పిదప భుజించిన అన్నమును అభిమంత్రించునట్టి మంత్రములు చెప్పబడుచున్నవి)

1 శ్రద్ధాయాం ప్రాణేనివిశ్యామృతగ్ం హుతమ్ ప్రాణమన్నే నా ప్యాయస్వ.
2. శ్రద్ధాయా మపానేనివిశ్యామృతగ్ం హుతమ్ అపానే మన్నేనాప్యాయస్వ
3. శ్రద్ధాయాంవ్యానేనివిశ్యామృతగ్ం హుతమ్ వ్యానమన్నే నా ప్యాయస్వ
4. శ్రద్ధాయాముదానేనివిశ్యామృతగ్ం హుతమ్ ఉదాన మన్నే నాప్యాయస్వ.
5. శ్రద్ధాయాగం సమానేనివిశ్యామృతగ్ం హుతమ్ సమానమన్నేనా ప్యాయస్వ

(అన్నేన = హుతమొనర్చబడిన అన్నము చేత, అప్యాయస్వ = వృద్ధిని పొందించుము).
(పై అన్నింటిని ఒకే అర్థము).

71 ఏకసప్తతితమోऽను వాకః

అంగుష్ఠ మాత్రం పురుషోऽఙ్గుష్ఠంచ సమాశ్రితః
ఈశసర్వస్యజగతః ప్రభుః ప్రీణాతి విశ్వభుక్.

పురుషః = జీవరూపుడగుపురుషుడు, అంగుష్ఠమాత్రః = స్వాంగుష్ఠ మాత్ర పరిమితి గలవాడు, అంగుష్ఠంచ = అంగుష్ఠము మొదలుకొని మస్తకము వరకు, సమాశ్రితః = ఆశ్రయించియున్నవాడు (అ పురుషుడు) సర్వస్య = సమస్తమైన, జగతః = జగత్తునకు, ఈశః = నియామకుడు (కావుననే) విశ్వభుక్ = సర్వమునను భవించువాడు (అట్టి) ప్రభుః = ప్రీణాతి = (ఈ భోజనము చేత) తృప్తి పొందుగాక!

ఆకలిమున్నగు వాని వలన కలిగిన చిత్త (విక్షేపము శాంతించిన పిదప భోక్తయగు జీవునకు పరమేశ్వరాను సంధాన హేతు భూతమగునట్టిమంత్రము)

72 ద్విసప్తతి తమోऽను వాకః

వాఙ్మఆసన్ । నసోః ప్రాణః। అక్ష్యోశ్చక్షుకర్ణయోః (శ్రోత్రవ్ం । బాహువోర్బలమ్ । ఊరువోరోజః । అరిష్టావిశ్వాఙ్గానితనూః తను వామే సహనమస్తే అస్తు మామాహిగ్ం సీః

ఓ పరమశ్వరా ! మే = నా యొక్క, ఆ సన్ = నోటియందు, వాక్ = వాగింద్రియ శక్తియు, నసోః = నాసికాగోళములందు, ప్రాణః = ప్రాణవాయుశక్తియు అక్ష్యోః = నేత్రగోళకములందు, చక్షుః = ఈక్షణశక్తియు, కర్ణయోః = కర్ణగోళకములందు, శ్రోత్రం = శ్రవణశక్తియు, పొందబడినవి) బాహువోః = బాహువులందు, బలం = బలము (కలిగినది), ఊరు వోః = తొడలయందు, ఉజః = గమనాగమశక్తియు (సంభవించినది) విశ్వాని = సమస్తమైన, అంగాని = అవయవములు, అరిష్టాని = స్వష్టములాయెను - మే = నా యొక్క, తనువానహా = సూక్ష్మశరీరము తోడ, తనూః = స్థూల శరీరము (స్వష్టమైనది) తే = నీకు, నమః = నమస్కారము, మా = నన్ను, మా హిగింసీః = పీడింపకువు (భోజనమైన పిదప పరమేశ్వరాను సంధానమును చెప్పి), పిదపభోక్త యొక్క సకలావయువములు స్వష్టత గా

యుండవలయునని కోరు మంత్రము - పరమేశ్వరుడు మనలకు కలుగ జేసిన మేళ్లను స్మరణకు తెచ్చు కోవలయును, అర్థము తెలిసికొని మంత్ర పఠనము చేసిన కలుగు ఆనందము అనిర్వచనీయము

73 త్రిసప్తతి తమోఽనువాకః

(ఈ విధముగా సర్వాంగ స్వాస్థ్య ప్రతిపాదక మంత్రమును వచించి, సర్వపాపక్షయార్థము, ఉత్తరోత్తర ధన ప్రాపకమునగు ఇంద్రసప్తర్షి సంవాద రూపకమగు మంత్రము చెప్పబడుచున్నది)

వయస్సు పర్ణా ఉపసేదురింద్రం ప్రియమేధా ఋషయో నాధమానాః ।
అపధ్వాన్తమూర్ణుహి పూర్ధిచక్షుర్ముముగ్ధ్యస్మాన్నిధయేఽవబద్ధాన్.

ప్రియమేధాః = సకలప్రాణులకు ప్రియమొనర్చెడి బుద్ధిగలిగి నట్టియు, సుపర్ణాః = మంచి రెక్కలు గల, వయః = పక్షులు వలెమంచి గమనము గల, ఋషయః = సప్తఋషులు, అపధ్వాన్తం = పోగొట్టబడిన హృదయాంధకారముగలిగినట్టియు, ఇంద్రం = ఇంద్రుని, నాధమానాః = (ఒకదానిని) యాచించుటకు కుతూహలముగల వారైరి (ఆకోరిన విషయమేమనగా)
పరమేశ్వరా ! ఊర్ణుహి = దివ్యములగు వస్త్రములచేతనన్నాచ్ఛాదింపుము. చక్షు = మా యొక్క కన్నులను పూర్ధి = (మంచి సౌందర్యము గల పదార్థముల కనబరచుము) నిండించుము అస్మాన్ = మమ్ములను, ముముగ్ధి = పాపములనుండి విముక్తులచేయుము నిధయే = నిధులకొఱకు, అవబద్ధాన్ = అసక్తులైన వారలను గా చేయుము (వారికి ఇంద్రుడు సమస్త భోగములనిచ్చెను)

74 చతుస్సప్తతి తమో ఽనువాకః
ప్రాణానాం గ్రంథిరసిరుద్రో మా విశాన్తకః తేనాన్నే నాప్యాయస్వ.

(హృదయవర్తివగు ఓ అహంకారమా ! నీవు), ప్రాణానాం = వాయురూపములను, ఇంద్రియరూపములునగు ప్రాణములకు గ్రంధిః = వదలిపోకుండుటకై, ముడి వంటి దానవు, అసి = అయితివి - (అట్టి) రుద్రః = (అహంకారాభిమాని దేవత)

రుద్రరూపుడవగునీవు, అంతకః = దుఃఖనివారకుడవయి మా = నా శరీరమును గూర్చి, విశ = ప్రవేశించుము, తేన = ఆ, అన్నేన = నేను భుజించు అన్నము చేత, ఆప్యాయస్వ = నన్ను వృద్ధి నొందించుము
( జపమైన పిదప హృదయమును స్పృశించి జపించవలసిన మంత్రము)

హృదయాభిమంత్రమును వచించి పిదప యావజ్జీవమున్మృత్యుపరిహారము కొరకు దేవతాస్తుత రూపమగు మంత్రము.

75. పంచసప్తతి తమో ఽను వాకః

నమోరుద్రాయవిష్ణవే మృత్యుర్మేపాహి

రుద్రాయ = పార్వతీ పతి కొఱకును, విష్ణవే = లక్ష్మిపతి కొఱకును, నమః = నమస్కారము, అస్తు అగుగాక ! ఓ రుద్ర విష్ణువులారా ! మే = నన్ను, మృత్యుః = మృత్యువునుంచి, పాహి = సంరక్షింపుడు
( రుద్ర విష్ణువులారా ! (లేక) విష్ణువైన ఓ రుద్రుడా ! )
( యథా శివమయో విష్ణుః ఏవం విష్ణుమయః శివః –

76. షట్ సప్తతి తమోఽను వాకః–

త్వమగ్నే ద్యుభి వాశు శుక్షణి !
స్త్వమభ్యస్త్వమశ్మనస్పరిత్వం వనేభ్యస్త్వం ఓషధేభ్యస్త్వం నృణాం
నృపతే జాయసే శుచిః

అగ్నే = ఓ అగ్నీ, త్వం = నీవు, ద్యుభిః = ఉత్తమ కాంతుల చేత (కూడుకొని యున్నాడవు, త్వం = నీవు, ఆశు శుక్షణిః = ( భక్తుల పాపములను) త్వరగా నశింపజేయువాడవు, త్వం = నీవు, అద్భ్యః పరి = జలములకు పైన ( కారణముగా యున్నాడవు), త్వం = నీవు, అశ్మనః పరి = మహామేరు పర్వతము మీదనున్నాడవు, త్వం = నీవు, వనేభ్యః = (వనేషు అని ఉండవలయును) = ఇది ఛాందసము) = నందనాది సకలవనములందు (విహరించెదవు), ఓషధీభ్యః =

( ఓషధీషు అని వుండవలెను) ఓషధులందు వ్యాపించి యున్నాడవు, నృపతే = యజమాన రూపులగు మనుష్యుల కధి పతివగు ఓ అగ్నీ ! నృణాం = మనుష్యులలో జాయసే = అగుచున్నావు. శుచిః = సర్వదాశుచివే

## 77 సప్త సప్తతి తమోஉను వాకః

శివేనమేసంతిష్ఠస్వ ! స్యోనేన మే సంతిష్ఠస్వ !
సుభూతేనమేసంతిష్ఠస్వ ! బ్రహ్మవర్చసేనమే సంతిష్ఠస్వ,
యజ్ఞస్యర్ధిమనుసంతిష్ఠ స్వోపతేయజ్ఞనమఉపతేనమఉపతే నమః.

యజ్ఞ = సర్వ, యజ్ఞ స్వరూపుడవగు ఓ పరమేశ్వరా, - తే = నీ కొఱకు, ఉప = సామీప్యమునందు, నమః = నమస్కారము, తే ఉపనమః = నీకు సామీప్యమునందు నమస్కారము ( నీవు) శివేన = కళ్యాణ ప్రదముగా, మే = నాయొక్క (గృహమునందు) సంతిష్ఠస్వ = బాగుగ కదలక కూర్చుండుము, స్యోనేన = ఐహిక సుఖప్రదానముతో, మే = నా యొక్క ( గృహమందు) సంతిష్ఠస్వ = బాగుగకదలక కూర్చుండుము. సుభూతేన = మహైశ్వర్య ప్రదానముతో, మే సంతిష్ఠస్వ, బ్రహ్మవర్చసేన = బ్రహ్మ వర్చస్సుతో, మే సంతిష్ఠస్వ, యజ్ఞస్య = ( నీ ప్రీతి కొఱకు చేయబడిన) యజ్ఞము యొక్క, ఋద్ధిం అను = వృద్ధిననుసరించి (పిదప తత్ఫలముననుభవించుటకుగాను, సంతిష్ఠస్వ = లెస్సగా కూర్చొని యుండుము (ఇందు పరమాత్మను అభీష్టములనొసంగుమని ప్రార్థించుచున్నాడు)

## 78. అష్టసప్తతి తమోஉను వాకః

( భోజన ప్రకరణము కర్మ ప్రకరణము సమాప్తమైనది సర్వ కర్మరూపమగు సంసార బీజదాహార్థము సన్న్యాసప్రకరణమారంభింపబడుచున్నది జ్ఞాన ప్రతిబంధకములగు మహాపాతకముల పరిహారార్థము జ్ఞానయోగ్యలక్షణములుగల శుద్ధిని వచించి, యోగ్యుడగు పురుషునకు జ్ఞానసాధనములగు కర్మలనన్నింటిలో సన్న్యాసమే శ్రేష్ఠమైనదని చెప్పదలచి ప్రథమమున సన్న్యాసభిన్నములగు, సాధనములను నిరూపించి పిదప దీనికంటె సన్న్యాసము శ్రేష్ఠమైనదని బోధించుచున్నారు

1. సత్యం పరం పరగ్ం సత్యం సత్యేన నసువర్గాల్లోకాచ్యవన్తే కదాచన సతాగ్ం హిసత్యం తస్మాత్సత్యే రమన్తే
2. తపఇతి తపో నానశనా త్పరం యద్ధిపరం తపస్త ద్దుర్ధర్షం తద్దురా ధర్షం తస్మాత్తపసిరమన్తే
3. దమఇతి నియతం బ్రహ్మచారిణస్త స్మాద్దమే రమన్తే
4. శమ ఇత్యరణ్యే మునయస్తా స్మాచ్ఛమే రమన్తే
5. దానమితి సర్వాణి భూతాని ప్రశగ్ంసన్తి దానాన్నాతి దుశ్చరం తస్మాద్దానే రమన్తే
6. ధర్మ ఇతిధర్మేణ సర్వమిదం పరిగృహీతం ధర్మాన్నాతి దుష్కరం తస్మాద్ధర్మేరమన్తే.
7. ప్రజన ఇతి భూయాగ్ంసస్తస్మాద్భూయిష్ఠాః - ప్రజాయన్తే త స్మాద్భూయిష్ఠాః ప్రజననే రమన్తే
8. అగ్నయ ఇత్యాహ తస్మాదగ్నయ అధాతవ్యాః రమన్తే
9. అగ్నిహోత్ర మిత్యా హతస్మాదగ్ని హోత్రేరమన్తే
10. యజ్ఞఇతి యజ్ఞోహిదేవాస్తస్మాద్యజ్ఞే రమన్తే
11. మానసమితి విద్వాగ్ం సస్తస్మాద్విద్వాగ్ం సఏవమానసేరమన్తే
12. న్యాసఇతి బ్రహ్మ బ్రహ్మహిపరః పరోహిబ్రహ్మతానివా ఏతాగ్య పరాణి పరాగం సన్యాసఏవత్యరేచయద్యఏవం వేదేత్యుపనిషత్.

1 సత్యవచనము పురుషార్థసాధనములందు శ్రేష్ఠమైనది సత్యవచనము శ్రేష్ఠమైనది. యావజ్జీవము సత్యమునే పలుకుట చేత స్వర్గమునుండి ఒకప్పుడు నూ పడిపోరు సత్యవాక్యము సజ్జన సంబంధమైనది అందుచేత సత్యవాక్యమునందు క్రీడించుచున్నారు

2 తపస్సే మోక్ష సాధనమని కొందరి మతము, తపస్సనగా భుజింపకుండట కంటె వేరైనదేదీ లేదు ఏ శ్రేష్ఠమయిన అనశన రూపమగు తపస్సుకలదో ఆ తపస్సు చేయుటకు అశక్యమైనది కదా । అందుచే కొందఱు మహాత్ములు తపస్సు నందు క్రీడించుచున్నారు

3 నైష్ఠిక బ్రహ్మచారులు దమమే మోక్షసాధనమని ఎల్లప్పుడూ చెప్పుచున్నారు. అందుచేత దమమునందు రమించుచున్నారు

4 అరణ్యమందుండుమునులు (వాన ప్రస్థానాశ్రమ వాసులు) శమమే మోక్షసాధనమని పలుకుచున్నారు అందుచేత శమము నందు రమించుచున్నారు
5 సకలప్రాణులు దానమే మోక్షసాధనమని ప్రశంసించుచున్నారు దానము కంటె కష్టమైన పని మరొకటి లేదు అందుచేదానమునందు క్రీడించుచున్నారు
6 వాపీ కూప తటాకాది నిర్మాణరూపమగు ధర్మమే మోక్షసాధన భూతమైనదని కొందరి మతము ధర్మము చేత ఈ సమస్త జగత్తు పరిగ్రహింపబడియున్నది ధర్మము కంటె చేయుటకు కష్టమైనది మరేదీలేదు అందుచేత ధర్మమునందు రమించుచున్నారు.
7 భూయాంసః = పలువురు, ప్రజన ఇతి = అపత్యోత్పాదనమే (మోక్షసాధనమని తలచి అందులోనే, భూయిష్ఠాః = పలువురు అపత్యోత్పాదనమందు అనురాగము కలిగియున్నారు
8 అగ్నులేమోక్ష సాధనమని వేదజ్ఞుడు ఒకడు చెప్పెను అందువలన, గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నులు, అధాతన్యాః - అధానమొనర్పదగినవి
9 అగ్నిహోత్రమే మోక్షసాధనమని ఒక వేదవిదుడు పలికెను అందువలన అగ్ని హోత్రమునందే (అగ్న్యాధానమైన వెనుక, గార్హపత్య ఆహవనీయ, దక్షిణాగ్నులందు సాయం ప్రాతః కాలములందు చేయుహోమము నందు రమించుచున్నారు
10 యజ్ఞమే మోక్షసాధనమని కొందఱు పలికిరి - యజ్ఞము చేత దేవతలు (దివాంగాతాహి = స్వర్గమును పొందిరి కదా) అందువల్లనే యజ్ఞమునందు రమించుచున్నారు.
11 కొందరు విద్వాంసులు మనోనిష్పాద్యమగు ఉపాసనమే మోక్షసాధనమని పలుకుచున్నారు అందువలన ఆ విద్వాంసులు ఉపాసనయందే ఆసక్తులైయున్నారు
12 బ్రహ్మ = హిరణ్యగర్భుడు, న్యాసః ఇతి = (వెనుక చెప్పిన అగ్ని హోత్రాదికము యొక్క) త్యాగమే (మోక్ష సాధనమని) పలికెను
బ్రహ్మ = ఆహిరణ్య గర్భుడు, పరఃహి = పరమాత్మ గదా । పరః హి = పరమాత్మయే, బహ్మ = హిరణ్యగర్భుడు, తాని = ఆ, ఏతాని = ఈ సత్యమమున్నగు పదకొండు సాధనములు, పారాంస్యైవ = శ్రేష్ఠము లైననూ, అపరాణి (సన్యాసము కంటె) తక్కువైనవే, - న్యాసః ఏవ = సన్న్యాసమే అత్యరేచయత్ = అన్నింటినీ అతిక్రమించెను యః = ఏ పురుషుడు, ఏవం = ఈ విధముగా, వేద = తెలుసుకొనుచున్నాడో (ఆ విద్వాంసునికి) ఇతి = ఈ విధమైన, ఉపనిషత్ = ఉపనిషద్రహస్యమగును

79. ఏకోనాశీతి తమోఽనువాకః.

(వెనుకటి అనువాకమునందు చెప్పబడిన మోక్షసాధనములను ఉపపాదింపదలచి ఈ అఖ్యాయికను చెప్పుచున్నాడు)

**ప్రాజాపత్యో హారుణిస్సుపర్ణేయః ప్రజాపతిం పితరముప ససార । కింభగవన్తః పరమంవదన్తీతి.**

ప్రజాపతి పుత్రుడను, సువర్ణయనుస్త్రీకి పుత్రుడను అగు అరుణియను వాడు తండ్రియగు ప్రజాపతి వద్దకు పోయి (తండ్రితో) తండ్రీ । పూజ్యులగు మహర్షులు ఉత్తమమగు మోక్షసాధనముగా దేనిని చెప్పుచున్నారు అని ప్రశ్నించెను అ విధముగా ప్రశ్నించిన అరుణికి ప్రజాపతి ఈ విధముగా పలికెను.

**(2) సత్యేన వాయురావాతి । సత్యేనాదిత్యోరోచతే । దివి సత్యం వాచః ప్రతిష్ఠాసత్యే సర్వం ప్రతిష్ఠితం తస్మాత్సత్యం పరమం వదన్తి.**

సత్యము చేతనే వాయువు అంతరిక్షము నందు వీచుచున్నాడు. సూర్యుడు ప్రకాశించుచున్నాడు వాక్కునకు సత్యమే స్థిరమైన స్థానము, సత్య వాక్యమునందు, (భాషణమందు) సమస్త వ్యవహార జాతము ప్రతిష్ఠింపబడియున్నది. అందుచే సత్యభాషణమునే శ్రేష్ఠమైన మోక్షసాధనమని వారు చెప్పుచున్నారు (అరుణికి ఈ సమాధానము తృప్తి కరముగా లేదు, అందుచే వేరే సాధనమును ప్రజాపతి చెప్పుచున్నారు

**3. తపసాదేవా దేవతా మగ్రే అయన్త పసరిషయస్సువరన్వ విన్దనపసా సపత్నా న్ప్రణుదామారాతీస్తపసి సర్వం ప్రతిష్ఠితం తస్మాత్తపః పరమం వదన్తి.**

(ఇప్పుడు స్వర్గమందున్న అగ్నీం ద్రాది) దేవతలు పూర్వజన్మమందు తపస్సుచేత ఇప్పటి దేవత్వమును అయన్ = పొందిరి, వశిష్ఠాది ఋషులు తపస్సుచేతను సువర్లోకమును, అన్వవిందన్ = (క్రమముగా పొందిరి (మేమిపుడు) తపస్సుచేత మాసంపదలకు అడ్డువచ్చుచున్న శత్రువులను తొలగించుకొనుచున్నాము సమస్తమైన

ఫలజాతము తపస్సు నందు ప్రతిష్ఠితమైయున్నది అందువలన అనశన రూపమైన తపస్సే ఉత్తమమైన మోక్షసాధనమని వారు చెప్పుచున్నారు అరుణికి ఈ సమాధానము నచ్చలేదు వేరొక దానిని చెప్పుచున్నారు

4. దమేన దాన్తా కిల్బిష మవధూన్వంతి దమేన బ్రహ్మచారిణస్సువ రగచ్ఛన్దమో భూతానాం దురాధర్షం దమే సర్వం ప్రతిష్ఠితం। తస్మాద్దమః పరమం వదన్తి

దాన్తులు = బాహ్యేంద్రియని గ్రహముగల పురుషులు దమము చేత పాపమును నాశనము చేసుకొనుచున్నారు దమముచేత నైష్ఠిక బ్రహ్మచారులు సువర్లోకమును పొందిరి దమము భూతములకు దురాధర్షః = పొందనలవిగానివి దమము వలన సమస్తమైన ఫలములు ప్రతిష్ఠింపబడియున్నవి ఆకారణమువలన దమమే శ్రేష్ఠమైన సాధనమని ఆ కొందరు చెప్పుచున్నారు –

(పైసాధన మందును అరుణికి సంతోషము కలుగలేదు–

5. శమేన శాన్తా శ్శివమాచరంతి, శమేననాకంమున యోఽన్వ విన్దఞ్ఛమో భూతానాందురాధర్షఞ్ఛమే సర్వం ప్రతిష్ఠితం। తస్మాచ్ఛమం పరమం వదన్తి:

కామక్రోధాధి దుర్గుణములు లేక, శాంతమగు అంతః కరణము కలిగి, శమము చేత మంగళకరమగు పురుషార్థమును పొందుతూ, నారదాది మునీశ్వరులు స్వర్గమును పొందిరి శమము భూతములకు దుస్పృహము శమమునందే సర్వము ప్రతిష్ఠింపబడియున్నది అందువలన శమము ఉత్తమమైన మోక్షసాదనమని శాంతి కలవారు చెప్పుచున్నారు.

6. దానం యజ్ఞానాం వరూథం దక్షిణాలోకే దాతారగ్ం సర్వభూతాన్యుపజీవతి। దానేనారాతీ రపానుదన్త దానేన ద్విషన్తో మిత్రాభవంతి దానే సర్వం ప్రతిష్ఠితం। తస్మాద్దానం పరమం వదన్తి.

యజ్ఞములలో చేయబడు, గో, భూ, హిరణ్యాదిదానములు, దక్షిణలు, వరూథం, శ్రేష్ఠమైనవి – లోకమునందు దాతను సర్వభూతములు ఆశ్రయించుచున్నవి దానము

చేత ద్వేషించు వారు సైతము మిత్రులగుచున్నారు దానమునందు సర్వము ప్రతిష్ఠితమైయున్నది అందుచే దానము శ్రేష్ఠమైన మోక్షమార్గమని చెప్పుచున్నారు

7. ధర్మోవిశ్వస్య జగతః ప్రతిష్ఠాలోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి ధర్మేణ పాపమపనుదతి ధర్మేసర్వం ప్రతిష్ఠితం. తస్మాద్ధర్మం పరమం వదన్తి

దర్మము సమస్త ప్రపంచమునకు ఆశ్రయభూతము లోకమందు మిక్కిలి ధర్మము నందుండు వానిని ప్రజలు ఆశ్రయించెదరు ధర్మము చేత పాపమును, అపనుదతి = పోగొట్టుకొనుచున్నారు ధర్మమునందు సమస్తము ప్రతిష్ఠింపబడియున్నది అందువలన ధర్మము శ్రేష్ఠమైన మోక్ష సాధనమని చెప్పుచున్నారు

8. ప్రజననంవై ప్రతిష్ఠా లోకే సాధు ప్రజాయాస్తన్తుం తన్వానః పితౄణామనృణో భవతి ! తదేవతస్యాఅనృణం తస్మా త్ప్రజననం పరమం వదన్తి.

పుత్రోత్పాదనము ! గృహస్థులకు ప్రతిష్ఠ కదా ! లోకమునందు ప్రజయొక్క తంతువును సాధు = శాస్త్రీయముగా, తన్వానః = విస్తరింపజేయువాడు పితరుల ఋణవిముక్తులచేయుచున్నారు ఆ ప్రజననమే ఆ గృహస్థునకు ఋణవిముక్తి, అందువలన ప్రజననమును శ్రేష్ఠమైన మోక్ష సాధనముగా చెప్పుచున్నారు (విశే - సోఽయంమనుష్యలోకః పుత్రేణైవ జయ్యో నాన్యేనకర్మణా అని శ్రుతి తెలుపుచున్నది = ఈ మనుష్యలోకము పుత్రుని చేతనే జయింపతగినది ఇతర కర్మచేత గాదు పుత్రపౌత్రాది ప్రజాతంతువును యధాశాస్త్రముగా విస్తరింపజేయువాడు పితృపితామహులకు మనము ఇవ్వవలసిన ఋణమును తీర్చుచున్నాడు.

9. అగ్నయోవైత్రయీ విద్యాదేవయానః పన్థా గార్హపత్య ఋక్ పృథివీ రథంతర మన్వాహార్య పచనం యజూరంతరిక్షం, వామదేవ్యమాహవనీయ స్సామ సువర్గోబృహత్తస్మాదగ్నీ పరమం వదన్తి

